# మనవి మాట

రాజ్య ప్రణాళికలోని జిల్లావారీ వివరాలు చూపే జిల్లా ప్రణాళికలో వరసలో 1959–60 సంవత్సరానికి సంబంధించిన యీ ప్రచురణ నాలుగవది. పుస్తకం మొదటి భాగంలో జిల్లాకు సంబంధించిన సాధారణ గణాంక సమాచారం ఇవ్వబడింది. దానితోపాటు రెండవ పంచవర్ష ప్రణాళిక క్రింద రాజ్య ప్రభుత్వం నాలుగవ సంవత్సరంలో నిర్వహించదలచిన కార్య క్రమాలుకూడ చేర్చబడినాయి. ఇక రెండవ భాగంలో తంతి, తపాలాశాఖ, రైలుమార్గాల అభివృద్ధితో సహా వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గురించి వివరింపబడింది. ఈ ప్రచురణ, జిల్లా పరిషత్తులకు కొంత ఉపయోగకరంగా ఉంటుందని ఆశించబడడంవల్ల దీనిని మెరుగుపరచేటందుకు జిల్లా పరిషత్తులు సూచనలు చేయగలవని ఆశించబడుతున్నది. సూచనలు ఎవరు పంపినా కృతజ్ఞతతో స్వీకరించబడతాయి. వాటిని హైదరాబాదులో ఉన్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రణాళికా శాఖ డిప్యూటి కార్యదర్శిగారికి పంప వచ్చును.

హైదరాబాదు
13–12–1959

సి. నరసింహం
ప్రభుత్వ ప్రణాళిక, స్థానిక
పరిపాలన శాఖ కార్యదర్శి.

# విషయసూచిక

# సాధారణ విషయాలు

## విస్తీర్ణం వర్గీకరణ

ఈ జిల్లా విస్తీర్ణం 2,904 చదరపుమైళ్ళు. ఇందులో 3 రెవిన్యూ డివిజన్లు, 8 తాలూకాలు ఉన్నాయి. 1956–57 సంవత్సరంలో ఈ జిల్లాలోని భూమి క్రింది విధంగా వర్గీకరించబడింది.

| | విస్తీర్ణం ఎకరాలలో | మొత్తం విస్తీర్ణంలో శాతం |
|---|---|---|
| మొత్తం భూమి విస్తీర్ణం | 19,11,622 | — |
| అడవులు | 1,70,049 | 9.0 |
| బీడుభూమి, సాగు క్రిందకు రాని భూమి | 1,75,924 | 9.3 |
| వ్యవసాయేతర పనులకు ఉపయోగింపబడుతున్న భూమి | 1,03,859 | 5.5 |
| సాగుకు లాయకీ అయిన బంజరు | 82,831 | 4.4 |
| శాశ్వత పచ్చిక బీళ్లు, ఇతర పచ్చిక బయళ్లు | 2,08,734 | 11.1 |
| సాగు చేయబడే నికరపు విస్తీర్ణంలో చేర్చబడని నానారకాలచెట్లు,తోటలు పంటలు ఉండే భూమి | 32,397 | 1.7 |
| ప్రస్తుత బంజర్లు | 1,34,852 | 7.1 |
| ఇతర బంజర్లు | 80,191 | 4.3 |
| సాగు చేయబడే నికరపు విస్తీర్ణం | 6,96,420 | 47.6 |
| ఒకసారికి మించి సాగు చేయబడే భూమి | 3,037 | 0.2 |
| మొత్తం పంట భూమి | 8,99,457 | 47.7 |

## వేర్వేరు ఋతు పవనాల వర్షపాతం

(అంగుళాలలో)

| | 1956–57 | 1955–56 | మామూలు |
|---|---|---|---|
| నైరుతి ఋతు పవనాలు | 33.5 | 37.3 | 28.2 |
| ఈశాన్య ఋతు పవనాలు | 4.7 | 2.5 | 3.3 |
| శీతాకాలం | 0.1 | — | 0.7 |
| వేసవికాలం | 2.6 | 3.9 | 3.5 |
| మొత్తం | 40.9 | 43.7 | 35.7 |

## నీటివనర్లు, నీటిపారుదల

ఉస్మాన్‌సాగరు, హుసేనుసాగరు, మీర్ ఆలం చెరువు, హిమాయత్ సాగరు — ఇవి హైదరాబాదు నగరంలోను, చుట్టు ప్రక్కలలోను ఉన్న ముఖ్యమైన చెరువులు. చెరువులు, బావులు నీటి పారుదలకు ముఖ్యాధారాలు.

## నీటివనర్లు

| | |
|---|---|
| 1. ప్రభుత్వ కాలువలు | 123 |
| 2. ప్రయివేటు కాలువలు | ... |
| 3. బావులు | ... |
| (ఎ) గొట్టపు బావులు | 66 |
| (బి) నీటి పారుదలకొరకు మాత్రమే ఉపయోగించబడే ఇతర బావులు | ... |
| (i) ప్రభుత్వంవారివి. | |
| (ఎ) రాతికట్టడం గలవి | 1,213 |
| (బి) రాతికట్టడం లేనివి | 3,666 |
| (ii) ప్రయివేటు వ్యక్తులవి. | |
| (ఎ) రాతికట్టడం గలవి. | — |
| (బి) రాతికట్టడం లేనివి | — |

| | |
|---|---|
| 4. గృహకృత్యాలకు మాత్రము ఉపయోగించబడుతున్న బావులు | 7,271 |
| 5. ఉపయోగంలో లేని బావులు | 451 |
| 6. రిజర్వాయర్లు | — |
| 7. చెరువులు | |
| (ఎ) నూరు ఎకరాలకన్నా ఎక్కువ ఆయకట్టు గలవి | 86 |
| (బి) నూరు ఎకరాలకన్నా తక్కువ ఆయకట్టు గలవి | 1,116 |

## *నీటిపారుదల జరుగుచున్న భూమి విస్తీర్ణం*

| | | |
|---|---|---|
| 1. ప్రభుత్వ కాలువల ద్వారా | ... | 11,498 |
| 2. ప్రయివేటు కాలువల ద్వారా | ... | 1,168 |
| 3. చెరువులద్వారా | ... | 64,944 |
| 4. బావుల ద్వారా | ... | |
| (ఎ) కేవలం నీటిపారుదలకు ఉపయోగించబడేవి | ... | 49,032 |
| (బి) ఇతర నీటి పారుదల వనరులకు తోడ్పడేవి | ... | — |
| (సి) ఇతర వనరులు (ఊటకాలువలు మొదలయినవి) | ... | 10,728 |
| 5. నీటి పారుదల జరుగుచున్న నికరపు భూమి | ... | 1,37,370 |
| 6. పంటపండే నికరపు భూమిలో నీటి పారుదల జరిగే నికరపు భూమి శాతం | ... | 15.3 |
| 7. ఒకే సంవత్సరంలో ఒకసారికంటె ఎక్కువగా నీటిపారుదల జరిగే భూమి విస్తీర్ణం | ... | 643 |
| 8. నీటిపారుదలవల్ల పంటలుపండే మొత్తం భూమి విస్తీర్ణం | ... | 1,38,019 |
| 9. పంటపండే మొత్తం విస్తీర్ణంలో నీటిపారుదల జరిగే విస్తీర్ణంయొక్క శాతం | ... | 15.3 |
| 10. స్వంత ఆయకట్లు ఉండే బావులు | ... | 790 |

11. గుర్తించబడిన నీటిపారుదల వనరులకు తోడ్పడే బావులు ... 181

12. నీటిపారుదల జరిగే మొత్తం నికరపు విస్తీర్ణంలో స్వంత ఆయకట్టుండే బావులద్వారా నీటిపారుదల జరిగే విస్తీర్ణం యొక్క శాతం ... 1.3

13. ఆయిలు ఇంజన్ల సంఖ్య ... 449

## *పంటలు*

జొన్న ఈ జిల్లాలో ముఖ్యమైన ఆహారపు పంట, వరి, సజ్జ, రాగి, మొక్కజొన్న, ఎల్లగిసె, ప్రత్తి – ఇవి ఇతర ముఖ్య పంటలు. 1956–57 సంవత్సరంలో సాగు చేయబడిన భూమి వివరాలు, పండించబడిన పంట వివరాలు క్రింద ఇవ్వబడినాయి.

| I చిరుధాన్యాలు. | విస్తీర్ణం (ఎకరాలలో) | మొత్తం పంట (టన్నులలో) |
|---|---|---|
| 1. వరి | 1,32,628 | *86,490 |
| 2. గోధుమ | 3,468 | 180 |
| 3. జొన్న | 2,23,918 | 43,840 |
| 4. సజ్జ | 21,631 | 2,750 |
| 5. బార్లి | 5,951 | — |
| 6. మొక్కజొన్న | 10,142 | 2,370 |
| 7. రాగి | 22,849 | 1,720 |
| 8. కొఱ్ఱ | 21,568 | 880 |
| 9. వరగు | 11,541 | 470 |
| 10. సమాయి | 20,880 | 850 |
| 11. ఇతర చిరుధాన్యాలు | 807 | 680 |
| మొత్తం చిరుధాన్యాలు | 4,75,383 | 90,230 |

*బియ్యం

## II పప్పు ధాన్యాలు

| | | |
|---|---|---|
| 1. శనగలు | 35,028 | 3,020 |
| 2. పెసలు | 9,834 | 410 |
| 3. కందులు | 16,983 | 1,080 |
| 4. మినుములు | 26,059 | 1,460 |
| 5. ఉలవలు | 36,307 | 1,530 |
| 6. ఇతర పప్పుధాన్యాలు | 2,796 | 130 |
| మొత్తం పప్పు ధాన్యాలు | 1,27,007 | 7,630 |

## III సంబారాలు

| | | |
|---|---|---|
| 1. పోకచెక్కలు | — | — |
| 2. మిరపకాయలు | 23,551 | 1,380 |
| 3. అల్లం | 204 | — |
| 4. పసుపు | 1,780 | |
| 5. వెల్లుల్లిపాయలు | 2,459 | |
| 6. ధనియాలు | 28,362 | |
| 7. చింతపండు | — | |
| 8. ఇతర సంబారాలు | 18,295 | |
| మొత్తం సంచారాలు | 74,651 | 1,380 |

## IV చెరకు పంటలు

| | | |
|---|---|---|
| 1. చెరకు | 1,982 | 3,520 |
| 2. తాటిబెల్లం | — | — |
| 3. ఇతరములు | — | — |
| మొత్తం చెరకుపంటలు | 1,982 | 3,520 |

V పండ్లు, కూరగాయలు

| | | |
|---|---|---|
| 1. (ఎ) తాజాపండ్లు | | |
| (i) అరటిపండ్లు | 182 | — |
| (ii) నిమ్మజాతికిచెందిన పండ్లు | 188 | — |
| (iii) మామిడిపండ్లు | 1,604 | — |
| (Vi) ఇతర తాజాపండ్లు | 444 | |
| మొత్తం తాజాపండ్లు | 2,418 | |
| (బి) ఎండుపండ్లు | | |
| (i) జీడిగింజలు | — | — |
| (ii) ఇతర ఎండుపండ్లు | 103 | — |
| మొత్తం ఎండుపండ్లు | 103 | |
| మొత్తం ఎండుపండ్లు, తాజాపండ్లు | 2,521 | |
| 2. కూరగాయలు | | |
| (ఎ) బంగాళా దుంపలు | 509 | 600 |
| (బి) కఱ్ఱపెండలము | 10 | |
| (సి) చిలగడ దుంపలు | 848 | |
| (డి) ఉల్లిగడ్డలు | 7,650 | 12,270 |
| (ఇ) ఇతర కూరగాయలు | 10,832 | |
| మొత్తం కూరగాయలు | 19,949 | 12,870 |
| మొత్తం పండ్లు, కూరగాయలు, దుంపపంటలతో సహా | 22,270 | |

| | | |
|---|---|---|
| VI వివిధరకాలకు చెందిన ఇతర ఆహార పంటలు | 547 | |
| మొత్తం ఆహారపంటలు | 7,01,860 | — |

## ఆహారేతర పంటలు

| | | |
|---|---|---|
| I నారలు | | |
| 1. ప్రత్తి | 4,547 | 400 |
| 2. బొంబాయి జనుము | 2,556 | 1,730 |
| 3. జనుము | 2,802 | — |
| 4. ఇతర నారలు | 255 | — |
| మొత్తం నారలు | 10,160 | 2,130 |
| II నూనె విత్తనాలు | | |
| (ఎ) ఆహారంలో ఉపయోగించబడేవి | | |
| (i) వేరుశెనగ | 19,144 | 3,710 |
| (ii) కొబ్బరి | 5 | |
| (iii) నువ్వులు | 15,579 | |
| (iv) రేప్ విత్తనాలు, ఆవాలు | 155 | 560 |
| (v) కుసుమలు | 30,350 | |
| (vi) ఇతరములు | 827 | |
| మొత్తము | 66,060 | 4,270 |
| (బి) ఆహారంలో ఉపయోగించ బడనివి. | | |
| (i) ఎల్లగిసె విత్తనాలు | 1,906 | |
| (ii) ఆముదాలు | 91,721 | 4,890 |

| | | |
|---|---|---|
| (iii) నిగర్ విత్తనాలు | 90,622 | |
| (vi) ఇతరములు | 622 | |
| మొత్తం | 1,84,911 | 4,890 |
| మొత్తం నూనెవిత్తనాలు | 1,78,971 | — |
| III అద్దకం రంగులు, తోళ్ళ పరికరాలు | | |
| 1. నీలిమందు (అద్దకంకోసం) | 1 | — |
| 2. ఇతర అద్దకపు రంగులు | — | — |
| మొత్తం అద్దకపు రంగులు | 1 | — |
| IV మందులు, మత్తు పదార్థాలు. | | |
| 1. కాఫి | — | |
| 2. జనుము | — | |
| 3. తమలపాకులు | 76 | |
| 4. పొగాకు | 1,887 | 230 |
| 5. ఇతరమందులు, మత్తుపదార్థాలు | — | |
| మొత్తం మందులు, మత్తు పదార్థాలు | 1,963 | 230 |
| V పశుగ్రాసపు పంటలు | 5,957 | — |
| VI పచ్చి ఎరువు పైరులు | — | |
| VII వివిధ ఆహారేతర పంటలు | 545 | |
| i మొత్తం ఆహారేతర పంటలు | 1,97,597 | |
| ii మొత్తం పంట భూమి | 8,99,457 | |
| iii ఒకసారికి మించి పంటపండే భూమి | 3,037 | |
| iv నికరపు పంటభూమి | 8,96,420 | |

## స్థానిక పరిపాలన

30-9-59 తేదీనాటికి ఈజిల్లాలో హైదరాబాదు, సికిందరాబాదులలో 2 మునిసిపలు కార్పొరేషన్లు, తాండూరులో ఒక సిటీ మునిసిపాలిటి, వికారాబాదు, ఇబ్రహీంపట్టణం, పర్గి, షాబాదు, మేడ్చల్, అల్వాలులలో 6 టౌను మునిసిపాలిటీలు, 154 పంచాయతీలు ఉన్నాయి.

## తపాలా ఆఫీసులు

1-5-58 తేదీనాటికి ఈ జిల్లాలో 2 హెడ్- ఆఫీసులు, 72 సబ్- ఆఫీసులు, 137 బ్రాంచి ఆఫీసులు, 17 టెలిగ్రాఫ్ ఆఫీసులు, 29 పబ్లిక్ కాల్ ఆఫీసులు ఉన్నాయి.

## రైలుమార్గాలు

మన్మాడు కొకటి, ద్రోణాచలంకు ఒకటి మొత్తం రెండు మీటరు గేజి రైలుమార్గాలు హైదరాబాదు నుండి ఉన్నాయి. వాడికిఒకటి, విజయవాడకొకటి బ్రాడుగేజి రైలు మార్గాలు కూడ ఉన్నాయి.

## రోడ్లు

1-4-59 తేదీనాటికి ఈ జిల్లాలో 720 మైళ్ళరోడ్లు ఉన్నాయి. అవి క్రింది విధంగా వర్గీకరించబడినాయి.

| | | | |
|---|---|---|---|
| 1. | జాతీయ రహదారులతో సహా ప్రభుత్వ రహదారుల శాఖచే నిర్వహించబడుతున్న రోడ్లు. | ... | 376 |
| 2. | మునిసిపాలిటీలచే నిర్వహించబడుతున్నరోడ్లు | ... | 282 |
| 3 | స్థానిక సంస్థలచే నిర్వహించబడుతున్న రోడ్లు | ... | 62 |
| | మొత్తం | ... | 720 |

## సహకారం

30-6-57 తేదీనాటికి ఈ జిల్లాలో 13 ప్రభుత్వ మరియు కేంద్ర పరపతేతర సంఘాలు, 385 వ్యవసాయ సహకార సంఘాలు, ఒక వ్యవసా

చేతర సహకార సంఘం ఉన్నాయి. వీటిలో సభ్యులసంఖ్య వరుసగా 12,771;17,954; మరియు 213.

## విద్య

1956-57 సం. లో ఈ జిల్లాలో ఉన్న విద్యాసంస్థల సంఖ్య క్రింద ఇవ్వబడింది :-

| | | | |
|---|---|---|---|
| 1. | ఉన్నతపాఠశాలలు | ... | 67 |
| 2. | మాధ్యమిక పాఠశాలలు | ... | 68 |
| 3. | ప్రాథమిక పాఠశాలలు | ... | 1,033 |
| 4. | వయోజన విద్యా కేంద్రాలు | ... | 31 |
| 5. | ప్రత్యేక పాఠశాలలు, వృత్తి విద్యా కేంద్రాలు | ... | 10 |
| 6. | కళాశాలలు, వృత్తి విద్యాకళాశాలలు | ... | 21 |
| | మొత్తం | ... | 1,230 |

## వైద్యం, ఆసుపత్రిలు

1956- 57 సం. లో ఈ జిల్లాలో 30 జనరలు ఆసుపత్రులు, 11 వైద్య శాలలు, పత్యేక చికిత్సకోసం 8 ఆసుపత్రులు ఉన్నాయి.

## రెండవ ప్రణాళికలోని నాలుగవ సంవత్సరపు కార్యక్రమ స్వరూపం

రాజ్య ప్రభుత్వోద్యోగులు ప్లానింగు కమిషను ఉద్యోగులతోను, కేంద్ర మంత్రాంగశాఖల ఉద్యోగుల తోను సంప్రదింపులు జరిపిన తరువాత రెండవప్రణాళిక యొక్క నాలుగవ సంత్సరపు కార్యక్రమం క్రింద రు.37.66 కోట్ల మొత్తాన్ని ఖర్చు పెట్టడానికి నిర్ణయించబడింది. కానీ రాజ్యప్రభుత్వం వారు వివిధ విషయాలను పరిశీలించిన మీదట, ప్రణాళిక, అభివృద్ధి విషయాలను గురించి సలహాల నిచ్చుట కు ఏర్పాటు చేయబడిన రాజ్యసలహా సంఘములో ఈ విషయాన్ని సమగ్రంగా చర్చించిన మీదట వర్తమాన సంవత్సరంలో ఖర్చు పెట్టదలచిన మొత్తం రు. 42.03 కోట్లకు పెంచటానికి నిశ్చయించబడింది. ఈ విధమైన హెచ్చింపు చేయటానికిగల ముఖ్య కారణాలు క్రింద ఇవ్వబడినాయి.

(i) వర్తమాన సంవత్సరపు ప్రణాళికా మొత్తాన్ని హెచ్చించక పోయిన ట్లయితే రెండవ ప్రణాళిక యొక్క చివరి సంవత్సరం లో పూర్తి చేయవలసిన పనులు ఎక్కువగా మిగిలిపోతాయి;

(ii) ఎక్కువచేయబడిన మొత్తాన్ని ఖర్చు పెట్టేటందుకు తగినంతగా రాజ్య పరిపాలనాయంత్రాంగం సంసిద్ధం చేయబడింది;

(iii) ఇంతకు ముందే కలిగించబడిన ఆదాయ మార్గాలనన్నిటిని పూర్తిగా వినియోగించు కోవలసిన అవసరం ఎంతోఉంది;

(iv) ఈ పాటి ప్రణాళికను అమలుపరచుటకు రాజ్యం యొక్క ఆదాయ మార్గాలు చాలినంతగా ఉన్నాయి.

ప్రతిఅభివృద్ధి కార్యక్రమం క్రింద కేటాయించబడిన మొత్తం పెంచ బడింది. ఆ వివరాలు మొదటి పట్టికలో చూడవచ్చును.

వర్తమాన సంవత్సరంలో చేయబడిన కేటాయింపు ఇదివరకటి సంవత్సరాలలో చేయబడిన కేటాయింపు లన్నిటికన్నా ఎక్కువ. నిరుడు సంవత్సరం మొదటిసారిగ చేయబడిన ప్రణాళిక కేటాయింపు కంటె ఈ సంవత్సరం మొదటి సారిగ చేయబడిన ప్రణాళిక కేటాయింపు రు. 12 కోట్ల ఎక్కువ. నిరుడు సంవత్సరం సవరించబడిన ప్రణాళిక కేటాయింపు కంటె ఈ సంవత్సరం సవరించబడిన ప్రణాళిక కేటాయింపు రు. 7 కోట్లు ఎక్కువ. రెండవ ప్రణాళిక యొక్క మొదటి నాలుగు సంవత్సరాలలోను కేటాయించ బడిన ప్రణాళికా మొత్తం వివరాలు రెండవ పట్టికలో చూడవచ్చును.

ప్రతి అభివృద్ధి కార్యక్రమం క్రింద చేయబడిన కేటాయింపు ఎక్కువ చేయబడటం ఇక్కడ గమనించవచ్చును. అయితే వివిధ విషయాల పద్దు క్రింద చేయబడిన కేటాయింపు మాత్రం కొంతవరకు తగ్గింది. 1958-59 సంవత్సరం తో పోల్చి చూసినట్లయితే ఈ సంవత్సరం పరిశ్రమలు, రవాణా, సాంఘిక కార్యక్రమాల క్రింద ఎక్కువ మొత్తం కేటాయించబడింది. ముందుసంవత్సరాల్లో మాదిరిగానే ఈ సంవత్సరం కూడ వివిధ కార్యక్రమాలకు తగిన ప్రాధాన్య మివ్వ బడింది.

వర్తమాన సంవత్సరం లో అమలు జరుపబడే పథకాల వివరాలు, కేటాయించబడిన మొత్తం వివరాలు, సాధించ దలచిన లక్ష్యాలు రెండవ భాగంలో వివరించబడినాయి.

వర్తమాన సంవత్సర కార్యక్రమం యొక్క స్థూలస్వరూపాన్ని తెలిపే టందుకు గాను 1959-60 సంవత్సరంలో సాధించదలచిన లక్ష్యాల వివరాలు క్రింద తెలుపబడినాయి.

లక్ష్యాలవివరాలు

| | పద్దు | యూనిట్టు | 1959–60 సంవత్సరపు లక్ష్యాలు |
|---|---|---|---|
| | వ్యవసాయం | | |
| 1. | ఆహారధాన్యాల ఉత్పత్తి | 000 టన్నులు | |
| (i) | పెద్దతరహా నీటిపారుదల పనులు | ,, | 190.60 |
| (ii) | చిన్న తరహా నీటిపారుదల పనులు | ,, | 38.70 |
| (iii) | భూమి అభివృద్ధి | ,, | 44.50 |
| (iv) | ఎరువులు, రసాయనిక ఎరువులు | ,, | 43.00 |
| (v) | మేలురకం విత్తనాలు | ,, | 21.00 |
| (vi) | సస్యరక్షణ | ,, | — |
| (vii) | పై కార్యక్రమాల క్రింద ఉత్పత్తికి గాను కేటాయింపు చేసిన తరువాత మేలురకం వ్యవసాయ విధానాలను అవలంబించటానికి | ,, | 89.60 |
| | | ,, | 427.40 |
| | ఆహారేతర పంటలవల్ల తగ్గింపు | ,, | 11.30 |
| | | | 416.10 |
| | చిన్న తరహా నీటిపారుదల పనులు | 000 ఎకరాలు | వివరాలు అందుబాటులోలేవు |

| | | |
|---|---|---|
| నీటిపారుదల జరుగుచున్న విస్తీర్ణం | — | — |
| విత్తనాల క్షేత్రాలు | సంఖ్య | 188 |
| (i) విత్తనాల క్షేత్రాల స్థాపన కోసం భూమి స్వాధీనం చేసుకోబడినట్టి క్షేత్రాలు | — | — |
| (ii) వ్యవసాయ కార్యక్రమాలు ప్రారంభించబడిన క్షేత్రాలు | — | — |
| (iii) విత్తనాల ఉత్పత్తిని ప్రారంభించిన క్షేత్రాలు. | — | — |
| ఎరువులు | | |
| (i) పట్టణాల్లో కంపోస్టు తయారి | 000 టన్నులు | 245.16 |
| (ii) గ్రామాల్లో కంపోస్టు తయారి | ,, | ప్రతి పంచాయతీలోను 75 టన్నులు. |
| (iii) పచ్చి ఎరువులు | ,, | 0.40 |
| రసాయనిక ఎరువులు | 000 టన్నులు | |
| (i) అమోనియం సల్ఫేటు | ,, | 148.40 |
| (ii) సూపర్–ఫాస్ఫేటు | ,, | 47.60 |
| (iii) యూరియా | ,, | 19.50 |
| (iv) అమ్మోనియం నైట్రేటు | ,, | 27.50 |
| (v) కాల్షియం అమ్మోనియం నైట్రేటు | ,, | 8.00 |
| ప్రభుత్వంచే భూములలో స్థిరపరచబడే | | వివరాలు |
| భూముల్లేని కుటుంబాలు | సంఖ్య | అందుబాటులో లేవు |

2. పశుగణాభివృద్ధి

| | | |
|---|---|---|
| కీలక గ్రామ పథకం | | |
| కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాలు | సంఖ్య | 11 |

| | | |
|---|---|---|
| కీలక గ్రామాలు | సంఖ్య | 66 |
| **3. సహకార సంఘాలు** | | |
| చిన్నతరహా సంఘాలు | | |
| ప్రతిష్ఠం చేయబడినట్టివి. | ,, | 1,000 |
| క్రొత్తవి. | ,, | 1,000 |
| సహకార వ్యవసాయసంఘాలు | ,, | 12 |
| సహకార వ్యవసాయసంఘాలు | విస్తీర్ణం ఎకరాలలో | 3,376 |
| సహకార సంఘాల ద్వారా ఇవ్వబడే వ్యవసాయ ఋణం | | |
| | రూపాయలు లక్షలలో (సంవత్సరానికి) | |
| స్వల్పకాలిక ఋణాలు | ,, | 1,320 |
| మధ్యకాలిక ఋణాలు | ,, | 130 |
| ధీర్ఘకాలిక ఋణాలు | ,, | 171 |
| మార్కెటింగు ఫైనాన్సు | ,, | 450 |
| **4. సామూజికాభివృద్ధి కేంద్రాలు** (జాతీయ విస్తరణ సేవా కేంద్రాల కార్యక్రమంతోసహా) | | |
| సంఖ్య | సంఖ్య మొదటి దశ బ్లాకులు | 26 |
| | రెండవ దశ బ్లాకులు | 20 |
| జనాభా | మిలియన్లు | 1.675 |
| ఈ కార్యక్రమం క్రింద తీసుకొని రాబడిన గ్రామాల సంఖ్య | సంఖ్య | 1,600 |
| **5. పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనులు** | | |
| సంభవమయ్యే అదనపు నీటిపారుదల కల్పించబడేభూమి | 000 ఎకరాలు | 418 |
| అదనంగా నీటిపారుదల కల్పించబడే భూమి | ,, | 418 |

6. విద్యుచ్ఛక్తి

| | | |
|---|---|---|
| అదనంగా ఉత్పత్తి చేయబడే విద్యుచ్ఛక్తి | 000 కిలోవాట్లు | 29,750 |
| 33 కిలోవాట్లకు మించిన ట్రాన్స్మిషన్ లైన్లు | మైళ్ళు | 290 |
| 33. కె. వి మరియు అంతకంటె తక్కువ ట్రాన్స్మిషను లైన్లు | మైళ్ళు | 400 |
| విద్యుతీకరణం చేయబడిన పట్టణాలు, గ్రామాలు | సంఖ్య | 200 |

7. వరద నివారణ

| | | |
|---|---|---|
| రక్షణకల్పించబడే అదనపుభూమి | 000 ఎకరాలు | 48 |

8. రోడ్లు

| | | |
|---|---|---|
| నిర్మించబడిన కంకరరోడ్ల పొడవు | మైళ్ళు | 29.4 |

9. విద్య

| సంస్థలు | సంఖ్య | |
|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు, జూనియరు బేసిక్ పాఠశాలలు కలుపుకొని | ,, | 1,600 |
| జూనియరు బేసిక్ పాఠశాలలు | ,, | 419 |
| మాధ్యమిక పాఠశాలలు, సీనియరుబేసిక్ పాఠశాలలు కలుపుకొని | ,, | 32 |
| సీనియరు బేసిక్ పాఠశాలలు | ,, | — |
| ఉన్నత పాఠశాలలు | ,, | 18 |
| హైయ్యరు సెకండరీపాఠశాలలు | ,, | 10 |
| బహుళార్థ సాధక పాఠశాలలు | ,, | 4 |
| సాంకేతిక విద్యడిగ్రీ/ డిప్లొమా | ,, | — |
| వివిధ తరగతుల్లో చేరే విద్యార్థులు | ,, డిప్లొమా | 1,150 |
| | ,, డిగ్రీ | 360 |

| | | |
|---|---|---|
| I వ తరగతి నుండి V వ తరగతి వరకు | సంఖ్య | 50,000 |
| VI వ తరగతి నుండి VIII వ తరగతి వరకు | ,, | 20,910 |
| IX వ తరగతి నుండి XI వ తరగతి వరకు | ,, | 6,900 |
| ఉపాధ్యాయులకు శిక్షణ | | |
| శిక్షణ పాఠశాలలలో చేర్చుకోబడే అభ్యర్థులు (బేసిక్, నాన్ బేసిక్ తరగతులు కలుపుకొని) | ,, | 2,250 |
| శిక్షణ కళాశాలలలో చేర్చు కోబడే అభ్యర్థులు (బేసిక్, నాన్-బేసిక్ తరగతులు కలుపుకొని) | ,, | 200 |
| 10. ఆరోగ్యం | | |
| ఆరోగ్య కేంద్రాలు | సంఖ్య | |
| సామాజి కాభివృద్ధి కార్యక్రమం క్రింద ఇతర కార్యక్రమాల క్రింద | ,, | 20 |
| కుటుంబ నియంత్రణ కేంద్రాలు | | |
| (i) పట్టణ కేంద్రాలు | ,, | 15 |
| (ii) గ్రామీణ కేంద్రాలు | ,, | 44 |
| శిక్షణ సౌకర్యాలు | | |
| (i) డాక్టర్లు | ,, | 450 |
| (ii) నర్సులు | ,, | 120 |
| (iii) దాయీలు | ,, | 720 |
| (iv) సహాయక నర్సు-మంత్రసానులు | ,, | 90 |
| (v) మంత్రసానులు | ,, | 158 |

గృహావసతి.

| | | |
|---|---|---|
| పారిశ్రామిక గృహనిర్మాణం | | |
| నిర్మించబడిన యూనిట్లు | సంఖ్య | 1365 |
| తక్కువ ఆదాయం గలవారికి గృహ నిర్మాణం | | |
| నిర్మించబడిన యూనిట్లు | ,, ఆర్.సి.ఎస్. | 680 |
| | ,, డి.టి.పి. | 180 |
| కార్మికులు—కార్మిక సంక్షేమం | | |
| వృత్తిపనివారికి శిక్షణ | ,, | వివరాలు అందుబాటులో లేవు. |
| శిక్షణ కేంద్రాలు | ,, | — |
| శిక్షణ ఇవ్వబడిన వారి సంఖ్య | ,, | 1,816 |
| వెనుకబడిన తరగతులవారి సంక్షేమం. | | |
| షెడ్యూల్డు తెగలు. | | |
| స్కాలరుషిప్పులు | ,, | 2,465 |
| సహాయం చేయబడిన కుటుంబాలు | ,, | 637 |
| ఏర్పాటు చేయబడిన వైద్యాలయాలు | ,, | — |
| నిర్మించబడిన రోడ్లు | మైళ్లు | 78 |
| షెడ్యూల్డు తెగలు | | |
| స్కాలరుషిప్పులు | సంఖ్య | 4,900 |
| సహాయం చేయబడిన కుటుంబాలు | ,, | 850 |
| విముక్త జాతులు | | |
| స్కాలరుషిప్పులు | సంఖ్య | — |
| పునరావాసం కల్పించబడిన కుటుంబాలు | ,, | 275 |
| ఇతర వెనుకబడిన తరగతులు | | |
| స్కాలరుషిప్పులు | ,, | 5,730 |
| సహాయం చేయబడిన కుటుంబాలు | ,, | — |

## మొదటి పట్టిక

1959–60 సంవత్సరపు ప్రణాళికలో కేటాయించబడిన మొత్తం వివరాలు

(రూపాయలు, లక్షలలో)

| వరుస సంఖ్య | అభివృద్ధి కార్యక్రమం వివరం | 1959–60 లో కేటాయింపు | | | మొత్తం ప్రణాళిక కేటాయింపులో |
|---|---|---|---|---|---|
| | | ఆంధ్ర | తెలంగాణా | ఆంధ్ర ప్రదేశ్ | శాతం |
| | వ్యవసాయ కార్యక్రమాలు | 687.142 | 373.080 | 1,060.222 | 25.23 |
| 1. | వ్యవసాయోత్పత్తి | 120.710 | 47.180 | 167.890 | 4.00 |
| 2. | చిన్న తరహా నీటిపారుదల పనులు. | 105.81 | 69.19 | 175.000 | 4.16 |
| 3. | భూమి అభివృద్ధి | 5.300 | — | 5.300 | 0.13 |
| 4. | పశుగణాభివృద్ధి | 66.062 | 21.470 | 87.532 | 2.08 |
| 5. | పాడి పరిశ్రమ-పాల సరఫరా | 12.550 | 15.940 | 28.490 | 0.68 |
| 6. | అడవులు | 16.520 | 21.720 | 38.240 | 0.91 |
| 7. | భూసార రక్షణ | 13.810 | 6.060 | 19.870 | 0.47 |
| 8. | మత్స్య సంవర్ధన | 15.710 | 7.290 | 23.000 | 0.55 |
| 9. | సహకారం, గిడ్డంగులు, మార్కెటింగు | 81.370 | 58.270 | 139.640 | 3.32 |
| 10. | వివిధ విషయాలు | 3.000 | 1.360 | 4.360 | 0.10 |
| 11. | సామాజికాభివృద్ధి జాతీయ విస్తరణ సేవా కార్యక్రమాలు | 240.850 | 119.150 | 360.000 | 8.57 |
| 12. | పంచాయతీలను పటిష్ఠం చేయటం | 5.450 | 5.450 | 10.900 | 0.26 |
| | నీటిపారుదల, విద్యుచ్ఛక్తి | 994.960 | 711.090 | 1,706.050 | 40.60 |
| 13. | బ్రహుళార్థసాధక ప్రాజెక్టు | 445.000 | 255.000 | 700.000 | 16.66 |
| 14. | పెద్ద తరహా, మధ్యతరహా నీటిపారుదల పనులు | 242.470 | 265.220 | 507.690 | 12.08 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 15. | విద్యుచ్ఛక్తి | 307.490 | 190.870 | 498.360 | 11.86 |
| | *పరిశ్రమలు* | 219.720 | 75.410 | 295.130 | 7.02 |
| 16. | పెద్ద తరహా మధ్యతరహా పరిశ్రమలు | 83.850 | — | 83.850 | 1.99 |
| 17. | గ్రామీణ పరిశ్రమలు, చిన్న తరహా పరిశ్రమలు | 88.750 | 54.630 | 143.380 | 3.41 |
| 18. | చేనేత పరిశ్రమలు | 47.120 | 20.780 | 67.900 | 1.62 |
| | *రవాణా* | 145.920 | 64.430 | 210.350 | 5.01 |
| 19. | రోడ్లు | 116.090 | 64.430 | 180.520 | 4.30 |
| 20. | రోడ్డు రవాణా | 29.830 | — | 29.830 | 0.71 |
| | *సాంఘిక కార్యక్రమాలు* | 514.980 | 361.826 | 876.806 | 20.86 |
| 21. | విద్య | 188.670 | 134.610 | 323.280 | 7.69 |
| 22. | వైద్యం | 88.060 | 61.940 | 150.000 | 3.57 |
| 23. | ప్రజారోగ్యం | 46.540 | 30.390 | 76.930 | 1.83 |
| 24. | గ్రామీణ, పట్టణ నీటిసరఫరా | 16.340 | 33.280 | 49.620 | 1.18 |
| 25. | గృహనిర్మాణం | 46.17 | 66.08 | 112.250 | 2.67 |
| 26. | కార్మికులు, కార్మికసంక్షేమం | 16.510 | 14.050 | 30.560 | 0.73 |
| 27. | వెనుకబడిన తరగతుల, షెడ్యూల్డు కులాల సంక్షేమం | 40.920 | 14.350 | 55.270 | 1.32 |
| 28. | షెడ్యూల్డు తెగల సంక్షేమం | 48.160 | 5.666 | 53.826 | 1.28 |
| 29. | స్త్రీ సంక్షేమం | 4.110 | 1.460 | 5.570 | 0.13 |
| 30. | సాంఘిక సంక్షేమం | 19.500 | — | 19.500 | 0.46 |
| | *వివిధ విషయాలు* | 49.250 | 4.710 | 53.960 | 1.28 |
| 31. | రాజధాని అభివృద్ధి | 20.000 | — | 20.000 | 0.48 |
| 32. | మునిసిపలు రోడ్లు, అభివృద్ధి పనులు | 11.590 | — | 11.590 | 0.28 |
| 33. | రేడియో ప్రసారం | 4.860 | 1.670 | 6.530 | 0.15 |
| 34. | ప్రచారం | 3.760 | 3.040 | 6.800 | 0.16 |
| 35. | అర్థగణాంక శాఖ | 9.040 | — | 9.040 | 0.21 |
| | మొత్తం | 2,611.972 | 1,590.546 | 4,202.518 | 100.00 |

# వ్యవసాయోత్పత్తి

## విత్తనాల క్షేత్రాయి, విత్తనాల స్టోర్లు

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో వ్యవసాయోత్పత్తిని ఎక్కువ చేసే ఉద్దేశంతో ప్రతి బ్లాకులోను ఒక విత్తనాల క్షేత్రాన్ని స్థాపించవల సిందిగా, ఒక విత్తనాల స్టోరును నిర్మించవలసిందిగా సిఫారసు చేస్తూ రాజ్య ప్రభుత్వాలకు కేంద్రప్రభుత్వంవారు ఒకనమూనా పథకాన్ని సూచించారు. ప్రతి క్షేత్రంయొక్క వైశాల్యం సగటున 25 ఎకరాలు ఉంటుంది. ప్రతి క్షేత్రానికి రు. 10,000 లు ఖరీదయ్యే ఒక విత్తనాల స్టోరు అనుబంధించ బడుతుంది. ఈ పథకం 1957–58 సం.లో అమలు జరుపబడింది. ఇంతవరకు 65 విత్తనాల క్షేత్రాలు, 24 విత్తనాల స్టోర్లు ఏర్పాటు చేయబడినాయి. 47 విత్తనాల స్టోర్లు నిర్మాణంలో ఉన్నాయి. 1959–60 సం.లో 59 విత్త నాల క్షేత్రాలను, 59 విత్తనాల స్టోర్లను ఏర్పాటు చేయటానికి ప్రతి పాదింప బడింది. ఇందుకు గాను ప్రణాళికలో రు. 24.60 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలో ఒక విత్తనాల క్షేత్రాన్ని ఒక విత్తనాల స్టోరును ఏర్పాటు చేయటం కోసం పై మొత్తంలో రు.1.38 లక్షల మొత్తం ప్రత్యేకించబడింది.

## విత్తనాల అభివృద్ధి, సరఫరా

మేలురకం వరి, జొన్న, గోధుమ, మొక్కజొన్న, కాయధాన్యాల విత్తనాలు రిజిష్టరయిన ఉత్పత్తి దారులనుండి కొనబడి, ఈ పథకం క్రింద రైతులకు తక్కువ ధరలకు సరఫరా చేయబడుతాయి. ఈ విధంగా సరఫరా చేయబడే వరి, గోధుమ, మొక్కజొన్న విత్తనాల ధర మణుగుకు రెండు రూపాయలు; జొన్నవిత్తనాల ధర మణుగుకు ఒక రూపాయి. తెలంగాణా ప్రాంతంలో ఈ పథకం 1956–57 సం. నుంచి అమలులో ఉన్నది. వర్తమాన సంవత్సరంలో ఆంధ్ర ప్రాంతానికి కూడ ఈ పథకం క్రింది సౌకర్యాలను విస్తరింప చేయటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను 1959–60 ప్రణా ళికలో రు. 7.53 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 5.22 లక్షల మొత్తం ఆంధ్ర ప్రాంతంలో విత్తనాలను పంచటానికి వినియోగించ

బడుతుంది. మిగత రు. 2.31 లక్షల మొత్తం తెలంగాణా ప్రాంతంలో విని యోగించబడుతుంది. ఈ పథకం క్రింద ఈ జిల్లాలోని రైతులు కూడ ప్రయోజనం పొందుతారు,

## *గంధకం సరఫరా; సస్యరక్షణ పద్ధతులను అవలంబించటం*

తెలంగాణా ప్రాంతంలో పంట తెగుళ్ళను, చీడలను నివారించేటందుకు పెద్ద ఎత్తున నివారణ చర్యలు తీసికోవటానికి వీలుగా వ్యవసాయ శాఖకు తగు సాధన సామగ్రిని సమ కూర్చటమే ఈ పథకం యొక్క ఉద్దేశం. 1956-57 సం. లో ఈ పథకం అమలు జరుపబడి 1957-58, 1958-59 సంవత్సరాలలో కొనసాగించబడింది. ఈ సంవత్సరంలో 50 చేతి స్ప్రేయర్లను (పిచికారీలు), 60 డస్టర్లను (పొడి చల్లు సాధనాలు), 5 పవరు స్ప్రేయర్లను (విద్యుచ్ఛక్తితో పనిచేసే పిచికారీలు) కొని వ్యవసాయ శాఖకు సమకూర్చటానికి ప్రతిపాదింపబడింది. ఇంతేగాక 16,38,754 పౌన్ల గంధకంకూడ పంపకం చేయబడుతుంది. ఇందుకుగాను 1959-60 ప్రణాళికలో రు. 1.50 లక్షల మొత్తం కేటాయించబడింది. తెలంగాణా ప్రాంతంలో 40,000 ఎకరాల ప్రదేశం సస్యరక్షణ చర్యల క్రిందకు తీసుకరాబడు తుందని ఆశించబడుతున్నది. ఈ జిల్లాలోని భూములు కూడ సస్యరక్షణ చర్యల క్రిందకు తీసుకరాబడతాయి. ఈ జిల్లాలోని రైతులకు 1,35,551 పౌనుల గంధకం కూడ సరఫరా చేయబడుతుంది.

## *ప్రైవేటు ట్రాక్టర్లతో వ్యవసాయం*

భూములను దున్నుకోవటానికి రైతులకు సరఫరా చేసే నిమిత్తం వ్యవసాయశాఖవారి దగ్గర చాలినన్ని ట్రాక్టర్లు లేనందువల్ల ట్రాక్టర్లుగల ప్రైవేటు సంస్థలకు ట్రాక్టర్లతో భూమిని దున్నే పని అప్పగించ బడింది. ఇందుకోసం ఆ సంస్థలకు ఋణసహాయం కూడ చేయబడింది. ఈ పథకం కొనసాగించే నిమిత్తం ఈ సంవత్సరానికి రు. 0.05 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఈ జిల్లాలో దరఖాస్తు దారులెవరైనా ఉంటే వారికి కూడ ఈ పథకం క్రింద ఋణసహాయం లభిస్తుంది.

## అధికాహారోత్పత్తి సిబ్బంది

తెలంగాణా జిల్లాలలోని జిల్లా వ్యవసాయశాఖాధికార్ల కార్యాలయాల్లో పని బాగా పెరిగింది. తదనుగుణంగా ఈ కార్యాలయాల్లో సిబ్బందిని పెంచటానికి ప్రతిపాదింప బడింది. 1957-58, 1958-59 సంవత్సరాలలో జిల్లా వ్యవసాయ శాఖాధికార్లకు పర్సనల్ అసిస్టెంట్లుగా పని చేసేటందుకు గాను 9 మంది డెమోన్స్ట్రేటర్లు, జిల్లా కార్యాలయాల్లో 9 మంది అప్పరు డివిజను గుమాస్తాలు, 9 మంది లోయరు డివిజను గుమాస్తాలు, 9 మంది టైపిస్టులు తాలూకా కార్యాలయాలలో 5 మంది లోయరు డివిజను గుమాస్తాలు నియమించబడినారు. వీరు ఈ సంవత్సరం కొనసాగించబడతారు. ఇందుకు రు. 0.98 లక్ష మొత్తం వ్యయమవుతుంది. ఇందులో రు. 0 11 లక్ష మొత్తం ఈ జిల్లాలో నియమించబడిన సిబ్బందిని కొనసాగించటం కోసం ప్రత్యేకించబడింది.

## జీలుగ, జనుమువంటి పచ్చిఎరువు విత్తనాల పంపకం

ఈ పథకం క్రింద ప్రణాళిక యొక్క మొదటి రెండు సంవత్సరాల కాలంలోను 239 టన్నుల పచ్చి ఎరువు విత్తనాలు రైతులకు పంపకం చేయబడినాయి. 1958-59 సం. లో (అనగా 1958 డిసెంబరు వరకు) 124 టన్నుల విత్తనాలు సరఫరా చేయబడినాయి. మణుగు ఒక్కంటికి ఒక రూపాయి చొప్పున వీటి అమ్మకంపై సబ్సిడీ ఇవ్వబడింది. 1959-60 సం.లో 6,300 మణుగుల విత్తనాలు తగ్గింపు ధరకు సరఫరా చేయబడతాయి. ఇందుకుగాను రు. 0.06 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.008 లక్ష మొత్తం ఈ జిల్లాలో 787 మణుగుల పచ్చి ఎరువు విత్తనాలను సరఫరా చేయటం కోసం కేటాయించబడింది.

## పట్టణాల్లో కంపోస్టు ఎరువు తయారి

తెలంగాణా ప్రాంతంలో ఉన్న సిటీ, టౌను మునిసిపాలిటీలలో ఎరువు ఉత్పత్తిని పెంచే ఉద్దేశంతో స్థానిక సంస్థలకు ఆర్థిక సహాయం చేయటానికి ప్రతిపాదింపబడింది. స్థానిక సంస్థలు చెత్త చెదారాల్ని కొనుగోలుచేసి వాటిని కంపోస్టు ఎరువుగా మార్చేటందుకు, దాని తయారి, పంపకాల మూలంగా వచ్చే నష్టాన్ని పూడ్చుకొనేటందుకు ఈ ఆర్థిక సహాయం ఉద్దేశించబడింది. ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలోను

ఈ పథకం క్రింద స్థానిక సంస్థలచే 3 లక్షల టన్నుల కంపోస్టు ఎరువు ఉత్పత్తి చేయబడి పంచబడింది. 1959–60 సంవత్సరంలో 1.10 లక్షల టన్నుల కంపోస్టు ఎరువు ఉత్పత్తి చేయబడుతుందని ఆశించబడుతున్నది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.16 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.07 లక్ష మొత్తం ఈ జిల్లాలో 42,000 టన్నుల కంపోస్టు ఎరువు ఉత్పత్తికిగాను ప్రత్యేకించబడింది. ఇది 8,400 ఎకరాలలో ఉపయోగించబడుతుంది. ఇందుమూలంగా 1,050 టన్నుల పంట అదనంగా పండుతుంది.

## *స్థానికంగా లభ్యమయ్యే చెత్త చెదరాలతో ఎరువుల తయారీ*

స్థానికంగా లభ్యమయ్యే చెత్త, చెదరాలనన్నిటిని ఉపయోగించి, అభివృద్ధికరమైన పద్ధతులలో కంపోస్టు ఎరువును తయారు చేయటంద్వారా గ్రామసీమల్లో ఎరువుఉత్పత్తి యొక్క స్థాయిని పెంచటమే ఈ పథకం యొక్క లక్ష్యం. మొట్ట మొదటగా ఈ కార్యక్రమం బ్లాకు ప్రాంతాలలో మాత్రమే అమలు పరచటానికి, ఆ తరువాత రెండవ ప్రణాళికా కాలంపూర్తి అయ్యే లోపున అన్ని ప్రాంతాలకు ఈ కార్యక్రమాన్ని విస్తరింప చేయటానికి ప్రతిపాదింపబడింది. 1957–58,1958–59 సంవత్సరాలలో రాజ్యంలోని 56 బ్లాకులలో ఈ పథకం అమలుపరచబడింది. స్థానికంగా లభ్యమయ్యే చెత్తచెదారాలతో ఎరువుల తయారీని అభివృద్ధిచేయటం గురించి 12,565 మంది రైతులకు శిక్షణ ఇవ్వబడింది. ఇద్దరు ఫీల్డు మెన్యూరియల్ ఆఫీసర్లు, 20 మంది కంపోస్టు ఇనస్పెక్టర్లు, 20 మంది ఫీల్డుమన్లు, ఒక అప్పరు డివిజను గుమాస్తా, ఇద్దరు లోయరు డివిజను గుమాస్తాలు, ముగ్గురు టైపిస్టులు, నలుగురు జవానులతో కూడిన ప్రత్యేక సిబ్బంది కూడ ఈ పథకం క్రింద నియమించబడింది. ఈ సిబ్బందిని కొనసాగించటానికి, ఆంధ్ర ప్రాంతంలో 30, తెలంగాణా ప్రాంతంలో 17—మొత్తం 47 బ్లాకులకు ఈ కార్యక్రమాన్ని విస్తరింప చేయటానికి గాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 4.00 లక్షల మొత్తం కేటాయించబడింది. వర్తమాన సంవత్సరంలో 13,000 మంది రైతులకు శిక్షణ ఇవ్వబడుతుందని ఆశించబడింది. ఈ పథకంవల్ల ఈ జిల్లాలోని రైతులకు కూడ లాభం చేకూరుతుంది.

## *మలమూత్రాదుల నుండి కంపోస్టు ఎరువును తయారు చేయటం*

గ్రామ పారిశుధ్యత కోసం పాకీవారిని నియోగించే గ్రామ పంచాయితీలలో లభ్యమయ్యే మలమూత్రాదులు, చెత్తచెదారంతో కంపోస్టు

ఎరువును తయారు చేయటానికి ఈ పథకం క్రింద ఉద్దేశించబడింది. ఆంధ్ర ప్రాంతంలో 66 పంచాయితీలకు, తెలంగాణా ప్రాంతంలో 33 పంచాయితీలకు—మొత్తం 99 పంచాయితీలకు అప్పులివ్వటంకోసం 1958-59 సం. లో రు. 2.00 లక్షల మొత్తం మంజూరు చేయబడింది. వర్తమాన సంవత్సరంలో కూడ ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలోని పంచాయితీలకు ఋణాలను ఇచ్చేటందుకై రు. 2. లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో కొంత మొత్తం ఈ జిల్లాలోని పంచాయితీలకు ఇవ్వబడుతుంది. సుమారు 600 టన్నుల కంపోస్టు ఎరువు తయారు చేయబడుతుంది. ఇది 120 ఎకరాలలో ఉపయోగించబడుతుంది. ఇందుమూలంగా ఈ జిల్లాలో 15 టన్నుల పంట అదనంగా పడుతుంది.

## చేతితో నడుపబడే స్ప్రేయర్లను (పిచికారీలు), డస్టర్లను (పొడి చల్లు సాధనాలు) తగ్గింపు ధరకు సరఫరా చేయటం

పెద్ద ఎత్తున పంటలకు వ్యాధులు తగిలినప్పుడు సత్వరంగా సస్యరక్షణ చర్యలను తీసుకోనేటందుకు వీలుగా వ్యవసాయదారులు, సహకార సంఘాలు, పంచాయితీలు మొదలైనవి తగినన్ని స్ప్రేయర్లను డస్టర్లను స్వంతంగా కలిగియుండేటట్లు చేయడమే ఈ పథకం యొక్క ఉద్దేశం. ఈ పరికరాలు సగం ధరకు సరఫరా చేయబడతాయి. మిగత సగంధర కేంద్ర, రాజ్యప్రభుత్వాలు భరిస్తాయి. 500 చేతి స్ప్రేయర్లను, డస్టర్లను కొనేటందుకుగాను 1958-59 సంవత్సరంలో రు. 0.90 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇంకా 500 స్ప్రేయర్లను, డస్టర్లను కొనటం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0 90 లక్ష మొత్తం కేటాయించబడింది ఇందులో రు. 0.036 లక్ష మొత్తం విలువ చేసే 20 స్ప్రేయర్లు, డస్టర్లు ఈ జిల్లాలో సరఫరా చేయబడతాయి.

## ఆంధ్రప్రదేశ్ లో పండ్లతోటల అభివృద్ధి

ప్రస్తుతం పండ్లతోటల క్రిందఉన్న ప్రాంతాన్ని అభివృద్ధి చేసి, క్రొత్త ప్రాంతాలను పండ్లతోటల క్రిందకు తీసికొని రావటం ద్వారా పండ్ల ఉత్పత్తిని పెంచే ఉద్దేశంతో వ్యవసాయోత్పత్తిని వివిధ రకాలుగా అభివృద్ధి పరచి పండ్ల పంటను ఎక్కువ చేయాలనే ప్లానింగు కమిషనువారి సిఫారసులను పురస్కరించుకొని ఈ పథకం 1957-58 సంవత్సరంలో ప్రారంభించబడింది.

ఈ పథకం క్రింద రైతులకు పాతతోటల సముద్ధరణకొరకు ఎకరానికి రు. 65/– లు చొప్పున స్వల్పకాలిక ఋణాలు, క్రొత్త ప్రాంతాలను పండ్ల తోటల క్రిందకు తీసికొని వచ్చేటందుకు ఎకరానికి రు. 150/–లు మొదలు కొని రు. 300/– లు వరకు దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వటానికి ఉద్దేశించ బడింది. 1957–58, 1958–59 సంవత్సరాలలో రు. 11.00 లక్షల మొత్తం ఋణాలుగా ఇవ్వబడింది. ఈ పథకాన్ని కొనసాగించటంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 8.86 లక్షల మొత్తం ప్రత్యేకించ బడింది. ఇందులో రు. 1.36 లక్షల మొత్తం కడప జిల్లా అనంతరాజు పేటలో ఉండే ఫ్రూట్ స్పెషలిస్టు వద్ద రిజర్వుగా ఉంచబడింది. అవసరమయిన జిల్లాలకు ఇది పంచబడుతుంది. మిగత మొత్తంలో రు. 0.344 లక్ష మొత్తం ఈ పథకం క్రింద ఈ జిల్లాలో ఋణాలివ్వటం కోసం వినియోగించబడుతుంది.

## *ప్రత్తిపంట అభివృద్ధి పథకం*

రెండవ ప్రణాళికా కాలంలో బీళ్ళను,బంజరు భూములను సాగులోనికి తేవడం, ఆహారేతర పంటలను తొలగించడం, రెండు పంటలను వేయడం, మిశ్రమ వ్యవసాయాన్ని అవలంబించడం, మేలురకం విత్తనాలను సరఫరా చేయడం,రసాయనిక ఎరువులను వాడడం మొదలైనట్టి చర్యలను అవలంబించటం ద్వారా 20,000 బేళ్ళవరకు ప్రత్తి ఉత్పత్తిని పెంచటానికి ఈ పథకం క్రింద ప్రతిపాదింపబడింది. ఒక్కొక్క బేలు 392 పౌనుల బరువు ఉంటుంది. మొదటి మూడు సంవత్సరాల కాలంలోను ప్రత్తి ఉత్పత్తి 12,000 బేళ్ళ దాకా పెరిగింది. ఈ పథకం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.40 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ పథకాన్ని అమలు జరపడానికి, విత్తనాలను కొని పంచడానికి బాధ్యులైన క్రింది ఆఫీసర్ల అధీనంలో పై మొత్తం ఉంచబడింది.

| | | రూపాయలు, లక్షలలో |
|---|---|---|
| 1. | కాటన్ ఎక్స్టెన్షన్ ఆఫీసరు, వ్యవసాయశాఖ డైరెక్టరేటు. ... ... | 0.9190 |
| 2. | అసిస్టెంటు కాటన్ ఎక్స్టెన్షన్ ఆఫీసరు, అదిలాబాదు. ... ... | 0.1495 |

| | | | |
|---|---|---|---|
| 3. | అసిస్టెంటు కాటన్ ఎక్స్‌టెన్షన్ ఆఫీసరు, కడప. | ... ... | 0.1743 |
| 4. | అసిస్టెంటు కాటన్ ఎక్స్‌టెన్షన్ ఆఫీసరు, గుంటూరు. | ... ... | 0.1572 |
| | | మొత్తం | 1.4000 |

ఈ జిల్లాలో 5 ఇంపీరియల్ మేలుగుల ప్రత్తి విత్తనాలు పంచబడతాయి. ఇవి 3,200 ఎకరాలలో నాటబడతాయి. ఇందుమూలంగా అదనంగా 240 బేళ్ళ ప్రత్తి ఉత్పత్తి చేయబడుతుంది.

## *చెరకు పంటకు ఎరువు విస్తారంగా వేయడానికి సంబంధించిన పథకం*

పంట దిగుబడి ఎక్కువగా ఉండేటందుకోసం చెరకుపంటకు బాగా ఎరువుల్ని వేయటం గురించి విస్తృతంగా ప్రచారం చేయటానికి ఈ పథకం ఉద్దేశించబడింది. 1958–59 సంవత్సరపు ఉత్తరార్థంలో ఈ పథకం అమలుపరచబడింది. వివిధ కేంద్రాలలో ఈ పని కొనసాగించబడుతున్నది. ఆంధ్రలో 28 మంది కామ్‌గార్లు, తెలంగాణాలో 12 మంది కామ్‌గార్లు వివిధ కేంద్రాలలో పనిచేస్తున్నారు. 1959–60 సంవత్సరంలో ఈ పథకాన్ని కొనసాగించడానికి ప్రతిపాదించబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.30 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ పథకంవల్ల ఈ జిల్లాలో చెరకు పండించేవారు కూడ లాభం పొందుతారు.

## *జీడితోటల అభివృద్ధి*

రాజ్యంలో విస్తారంగా ఉన్న బంజరు భూమిని జీడితోటల క్రిందకు తీసుకొని వచ్చే ఉద్దేశంతో క్రొత్తగా ఎన్నిక చేయబడిన ప్రాంతాలలో నాటేటందుకు 15,000 పౌన్ల మంచి రకం విత్తనాలను సేకరించటానికి ప్రతిపాదించబడింది. తగిన ప్రాంతాలను ఎన్నిక చేసి, జీడితోటలను విస్తరింపచేసే నిమిత్తం శ్రీకాకుళం, తూర్పుగోదావరి, గుంటూరు జిల్లాలలోని ప్రదేశాలను సర్వే చేయటానికి కూడ ప్రతిపాదింపబడింది. జీడితోటల

క్రిందకు అదనంగా భూమిని తీసికొని వచ్చేటందుకు పీలుకల్పించే నిమిత్తం ఈ పథకం క్రింద రైతులకు ఎకరానికి రు. 100/- లు చొప్పున అప్పు మంజూరు చేయబడుతుంది.

ఒక క్యాపునట్ డెవలప్‌మెంటు ఆఫీసరును, 4 గురు అసిస్టెంట్లను, ఒక అప్పరు డివిజను గుమాస్తాను, 5 మంది జవానులను నియమించటం ద్వారా ఈ పథకం 1958—59 లో అమలు జరుపబడింది. 3,000 ఎకరాల భూమిని జీడితోటల క్రిందకు తీసుకొని రావటానికిగాను అప్పులు ఇవ్వబడినాయి. ఈ పథకాన్ని కొనసాగించటానికి, 6000 ఎకరాల భూమిని జీడితోటల క్రిందకు తీసుకొని రావటానికి గాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 6 11 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.12 లక్ష మొత్తం జిల్లాల్లో కలిగే అదనపు ఆవసరాల నిమిత్తం ప్రధాన కార్యస్థానంలో ప్రత్యేకించి పెట్టబడింది. సిబ్బంది ఖర్చు మొదలగు వాటికోసం రు. 0.11 లక్ష మొత్తం ప్రత్యేకించబడింది. మిగత మొత్తంలో రు. 0.06 లక్ష ఈ జిల్లాలో 60 ఎకరాల భూమిని జీడితోటల క్రిందకు తెచ్చే నిమిత్తం అప్పులివ్వటానికి గాను ప్రత్యేకించబడింది.

### ఆయిలు ఇంజనులను నడుపుటలో రైతులకు శిక్షణ

ఆయిలు ఇంజనులను సరిగా నడుపుటలోను, నిర్వహించుటలోను రైతులకు శిక్షణ ఇచ్చే ఉద్దేశంతో ఈ పథకం 1957-58 సం. లో అమలు జరుపబడింది. 1957-58, 1958-59 సంవత్సరాల కాలంలో 579 మంది రైతులకు శిక్షణ ఇవ్వబడింది. రు. 0.18 లక్ష వ్యయంతో వర్తమాన సంవత్సరంలో 461 మంది రైతులకు శిక్షణ ఇవ్వటానికి ప్రతిపాదింపబడింది. ఈ జిల్లాలోని రైతులు కూడ ఈ పథకంవల్ల లాభం పొందుతారు.

### ఫీల్డుమెన్‌లకు, డెమాన్‌స్ట్రేషన్ మేస్త్రీలకు శిక్షణ _

మేలురకం వ్యవసాయ విధానాలను గురించి ప్రదర్శనలు ఏర్పాటు చేయటానికి, తీవ్రప్రచారం చేయటానికిగాను వ్యవసాయ శాఖలో నియమించే నిమిత్తం ఫీల్డుమెన్‌లకు, డెమాన్‌స్ట్రేషన్ మేస్త్రీలకు ఆరు నెలల పాటు ఉత్తమ వ్యవసాయ విధానాలలో శిక్షణ ఇచ్చేటందుకు ఈ పథకం ఉద్దేశించబడింది. రెండవ ప్రణాళిక యొక్క మొదటి రెండు సంవత్సరాల కాలంలో ఆంధ్రప్రాంతంలోని క్రింది 5 కేంద్రాలలో 197 మంది డెమాన్‌స్ట్రేషన్ మేస్త్రీలకు శిక్షణ ఇవ్వబడింది.

1. చెరకు పరిశోధన కేంద్రం, అనకాపల్లి
2. వ్యవసాయ పరిశోధన కేంద్రం, సామర్లకోట
3. వ్యవసాయ పరిశోధన కేంద్రం, మార్టేరు
4. కళాశాల క్షేత్రం, బాపట్ల
5. వ్యవసాయ పరిశోధన కేంద్రం, నంద్యాల

ఆంధ్రప్రాంతంలోని పై 5 కేంద్రాలలోను, తెలంగాణా ప్రాంతం లోని క్రింది మూడు కేంద్రాలలోను 1958–59 సంవత్సరంలో ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాల నుండి 178 మంది ఫీల్డుమెన్లుగాను, 178 మంది డెమాన్‌స్ట్రేషన్ మేస్త్రీలుగాను శిక్షణ పొందటం కోసం చేర్చుకోబడినారు.

1. ప్రభుత్వ ప్రధాన క్షేత్రం, రాజేంద్రనగరు.
2. ప్రభుత్వ ప్రధాన క్షేత్రం, వరంగల్లు.
3. ప్రభుత్వ ప్రయోగ కేంద్రం రుద్రూరు.

శిక్షణ కార్యక్రమం ఈ సంవత్సరంలో కూడ కొనసాగించ బడుతుంది. 178 మంది ఫీల్డుమనులు, 178 మంది డిమాన్‌స్ట్రేషను మేస్త్రీలు చేర్చుకోబడతారు. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.81 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలోని రుద్రూరులో ఉన్న ప్రభుత్వ ప్రయోగ క్షేత్రంలో 26 మంది ఫీల్డు మనులు, 26 మంది డిమాన్‌స్ట్రేషను మేస్త్రీలకు శిక్షణ ఇచ్చే నిమిత్తం పై మొత్తంలో రు. 0.12 లక్ష మొత్తం ప్రత్యేకించ బడింది.

## రాజేంద్రనగరులో హెర్బేరియం సెక్షను (ఓషధీవిభాగం) స్థాపన

ఆంధ్రప్రదేశ్‌లోని వృక్ష జాతులను గురించి పరిశీలనలు జరపటానికి, వాటిని గుర్తించటానికిగాను వివిధరకాల మొక్కలను సేకరించి, వాటిని పెంచేటందుకు రాజేంద్రనగరులో 1957–58 లో ఒక చిన్న "హెర్బేరియం" ఏర్పాటు చేయబడింది. ఒక రీసెర్చి అసిస్టెంటు కూడ నియమించబడి నాడు. రాజేంద్రనగరులోని వ్యవసాయ కేంద్రంలో పండించబడే పంటలు, పండ్లు, కూరగాయలు, విత్తనాలు మొదలైనవి సేకరించబడి ఈ "హెర్బేరియం"లో ఉంచబడతాయి. ఇవి ఏయేరకాలకు చెందినవో గుర్తించటానికి

వీలు కలుగుతుంది. ఈ సంవత్సరంలో కూడ ఈ పని కొనసాగించబడు తుంది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.05 లక్ష మొత్తం కేటాయించ బడింది.

*వ్యవసాయ "ఇంజనీరింగు" విభాగంలో అదనపు సిబ్బంది నియామకం*

తెలంగాణా ప్రాంతంలో అసిస్టెంటు అగ్రికల్చరల్ ఇంజనీరు అధ్వర్యం క్రింద అమలు జరుపబడుతున్న వివిధ పథకాలకు సంబంధించిన లెక్కలను తనఖీ చేసి నిర్వహించటానికి ఆయన క్రింద పనిచేసే మినిస్టీరియలు సిబ్బంది ఎవరూ లేరు. అగ్రికల్చరల్ ఇంజనీరుకు సహాయపడడానికి, ఆయన ఎక్కువ కాలాన్ని వివిధ పథకాలను అమలు జరపడంలో వినియోగించటానికి, దైనందిన పరిపాలనా వ్యవహారాలను దక్షతతో నిర్వహించటానికి వీలు కలుగచేసే నిమిత్తం ఆయన క్రింద ఒక జూనియరు సూపరింటెండెంటును, ఒక స్టోరు కీపరును నియమించటానికి ప్రతిపాదింపబడింది. అయితే ఈ పథకం గత సంవత్సరం మంజూరు చేయబడలేదు. ఈ సంవత్సరంలో పై సిబ్బందిని నియమించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు గాను ప్రణాళికలో రు. 0.07 లక్ష మొత్తం కేటాయించబడింది.

*రాజేంద్రనగరు వ్యవసాయ కళాశాలకు భవనాల నిర్మాణం, లేబరేటరీ పరికరాలను సమకూర్చటం.*

రాజేంద్రనగరులోని వ్యవసాయ కళాశాలకు హాస్టలుకు భవనాలను, నిర్మించటానికి గాను వ్యవసాయ మార్కెటింగు అభివృద్ధి నిధినుండి రు.8 57 లక్షల మొత్తం మంజూరు చేయబడింది. వీటికి అంచనా వేయబడిన ఖర్చు మొత్తం రు. 12.00 లక్షలు. భవనాలకు గాను అయ్యే మిగత వ్యయానికి (సుమారు రు. $3\frac{1}{2}$ లక్షలు), కళాశాలకు కావలసిన లేబరేటరీ పరికరాలను, కుర్చీలు, బల్లలు మొదలైన కొయ్యా సామాను మొదలైన వాటిని ఖరీదు చేయటానికి గాను రెండవ ప్రణాళికలో రు. 5.00 లక్షల మొత్తం కేటా యించ బడింది. ఈ సంవత్సరపు కార్యక్రమానికిగాను ప్రణాళికలో రు. 2.26 లక్షల మొత్తం కేటాయించబడింది.

## రాజేంద్రనగరులో పశుగ్రాస పరిశోధనా పథకం

వివిధ ప్రాంతాల్లో వర్షాధారం వల్లను, నీటి పారుదల ద్వారాను పెంచటానికి అనువుగా ఉండే పచ్చ గడ్డి రకాలను గురించి, మేలురకం వ్యవసాయ పద్ధతుల ద్వారా ఉత్పత్తిని అధికం చేయటం గురించి పరిశోధనలు జరపటమే ఈ పథకం యొక్క ఉద్దేశ్యం ఈ పరిశోధనా పథకం రాజేంద్రనగరులో 1956–57 సం. లో ప్రారంభించబడింది. గత రెండు సంవత్సరాలుగా ఇది కొనసాగించబడింది. ఈ పథకాన్ని కొనసాగించే నిమిత్తం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.10 లక్ష మొత్తం కేటాయించబడింది.

## పరిశోధనా కేంద్రాలకు కావలసిన అదనపు పరికరాలు

తెలంగాణా ప్రాంతంలోని వ్యవసాయ పరిశోధన కేంద్రాలలో ఉన్న లేబరేటరీలలో చాలా వాటికి ఆధునిక పరికరాలు కాని, అవసరమైన రసాయనిక పదార్థాలు కాని లేవు. ఇందువల్ల ఈ పథకం క్రింద పై లేబరేటరీలకు అవసరమైన పరికరాలను, రసాయనిక పదార్థాలను ఖరీదు చేయటానికి ప్రతిపాదింపబడింది. 1957–58, 1958–59 సంవత్సరాలలో రసాయనిక పదార్థాలు మొదలైన వాటిని సరఫరా చేయటంకోసం రు. 0.31 లక్ష మొత్తం ఖర్చు చేయబడింది. రాజేంద్రనగరు, రుద్రూరు, వరంగల్లు, డిండిలలో ఉన్న పరిశోధనా కేంద్రాలలో నెలకొల్పబడిన లేబరేటరీలకు పరికరాలను, రసాయనిక పదార్థాలను కొని, సరఫరా చేయటానికి గాను ఈ సంవత్సరానికి రు. 0.15 లక్ష మొత్తం కేటాయించబడింది.

## ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకు కావలసిన అదనపు వసతులు

ఇతర ప్రాంతములలో నున్న వ్యవసాయ క్షేత్రాలతో పోల్చి చూస్తే తెలంగాణా ప్రాంతంలోని ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు అంతగా అభివృద్ధి చెందలేదు. ఇందువల్ల రాజేంద్రనగరు, రుద్రూరు, డిండి, వరంగల్లులలో నున్న క్షేత్రాలకు అదనపు పరికరాలను సమకూర్చటానికి, అదనపు భవనాలు నిర్మించటానికి ప్రతిపాదింపబడింది. 1957–58 లో రు. 0.565 లక్ష

లక్ష మొత్తం విలువచేసే అదనపు పరికరాలు కొంతవరకు ఈ క్షేత్రాలకు సమకూర్చబడినాయి. సిమెంటు, ఉక్కు మొదలయినవి దొరకనందువల్ల భవనాల నిర్మాణం ప్రారంభించబడలేదు. ఈ క్షేత్రాలకు పరికరాలను ఖరీదు చేయటానికి, భవనాలను నిర్మించటానికి గాను 1958–59 లో రు. 2.13 లక్షల మొత్తం కేటాయించబడింది. మరి కొన్ని పరికరాలను కొనడానికి, భవనాలను నిర్మించడానికి గాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.40 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.36 లక్ష మొత్తం ఈ జిల్లాలోని రాజేంద్రనగరులో నున్న క్షేత్రం కోసం ప్రత్యేకించ బడింది.

## *మేలురకం పద్ధతులలో తాబి వరి నారు మళ్ళను వేయటం*

తాబీ ఋతువులో వరి నారు శీఘ్రంగా పెరిగేటట్లు చేయడానికి తగిన మార్గాలను, పద్ధతులను అన్వేషించడం, పైరు పెరుగుదలలో ఏయే అంశాలు విడివిడిగాను, సమైక్యంగాను ఎంతెంతవరకు తోడ్పడేది తెలుసుకోవడమే ఈ పథకం యొక్క ఆశయం. రాజేంద్రనగరులోని ప్రధాన ప్రయోగ కేంద్రంలో ఈ పథకం 1957–58లో అమలు జరుపబడింది. ఒక రీసెర్చి అసిస్టెంటు, ఇద్దరు ప్లాంటు కలెక్టర్లు, టైపిస్టుపని కూడా చేసే ఒక గుమాస్తా, ఒక జవాను ఈ పనికి గాను నియమించబడినారు. 1958–59లో ఈ పథకం కొనసాగించబడింది. ఈ పథకాన్ని వర్తమాన సంవత్సరంలో కూడ కొనసాగించేటందుకు రు. 0.03 లక్ష మొత్తం కేటాయించబడింది.

## *రాజేంద్రనగరులో పైరుగాలి పరిశీలన పథకం*

వివిధ వాతావరణ పరిస్థితుల్లో జొన్న, వేరుశెనగ పంటల పెరుగుదల, దిగుబడి ఏవిధంగా ఉంటుందో పరిశీలించే ఉద్దేశంతో ఈ పథకం 1957–58 లో అమలు జరుపబడింది. పూనాలో ఉన్న మెటియొరాలజీ డైరెక్టరు యొక్క సాంకేతిక నియంత్రణ క్రింద పంటలను గురించిన పరిశీలనలు జరుపబడుతున్నాయి. రు. 0.04 లక్ష వ్యయంతో ఈ పథకం యీ సంవత్సరంలో కొనసాగించబడుతుంది.

## రాజేంద్రనగరులో నూనెగింజలను గురించి పరిశోధన

మచ్చుకు ఎంచుకొన్న నూనెగింజలలో నూనె శాతం ఎంత ఉన్నదీ, తేమ భాగం ఎంత ఉన్నదీ తెలుసుకోవటం, వాటిలో ఉండే జిగురుతనం, అయోడిను విలువ, క్రొవ్వు పదార్థం, వాటి పరివర్తన సూచి నిర్ణయించడం—యివే ఈ పథకం యొక్క ఉద్దేశాలు. రాజేంద్రనగరులోని నూనెగింజల స్పెషలిస్టు విభాగంలో ఈ పథకం 1958-59 లో ప్రారంభించబడింది. 1959-60 లో కూడ ఈ పథకం కొనసాగించబడుతుంది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0 14 లక్ష మొత్తం కేటాయించబడింది.

## పెరటితోటల పెంపకానికి సంబంధించిన పథకం

కాయగూరల ఉత్పత్తిని అధికం చేసేటందుకు పెరటితోటలను వేయటంలో ప్రజలకు ఆసక్తిని కలిగించే ఉద్దేశంతో హైదరాబాదు, సికింద్రాబాదు జంట నగరాల్లో ఉన్న పబ్లికు సంస్థలలోను, ఇళ్ళలోను పెరటితోటలను వేయటానికి. వాటికి కావలసిన మొక్కలను, విత్తనాలను సరఫరా చేయడానికి ఈ పథకం ఉద్దేశించబడింది. కాయగూరలను పండించే విషయంలో ప్రజలకు సాంకేతిక సలహాలు కూడ ఇవ్వబడతాయి.

ప్రణాళికేతర పథకంగా ఇది 1954-55 నుండి అమలులో ఉన్నది. అయితే, ప్రస్తుతమున్నకొద్ది మాత్రం సిబ్బందితో తగినంత అభివృద్ధి సాధించబడలేక పోయినందువల్ల, 1959-60 ప్రణాళికలో ఈ పథకం చేర్చబడింది. ఈ పథకాన్ని సమర్థవంతంగా అమలుపరచేటందుకు గాను ఒక హార్టికల్చరల్ అసిస్టెంటు, టైపిస్టు పని కూడా చేసే ఒక గుమస్తా, 6 మంది ఫీల్డుమెన్లు, ఒక వ్యాను డ్రయివరు, ఒక జవాను ఉండే అదనపు సిబ్బందిని నియమించటానికి కూడ ప్రతిపాదింపబడింది. పాఠశాలలు, ప్రభుత్వ కార్యాలయాల ఆవరణలు మొదలయినవాటిలో సుమారు 1,000 నమూనా పెరటితోటలు వేయబడతాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకంకోసం రు. 0.20 లక్ష మొత్తం కేటాయించబడింది.

## నీటిఊటలు గురించి పరిశోధనలు

నీటి పారుదల అవసరాలకోసం నీరు లభించేటటువంటి భూమి అడుగున ఉండే వనర్లను గురించి పరిశీలించడానికిగాను అనువైన ప్రదేశాల్లో

దాదాపు 600 అడుగుల లోతువరకు ప్రయోగాత్మకంగా కొన్ని బోరింగు నూతులను త్రవ్వడానికి ఈ పథకం తయారు చేయబడింది. ప్రయోగాత్మక పద్ధతిపై బోరింగు నూతులను త్రవ్వడం కోసం 1957–58, 1958-59 సంవత్సరాలలో రు. 0.12 లక్ష మొత్తం ఖర్చు చేయబడింది. ఈ పథకాన్ని కొనసాగించటానికి, హైదరాబాదు జిల్లాలో కొన్ని బావులను త్రవ్వటానికిగాను ఈ సంవత్సరానికి రు. 0.06 లక్ష మొత్తం కేటాయించబడింది.

## అంబరుపేటలో జొన్న పెంపకపు కేంద్రం

వ్యాపారానికి అవసరమయినంతగా మిశ్రమ జాతి జొన్న ఉత్పత్తిని భారతదేశంలో అభివృద్ధిచేసే ఉద్దేశంతో, భారత వ్యవసాయ పరిశోధనా సంస్థవారు జొన్న పెంపకానికి సంబంధించిన ఈ పథకాన్ని ప్రారంభించారు. ఈ పథకం క్రింద హైదరాబాదులోని అంబరుపేటలో 1957–58 సంవత్సరము నందు ఒక పరిశోధనా కేంద్రం ఏర్పాటు చేయబడింది. ఒక మైజ్ బ్రీడరు, ఒక అసిస్టెంటు మైజ్ బ్రీడరు, ముగ్గురు రీసెర్చి అసిస్టెంట్లు, 8 మంది ఫీల్డు మెన్లు, టైపిస్టు పనికూడా చేసే ఒక గుమాస్తా, ఒక స్టోరు కీపరు, ఇద్దరు జవానులు, ఇద్దరు ప్లోమెన్‌లు, ఒక పాకివాడితో కూడిన సిబ్బంది ఇందులో నియమించ బడింది. తరువాత ఇద్దరు ట్రక్కు డ్రయివర్లు, ఇద్దరు ట్రాక్టరు డ్రయివర్లు, ఒక మెకానిక్కు, ఒక అసిస్టెంటు మెకానిక్కు కూడా నియమించబడినారు. యీ సంవత్సరంలో కూడ ఈ పని కొనసాగించబడుతుంది. ఇందుకు సంబంధించిన ఖర్చంతా భారత వ్యవసాయ పరిశోధనా సంస్థవారే భరిస్తారు. కనుక ప్రణాళికలో కేటాయింపు చేయబడలేదు.

## సిబ్బందికి సంబంధించిన సమగ్ర పథకం

వ్యవసాయ శాఖకు సంబంధించిన ప్రణాళికా పథకాలను సమర్థవంతంగా పర్యవేక్షించటానికి, అమలు పరచటానికి గాను ప్రధాన కార్యాలయంలోను, జిల్లా కార్యాలయాల్లోను అదనంగా సాంకేతిక పర్యవేక్షక సిబ్బందిని, మినిస్టీరియలు సిబ్బందిని నియమించటానికి ప్రతిపాదించబడింది. ఈ పథకం 1956–57 సంవత్సరము నుండి కొనసాగించబడుతున్నది. ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల్లోను నియమించబడిన అదనపు సిబ్బంది కొనసాగింపు నిమిత్తం యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 2. 93 లక్షల మొత్తం కేటాయించబడింది. పై మొత్తంలో కొంత

ఈ జిల్లాలో ఇంతకుముందు నియమించబడిన కొంత సిబ్బందిని కొనసాగించటానికి వినియోగించబడుతుంది. ఈ సంవత్సరం అదనంగా సిబ్బంది నియమించబడదు.

## గణాంక విభాగం ఏర్పాటు

వ్యవసాయశాఖ డైరెక్టరేటులోని గణాంక విభాగంలో పెరుగుతున్న పనిని నిర్వహించేటందుకు గాను ఒక స్టాటిస్టీషియనును, ఒక అసిస్టెంటు స్టాటిస్టీషియనును, ఒక నాన్–గెజిటెడ్ స్టాటిస్టికల్ అసిస్టెంటును అవసరమయిన తాబేదారీ సిబ్బందితో సహా నియమించటం ద్వారా ఆ విభాగపు సిబ్బందిని ఎక్కువ చేయటానికి ప్రతిపాదింపబడింది. 1957-58 లో ఒక నాన్–గెజిటెడ్ స్టాటిస్టికల్ అసిస్టెంటు, ఒక గుమాస్తా, ఒక జవాను మాత్రం నియమించబడినారు. 1958–59 లో ఈ పదవులు కొనసాగించబడినాయి. సాంకేతిక పరిజ్ఞానంగల వ్యక్తుల కొరత కారణంగా గెజిటడ్ పదవులు రెండు కూడా భర్తీ చేయబడలేదు. 1958–59 లో నియమించబడిన సిబ్బందిని కొనసాగించటంకోసం యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.22 లక్ష మొత్తం కేటాయించబడింది.

## వ్యావసాయ సమాచారం, ఉత్పత్తి, శిక్షణ

వ్యవసాయ సమాచారాన్ని సేకరించి, ప్రచారం చేయటం కోసం ఒక అగ్రికల్చరల్ ఇన్‌ఫర్మేషను ఆఫీసరు, ఒక పబ్లిసిటీ అసిస్టెంటు, ఒక ఆర్టిస్టు, ఒక అప్పరు డివిజను గుమాస్తా, ఒక టైపిస్టు, ఇద్దరు జవానులతో కూడిన వ్యవసాయ సమాచార యూనిట్టు ఒకటి 1956–57 లో ఏర్పాటు చేయబడింది. 1957–58, 1958–59 సం॥లలో యీ యూనిట్టు కొనసాగించబడింది. ఈ సంవత్సరంలో కూడ దీనిని కొనసాగించే నిమిత్తం ప్రణాళికలో రు. 0.45 లక్ష మొత్తం కేటాయించబడింది.

## మార్కెటింగు శాఖ విస్తరణ

క్రమబద్ధమయిన మార్కెట్ల కార్యకలాపాలు ఎక్కువవుతున్న కారణంగా, ఈ వ్యవస్థ యొక్క వివిధ విభాగాలను సమర్థవంతంగా నియంత్రణ చేయటానికి, సమన్వయ పరచటానికిగాను వ్యవసాయశాఖ డైరెక్టరేటులోని

మార్కెటింగు విభాగాన్ని పటిష్ఠం చేయటం అవసరమయింది. ఇందువల్ల రాజ్య మార్కెటింగు ఆఫీసరు పదవిని హెడ్ క్వార్టర్సు డిప్యూటి డైరెక్టరు స్థాయికి పెంచటానికి, ఒక సీనియరు సూపరింటెండెంటు, ఇద్దరు జూనియరు సూపరింటెండెంట్లు, ఇద్దరు అసిస్టెంటు మార్కెటింగు ఆఫీసర్లు, ఇద్దరు మార్కెటింగు అసిస్టెంట్లు, నలుగురు రికార్డర్లు, ఇద్దరు లోయరు డివిజను గుమాస్తాలు, ఇద్దరు టైపిస్టులు, 6 గురు జవానులు ఉండే సిబ్బందిని నియమించటానికి ప్రతిపాదింపబడింది. 1957-58లో ఒక సీనియరు సూపరింటెండెంటు, ఇద్దరు జూనియరు సూపరింటెండెంట్లు, ఒక టైపిస్టు నియమించబడినారు. ఇంతే కాక స్టేట్ మార్కెటింగు ఆఫీసరు పదవి స్థాయి పెంచబడింది. 1958-59 లో మిగత సిబ్బంది కూడ నియమించబడింది. అయితే ఒక సీనియరు సూపరింటెండెంటు, ఒక జూనియరు సూపరింటెండెంటు పదవులు సరండరు చేయబడినాయి. ఇంతకు ముందు నియమించబడిన సిబ్బంది యీ సంవత్సరంలో కొనసాగించబడుతుంది. ఇందుకుగాను రు. 0.66 లక్ష మొత్తం కేటాయించబడింది.

## ఆంధ్రప్రదేశ్ లో భూసార పరిశీలన
## (సామాన్య రసాయనిక ఎరువులతో)

రెండవ ప్రణాళిక పూర్తి అయ్యేనాటికి నీటి పారుదల ప్రాజెక్టులలో కొన్నిటి నిర్మాణం పూర్తి అవుతుంది. ఆ విధంగా పూర్తిఅయిన ప్రాజెక్టులవల్ల లభించే నీటిపారుదల సౌకర్యాలను పూర్తిగా వినియోగించుకోవడానికి గాను ముందుగానే రాజ్యంలో ఉన్న పలురకాల భూములకు ఎంత నీరు కావలసిందీ, ఎంతెంత ఎరువు వెయ్యాల్సిందీ వివరాలు సేకరించి, వాటికి సంబంధించిన సలహాలను రైతులకు సకాలంలో అందచేయడానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను బాపట్లలో ఉన్న అసిస్టెంటు అగ్రికల్చరల్ కెమిస్టు పర్యవేక్షణ క్రింద రాజ్యంలోని వివిధ కేంద్రాలలో, పండే ముఖ్యమయిన పంటను గురించి, వాడే ఎరువులను గురించి భూసార పరిశీలనలు జరపడానికి ప్రతిపాదింపబడింది. ఈ సంవత్సరంలో ఈ పథకం 6 జిల్లాలలో కొనసాగించబడుతుంది. ఇందుకు గాను రు 0.96 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలోని పగ్గి, వికారాబాదులలో ఉన్న కేంద్రాలలో పరిశీలనలు జరిపే నిమిత్తం పై మొత్తంలో రు. 1.11 లక్షల మొత్తం ప్రత్యేకించబడింది.

## నూనెగింజల విషయమై పరిశోధన నిమిత్తం రాజేంద్రనగరులో లేబరేటరీ ఏర్పాటు

దేశంలో పండే మొత్తం నూనె గింజల పంటలో 20వ వంతు మన రాజ్యంలో పండుతుంది. భారతదేశం మొత్తం మీద మన రాజ్యంలోనే ఈ పంట ఎక్కువ పండుతుంది. పంట దిగుబడిని ఎక్కువ ఇచ్చే విత్తనాలను రూపొందించటం ద్వారాను, ఎరువు వాడకం గురించి సరియైన ప్రమాణాలను ప్రచారం చేయటం ద్వారాను, ఉత్తమ వ్యవసాయ విధానాలను ప్రవేశపెట్టటంద్వారాను నూనెగింజల ఉత్పత్తిని అధికంచేయటానికి అవకాశాలున్నాయి. ఇందుకుగాను ఆయిలు సీడ్సు స్పెషలిస్టు ప్రధాన కార్యస్థానమయిన రాజేంద్రనగరులోని నూనె గింజల విభాగానికి భవనాలను, పరికరాలను సమకూర్చటానికి ప్రతిపాదింపబడింది. ఈ కార్యక్రమానికి 1958-59 ప్రణాళికలో రు. 0.13 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.63 లక్ష మొత్తం కేటాయించబడింది.

## మార్కెటింగు విభాగంలో గణాంకశాఖ ఏర్పాటు

వ్యవసాయ వస్తువులకు సంబంధించిన ధరల వివరాలను గురించి, సరుకుల లభ్యత గురించి సమాచారం సేకరించేటందుకు, సేకరించిన సమాచారాన్ని మార్కెటింగు బులెటీన్ల రూపంలో క్రోడీకరించి ప్రజల ఉపయోగార్థం, ముఖ్యంగా వ్యాపార ప్రయోజనాల నిమిత్తం, నిర్ణీతకాలానుసారం ప్రచురించేటందుకు గాను పనిచేస్తున్న మార్కెటింగు విభాగపు సిబ్బందిని పటిష్ఠం చేయటంకోసం ఒక స్టాటిస్టికల్ ఆఫీసరును, ఒక మార్కెటింగు అసిస్టెంటును, ఒక రికార్డరును, ఒక టైపిస్టును, ఇద్దరు జవానులను నియమించటానికి ప్రతిపాదింపబడింది. ఈ సంవత్సరంలో ఈ పథకం అమలు జరుపబడుతుంది. ఇందుకుగాను రు. 0.18 లక్ష మొత్తం కేటాయించబడింది.

## గోధుమపంటకు తగిలే తెగుళ్ళ నివారణ

"వీటురస్టు" అనేది గోధుమపంటకు సామాన్యంగా తగిలే తెగుళ్ళలో ముఖ్యమైనది. దీనిని నివారించేటందుకు చర్యలను కనుగొనే నిమిత్తం ఈ

పథకం క్రింద 1955–56 సం. లో ప్రణాళికేతర కార్యక్రమం క్రింద పరిశోధన జరుపబడింది. పరిశోధన కార్యక్రమాన్ని విస్తృతం చేసే ఉద్దేశంతో 1958–59 లో ఈ పథకం రెండవ ప్రణాళికలో చేర్చబడింది. రీసెర్చి అసిస్టెంటు, జూనియరు సైంటిఫిక్ అసిస్టెంటు, మాలితో కూడిన సిబ్బంది మంజూరు చేయబడింది. భారత వ్యవసాయ పరిశోధనా సంస్థవారు ఈ పథకం క్రింద అయ్యే ఖర్చులో సగం భరిస్తారు. మిగతది రాజ్యప్రభుత్వం భరిస్తుంది. రు. 0.07 లక్ష వ్యయంతో, ఈ జిల్లాలోని రాజేంద్రనగరులో పరిశోధన కార్యక్రమం ఈ సంవత్సరంలో కూడ కొనసాగించబడుతుంది.

### *ఆంధ్రప్రదేశ్ లో నలగర్ కమిటీవారి సిఫారసులను అమలు జరపటం కోసం లాంఛన ప్రాయమైన కేటాయింపు*

1957–58 లో భారత ప్రభుత్వం వారు వ్యవసాయ పరిపాలనా సంఘాన్ని (అగ్రికల్చరల్ అడ్మినిస్ట్రేటివ్ కమిటీ) ఏర్పాటు చేశారు. రాజ్యాలలో నెలకొల్పడానికి అనుకూలంగా ఉండే నమూనా వ్యవసాయ సంఘాల్ని గురించి, వ్యవసాయశాఖలోని ప్రతివర్గానికీ చెందిన సిబ్బంది తమకు అప్పగించబడిన కార్యక్రమాలను బాధ్యతతో నిర్వహించేటందుకు వీలుగా అన్ని స్థాయీలలోను వ్యవసాయ శాఖాధికార్లకు అవసరమైన అధికారాలను అప్పగించే పద్ధతులను గురించి రాజ్యాల పరిశీలనార్థం సిఫారసులను చేయడమే పై సంఘంవారి కర్తవ్యం. సంఘంవారి నివేదిక అందచేయబడింది. సంఘం చేసిన సిఫారసులను పరిశీలించి, అమలు పరచటంకోసం 1959–60 ప్రణాళికలో లాంఛనప్రాయంగా రు. 1.00 లక్ష మొత్తం కేటాయించబడింది. సవివరమైన ప్రతిపాదనలు ఇంకా రూపొందించబడలేదు.

### *భూస్వభావ పరిశీలనలకు సంబంధించిన పథకం*

వివిధ ప్రాంతాల్లో భూస్వభావమెటువంటిదన్న విషయం నిర్ణయించి పంట దిగుబడి ఎక్కువ చేసే నిమిత్తం ఆ భూములను అభివృద్ధి చేసేటందుకు ఏవిధమయిన చర్య తీసికోవాలి అన్న విషయం గురించి పరిశీలించడమే ఈ పథకం యొక్క ఉద్దేశ్యం. రాజేంద్రనగరులోని వ్యవసాయ పరిశోధన కేంద్రంలోను, డిండిలోని ప్రయోగ క్షేత్రంలోను ఈ పథకం క్రింద అగ్రికల్చరల్ కెమిస్టు పర్యవేక్షణలో ఈ కార్యక్రమం అమలు జరుపబడుతుంది.

1959–60 ప్రణాళికలో ఈ పథకం అమలు పరచటంకోసం రు. 0.10 లక్ష మొత్తం కేటాయించబడింది. ఒక అసిస్టెంటు అగ్రికల్చరల్ కెమిస్టు, ఒక అసిస్టెంటు, ఒక ఫీల్డు మెన్, ఒక లాబరేటరీ అటెండరుతో కూడిన అదనపు సిబ్బంది ఈ సంవత్సరం నియమించబడుతుంది.

## ద్రాక్షపండ్లను గురించి హైదరాబాదులో పరిశోధన

ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకం క్రొత్తగా చేర్చ బడింది. అనబ్–ఎ–షాహి రకానికి చెందిన ద్రాక్షపండ్లు విరివిగా పండింపబడు తున్నాయి. రాజ్యంలో ఈ రకం తోటలు ఎక్కువగా పెంచబడుతున్నాయి. అయితే ఇటీవలి సంవత్సరాల్లో వీటి పంట దిగుబడి తగ్గిపోతున్నదని గమనించ బడింది. పంట దిగుబడి తక్కువగా ఉండేటందుకు గల కారణాలను గురించి పరిశీలించి, ఈ తోటలు పెంచబడుతున్న నేలల భూసారం తదితర విషయాలు పరిశీలించి ఈ తోటలకు వేయవలిసిన ఎరువు వివరాలను గురించి, వాటిని ఏ విధంగా పెంచాలో ఆ విషయము గురించి సూచనలు చేయబడతాయి. ఈ తోటలను పెంచేవారికి ఈ సలహాలు ప్రయోజనకారిగా ఉంటాయి. హైదరాబాదులోని ప్రభుత్వ హార్టికల్చరిస్టు పర్యవేక్షణ క్రింద అతని సూచనల ననుసరించి ఈ పథకం అమలు జరుపబడుతుంది. ఒక అసిస్టెంటు హార్టికల్చరిస్టు, ఒక రీసెర్చి అసిస్టెంటు, ఒక ఫీల్డుమెన్, టైపిస్టు పనికూడా చేసే ఒక గుమాస్తా, ఒక మాలి, ఒక జవాను, ఒక కాపలాదారును నియ మించటం ద్వారా ఈ పథకాన్ని అమలు పరచటంకోసం ఈ సంవత్స రంలో రు. 0.52 లక్ష మొత్తం కేటాయించబడింది.

## ఆంధ్రప్రదేశ్‌లో విత్తనాల నాణ్యత నిర్ణయ కేంద్రాల ఏర్పాటు

ఇది కూడా భారత వ్యవసాయ పరిశోధనా సంస్థ వారి కోరికపై ప్రణాళికలో చేర్చబడిన ఒక క్రొత్త పథకం. కాయగూరల పంటలను నిర్ణీత వ్యవధులలో తనఖీ చేయుచు ప్రస్తుతం దేశంలో ఉత్పత్తి చేయ బడుతున్న కాయగూరల విత్తనాల నాణ్యతను మెరుగుపరచటం, రాజ్యంలో వివిధ ప్రాంతాల స్థితిగతులకు అనువుగా ఉండే మేలురకం విత్తనాలను అందు బాటులో ఉంచడం–ఇవే ఈ పథకం యొక్క లక్ష్యాలు. ఇందుకుగాను హైదరాబాదు నగరంలో ఒక విత్తనాల నాణ్యత నిర్ణయ కేంద్రాన్ని కాయ గూరల విత్తనాల స్టోరుతో సహా ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది.

ఒక సీడ్ టెస్టింగు ఆఫీసరు, నలుగురు జూనియరు సైంటిఫిక్ అసిస్టెంట్లు, ఒక జూనియరు సూపరింటెండెంటు, ఒక అప్పరు డివిజను గుమాస్తా, ఒక లోయరు డివిజను గుమాస్తా, 12 మంది లేబరేటరీ అటెండర్లు, ముగ్గురు జవానులతో కూడిన సిబ్బంది కూడ నియమించ బడుతుంది. హైదరాబాదు లోని ప్రభుత్వ హార్టికల్చరిస్టు యొక్క ప్రత్యక్ష పర్యవేక్షణలో, ఆయన సల హాల ననుసరించి ఈ పథకం అమలు జరుపబడుతుంది. ఈ కేంద్రాన్ని ఏర్పాటు చేయటం కోసం యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.30 లక్షల మొత్తం కేటాయించబడింది.

## వ్యవసాయోత్పత్తికి సంబంధించిన సూచీలను తయారుచేయటం

రాజ్యంలో వ్యవసాయ ఆదాయానికి సంబంధించిన వివిధ సూచి కలను సంకలనం చేయటమే ఈ పథకం యొక్క ఉద్దేశ్యం. వ్యవసాయో త్పత్తికి, పంట ధరలకు, వ్యవసాయ వేతనాలకు సంబంధించిన సూచికలు కూడ ఇందులో చేరుతాయి. 1957–58 లో ఈ పథకం అమలు జరుపబడింది. 1958–59 లో కొనసాగించబడింది. యీ సంవత్సరంలో కూడ ఈ పథకాన్ని కొనసాగించే నిమిత్తం రు. 0.06 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## పట్వారీల పనిని పర్యవేక్షించటం

భూమి విస్తీర్ణం మొదలయిన వాటిని పట్వారీలు, కరణాలు సిద్ధం చేస్తారు. వీరు వివరాలను అందచేసే విషయంలో తగినంత పర్యవేక్షణ జరి పించడం, భూముల విషయంలో చేయవలసిన సర్దుబాటు వివరాలను తయారుచేయడం, రాజ్యంలో ముఖ్యమైన పంటలు జిల్లా స్థాయిలో ఎన్నెన్ని ఎకరాల భూమిలో పండించబడుతున్నవన్న విషయాలకు సంబంధించిన సరి యైన గణాంక వివరాలను తయారుచేయడం— ఇవి ఈ పథకం యొక్క లక్ష్యాలు. అవసరమయిన సిబ్బందిని నియమించడం ద్వారా రాజ్యంలోని అన్ని జిల్లాలలోను ఈ పథకాన్ని అమలుపరచడానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.35 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందుకు సంబంధించిన పనినంత రెవిన్యూ ఇనస్పెక్టర్లు నిర్వహిస్తారు. ఈ పథకం క్రింద నియమించబడే తహసీల్దార్లు, ఎకనామిక్ ఇన్వెస్టిగేటర్లు పైఉద్యోగులు చేసే పనిని పర్యవేక్షిస్తారు. అర్థగణాంక

శాఖవారు వివరాలను వర్గీకరిస్తారు. పథకాన్ని రూపొందించటం, అమలు జరపటాన్ని పర్యవేక్షించటం కూడ ఈ శాఖవారే నిర్వహిస్తారు.

## "ఎక్స్‌టెన్షన్" [విస్తరణ] శిక్షణ కేంద్రాలు

గ్రామసేవకులుగా నియమించడానికి గాను ఇంతకుముందు ఎన్నుకోబడిన అభ్యర్థులకు 18 మాసాల పాటు శిక్షణ ఇవ్వడం జరిగింది. ప్రాతిపదిక వ్యవసాయ విషయంలో ఒక సంవత్సరం పాటు, విస్తరణ విధానాల విషయంలో ఆర్నెల్లపాటు ఈ శిక్షణ ఇవ్వబడింది. ఈ రెండు "కోర్సు"లు కూడ ప్రత్యేకంగా పరిగణించ బడినాయి. ఈ కోర్సులలో ఉత్తీర్ణులైన లయిన వారికి ప్రతి కోర్సుకు సంబంధించి విడివిడిగా సర్టిఫికేట్లు ఇవ్వబడినాయి, శిక్షణ యొక్క స్థాయినిపెంచే ఉద్దేశంతో ఈ రెండు "కోర్సు"లను ఏకీకృతమొనరించడానికి నిశ్చయించబడింది.ఆ ప్రకారంగానే ఏకీకృతమొనర్చబడిన ఈ కోర్సు 1958 అక్టోబరు నుండి రాజ్యంలోని నాలుగు ఎక్స్‌టెన్షన్ [విస్తరణ] శిక్షణ కేంద్రాల్లోను,5 ప్రాతిపదిక వ్యవసాయ పాఠశాలలలోను ప్రవేశపెట్టబడింది. "గ్రామసేవకుల శిక్షణ కేంద్రాలు" అన్నపేరుతో పై కేంద్రాలు 8 ఏకీకృత సంస్థలుగా పునర్వ్యవస్థీకరించ బడినాయి. తూర్పు గోదావరి జిల్లా సామర్లకోటలోను, పశ్చిమ గోదావరి జిల్లాలోని గోపన్నపాలెంలోను, చిత్తూరు జిల్లాలోని కాళహస్తిలోను, గుంటూరు జిల్లాలోని బాపట్లలోను, కర్నూలు జిల్లాలోని నంద్యాలలోను, విశాఖ పట్టణం జిల్లాలోని అనకాపల్లిలోను ఒక్కొక్కటి, హైదరాబాదు జిల్లాలోని రాజేంద్ర నగరులో రెండు గ్రామసేవకుల శిక్షణ కేంద్రాలు ఏర్పాటు చేయబడినాయి. పై శిక్షణ కేంద్రాలలో ఆంధ్రప్రాంతానికి చెందిన 511 మందికి, తెలంగాణా ప్రాంతానికి చెందిన 116 మందికి——మొత్తం 627 మంది గ్రామసేవకులకు శిక్షణ ఇవ్వబడుతుంది.

గ్రామసేవికలకు శిక్షణ ఇవ్వటంకోసం ప్రస్తుతం సామర్లకోటలో ఒకటి, రాజేంద్రనగరులో ఒకటి గృహశాస్త్ర విభాగాలు ఉన్నాయి. ప్రతి కేంద్రంలోను 20 మందికి శిక్షణ ఇవ్వడానికి ఏర్పాటు చేయబడింది. క్రొత్త బ్లాకులను ఏర్పాటు చేయడం మూలంగా శిక్షణ పొందిన గ్రామసేవికలు ఇంకా అదనంగా అవసరమవుతారు. ఈ అవసరాన్ని ఆదుకొనేటందుకు వీలుగా సామర్లకోట, రాజేంద్రనగరులలో ప్రస్తుతమున్న రెండు సంస్థలలోను శిక్షణ ఇవ్వబడేవారి సంఖ్య 1958–59 లో 20 నుండి 40 కి పెంచ

బడింది. అదనంగా మరొక గృహశాస్త్ర విభాగం కాళహస్తిలో ఏర్పాటు చేయబడింది. ఇక్కడ సంవత్సరానికి 40 మంది గ్రామసేవికలకు శిక్షణ ఇవ్వడానికి ఏర్పాటు చేయబడింది. వర్తమాన సంవత్సరంలో పై మూడు గృహశాస్త్ర విభాగాలలోను 120 మంది గ్రామసేవికలకు శిక్షణ ఇవ్వబడుతుంది.

సామర్లకోట, రాజేంద్రనగరులలో ఉన్న గ్రామసేవికల శిక్షణ కేంద్రాలకు రెండు "వర్కుషాపు" విభాగాలు అనుబంధించబడి ఉన్నాయి. మేలురకం వ్యవసాయపరికరాలను మరమ్మతు చేయడంలోను, తయారు చేయడంలోను ఏటా 20 మంది గ్రామీణ పనివారల బాలురకు ప్రతి కేంద్రాలలోను శిక్షణ ఇవ్వడానికి ఇవి ఉద్దేశించబడినాయి. ఇంతవరకు 87 మంది పనివారికి శిక్షణ ఇవ్వబడింది. ఇందులో సామర్లకోటలోని "వర్కుషాపు" విభాగంలో 60 మందికి, రాజేంద్రనగరులోని విభాగంలో 27 మందికి శిక్షణ ఇవ్వబడింది. వర్తమాన సంవత్సరంలో ఈ రెండు విభాగాల్లోను మరో 40 మంది అభ్యర్థులకు శిక్షణ ఇవ్వబడుతుందని ఆశించబడింది. ఈ సంవత్సరపు శిక్షణ కార్యక్రమంకోసం 1959-60 ప్రణాళికలో రు. 9.16 లక్షల మొత్తం కేటాయించబడింది.

## చిన్నతరహా నీటి పారుదల పనులు

### *గండ్లుపడ్డ చెరువులు (పి. డబ్ల్యూ. డి.)*
### *(బకాయ పనులు, క్రొత్త పథకాలు)*

తెలంగాణా ప్రాంతాలలో 61,176 ఎకరాల ఆయకట్టుగల దాదాపు 707 గండ్లుపడ్డ చెరువుల మరమ్మతుకోసం ప్రణాళికలో 1959-60 సంవత్సరానికి గాను రు. 39.25 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 2.23 లక్షల మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. ఈ మొత్తంతో 1,876 ఎకరాల ఆయకట్టుగల 34 చెరువులు మరమ్మతు చేయబడతాయి.

### మోటసాగు పథకాలు

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో ఈ పథకంక్రింద నదుల గట్ల మీద, నల్లల గట్లమీద 5 మోటసాగు పథకాలు అమలు జరపటానికి

ప్రతిపాదింపబడింది. ప్రతి పథకం వల్ల 200 ఎకరాలకు నీటిపారుదల జరుగుతుందని ఆశించబడింది. 1958–59 లో ఈ పథకం మంజూరు చేయబడింది. ఈ పథకం కోసం మంజూరు చేయబడిన సిబ్బంది నియమించబడిన వెంటనే మోటసాగు పథకాలను అమలు పరచడానికి గల అవకాశాలను పరిశీలించడానికి సంబంధించిన పని ప్రారంభించబడుతుంది. ఒక మోటసాగు ప్రాజెక్టును ప్రారంభించి పూర్తిచేయటం కోసం 1959–60 ప్రణాళికలో రు. 0.58 లక్ష మొత్తం కేటాయించబడింది. తెలంగాణాలోని అన్ని జిల్లాలలో ఈ పథకం రాజ్య స్థాయిలో నిర్వహించబడుతుంది.

## ఆయిలు ఇంజన్ల స్థాపన

ఈ పథకంక్రింద ఆయిలు ఇంజను పంపుసెట్లు కొనుక్కొనేటందుకు గాను తక్కావి ఋణాలు ఇవ్వబడతాయి. ప్రతి రైతుకు రు 2,000/– లకు మించకుండా ఋణాలు ఇవ్వబడతాయి. ఈ ఋణం తేలిక వాయిదాల పద్ధతిపై వసూలు చేయబడుతుంది. 1959–60 లో 250 ఆయిలు ఇంజన్లు పంపకం చేయటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు గాను ప్రణాళికలో రు. 5 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.60 లక్ష మొత్తం ఈ జిల్లాలో 30 ఆయిలు ఇంజన్ల పంపకం నిమిత్తం కేటాయించబడింది.

## క్రొత్త బావుల త్రవ్వకం, పాత బావుల మరమ్మతు

ఈ పథకంక్రింద రైతులకు క్రొత్త బావులు త్రవ్వుకోడానికి రు. 2,500 లకు మించకుండాను, పాత బావులను మరమ్మతు చేసుకోవడానికి రు. 750 లకు మించకుండాను ఋణాలు ఇవ్వబడతాయి. రెండు దఫాలలో ఋణం మొత్తం చెల్లింపు చేయబడుతుంది. పని మొదలు పెట్టినపుడు ఋణంలో కొంత భాగం ఇవ్వబడుతుంది పని చాలవరకు కొనసాగి, సకాలంలో పని ముగుస్తుందని అధికార్లు అభిప్రాయ పడినపుడు మిగత ఋణం చెల్లించబడుతుంది. తెలంగాణా ప్రాంతంలో 214 క్రొత్త బావుల త్రవ్వకానికి, 142 పాత బావుల మరమ్మతుకు గాను ఋణాలు మంజూరు చేయటం కోసం 1959–60 ప్రణాళికలో రు. 6.42 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.35 లక్షల మొత్తం ఈజిల్లాకు కేటాయించబడింది. ఈమొత్తంతో 45 క్రొత్త బావులు త్రవ్వబడతాయి. 30 పాత బావులు మరమ్మతు చేయబడతాయి.

### బోరింగు నూతులు

ఈ పథకం క్రింద నూతులలో బోరింగు వేయడానికి అవసరమయ్యే యంత్రపరికరాలను కొనటానికి, ప్రస్తుతమున్న బావుల నీటి సరఫరాను అధికం చేయుటకుగాను వాటికి బోరింగు వేసే నిమిత్తం సిబ్బందిని నియమించడానికి ప్రతిపాదించబడింది. 136 బావులలో బోరింగు వేసే నిమిత్తం 1959–60 లో రు. 0.19 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0 04 లక్ష మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ మొత్తంతో ఈ జిల్లాలోని 25 బావులలో బోరింగు వేయబడుతుంది.

### క్రొత్తబావుల సబ్సిడీ పథకం

తెలంగాణా ప్రాంతంలో రైతులు బావులు త్రవ్వుకొనేటందుకుగాను ప్రతి బావికి రు. 750/–ల చొప్పున సబ్సిడీ ఇచ్చే నిమిత్తం 1959–60 ప్రణాళికలో రు. 9.375 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ సంవత్సరంలో 1,250 బావులు త్రవ్వబడతాయని ఆశించబడుతున్నది. పై మొత్తంలో రు. 0.75 లక్ష మొత్తం ఈ జిల్లాలో 100 క్రొత్తబావుల త్రవ్వకం నిమిత్తం ప్రత్యేకించబడింది.

### చిన్నతరహా నీటిపారుదల పనుల అభివృద్ధి పథకం

చిన్నతరహా నీటి పారుదల వసరులను పునరుద్ధరించి, అభివృద్ధి పరచటం కోసం ఈ జిల్లాకు రు. 0 40 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలో గండ్లుపడి, వాడుకలో లేనటువంటి చెరువులు, ముఖ్యంగా ప్రభుత్వం వారిచే స్వాధీనం చేసికోబడిన ఎస్టేట్లలోనివి, పునరుద్ధరించబడి అభివృద్ధి చేయబడతాయి.

## పశు గణాభివృద్ధి

### కోళ్ళ పరిశీలన కేంద్రం

ఈ పథకం క్రింద, కోళ్ళ అభివృద్ధికి సంబంధించిన అన్ని సమస్యలను పరిశీలించే నిమిత్తం హైదరాబాదులో కోళ్ళ పరిశీలన కేంద్రం ఒకటి ఏర్పాటు చేయటానికి ప్రతిపాదించబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 1.01 లక్షల మొత్తం కేటాయించబడింది.

## "బయోలాజికల్ ఇన్‌స్టిట్యూట్" ఏర్పాటు

ప్రస్తుతం హైదరాబాదులో ఉన్న "సీరం ఇనిస్టిట్యూట్"లో "బయోలాజికల్ ప్రొడక్ట్స్"ను తయారుచేయడం, వాటిని సరఫరా చేసేముందు అవి నిరపాయమైనవిగా ఉండేటట్టు పరిశీలించడం మాత్రం జరుగుతున్నది. సంస్థను విస్తరింప చేయటానికి అవసరమయిన అదనపు భవనాలు, సిబ్బందికి వసతిగృహాలు నిర్మించడం, రోడ్లను వేయడం, పరికరాలను కొనుగోలు చేయడం, సిబ్బందిని నియమించడం మొదలయిన వాటికి, "బయోలాజికల్" పదార్థాలను ముఖ్యంగా హెచ్.ఎస్. వాక్సిన్, బి.క్యు. వాక్సిన్, అంథ్రాక్స్ వాక్సినువంటి బాక్టీరియల్ వాక్సినులను, ఫ్రీజ్‌డ్రయిడ్ రిండరు పెస్టు వాక్సిను, ఫ్రీజ్‌డ్రయిడ్ రాణిఖేట్ వాక్సిను. షీప్–పాక్స్ వాక్సిను, యాంటిరాబిక్ వాక్సిను మొదలయిన వైరల్ వాక్సినులను తయారు చేయటానికి గాను 1959-60 లో రు. 4.00 లక్షల మొత్తం కేటాయించ బడింది.

## పశువైద్య శాఖ ప్రధాన కార్యాలయానికి, జిల్లా కార్యాలయాలకు అదనపు సిబ్బంది నియామకం

పశు వైద్యశాఖ కార్యక్రమాలు రోజు రోజుకు పెరుగుతున్నాయి. ఎక్కువయిపోతున్న పనిని నిర్వహించేటందుకు వీలుగా 1957-58లో అదనపు సిబ్బంది నియమించబడింది. ఈ సంవత్సరంలో ఈ సిబ్బంది కొనసాగించబడుతుంది. ఇంతేకాక ప్రభుత్వ పశుక్షేత్రాలలోను, ప్రధాన కార్యాలయంలోను, జిల్లా కార్యాలయాలలోను ఇంకా కొంత అదనపు సిబ్బంది నియమించబడుతుంది. ఇందుకుగాను ఈ జిల్లాకు 1959–60 సంవత్సరానికి గాను రు. 0.356 లక్ష మొత్తం కేటాయించబడింది.

## పశు వైద్యశాలల స్థాపన

జబ్బుతో బాధపడుతున్న పశువులకు వైద్య సహాయం అందుబాటులో ఉంచడానికి, వాటికి క్రమపద్ధతిలో చికిత్స చేయటానికి గాను ఈ పథకం క్రింద తెలంగాణ ప్రాంతంలోని ముఖ్యమయిన తాలూకా కేంద్రాలలో స్టేషనరీ పశువైద్య శాలలను ఏర్పాటు చేసేటందుకు ప్రతిపాదించబడింది. పశువైద్య సౌకర్యాలు అవసరమయి ఉండి, ప్రజలు లేక స్థానిక పంచాయి

తీల నుండి విరాళాలు లభించే స్థలాలలో ఈ వైద్యశాలలు ఏర్పాటు చేయ బడతాయి. ప్రతి వైద్యశాల కూడ ఒక వెటిరినరీ అసిస్టెంటు సర్జను ఆధ్వర్యంలో పనిచేస్తుంది. 1959—60 లో తెలంగాణా ప్రాంతంలోని ఇదివరకే ఏర్పాటు చేయబడిన పశు వైద్యశాలలను కొనసాగించడమే కాక మరో నాలుగు వైద్యశాలలు ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు గాను ప్రణాళికలో రు. 0.93 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.092 లక్ష మొత్తం ఈ జిల్లాలో రెండు వైద్యశాలలను కొనసాగించడానికి గాను ప్రత్యేకించబడింది.

## చిన్నతరహా పశువైద్యశాలలు

అంటువ్యాధులు వ్యాపించకుండా నిరోధించడానికి, జబ్బు పడిన పశువులకు వైద్యసహాయం అందచేయడానికి గాను తెలంగాణా ప్రాంతంలో 1959—60 లో 10 చిన్న తరహా పశువైద్యశాలలను ఏర్పాటు చేయటానికి ఇదివరకే ఏర్పాటు చేయబడిన పశువైద్యశాలలను కొనసాగించడానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు గాను రు. 1.78 లక్షలు కేటాయించబడింది. ఇందులో రు 0.18 లక్ష మొత్తంతో ఈ జిల్లాలో రోమ 3 చిన్నతరహా పశువైద్యశాలలను ఏర్పాటు చేయడానికి ప్రతిపాదింప బడింది.

## మందులు, పరికరాలు

హైదరాబాదులోని పశువైద్యశాలల్లో రోజూ చికిత్స నిమిత్తం వచ్చే పశువుల సంఖ్య పెరిగిపోతున్నది. ఈ వైద్యశాలల యొక్క అవసరాలను తీర్చే నిమిత్తం మందులను, పరికరాలను సరఫరా చేయటం కోసం 1959—60 లో రు. 0.64 లక్ష మొత్తం కేటాయించబడింది.

## రెండు సంవత్సరాల అత్యావసర డిప్లొమా కోర్సు

పశువైద్యంలో శిక్షణ పొందినవారి కొరత రోజురోజుకు ఎక్కువవుతున్నది. ఈ కొరతను తీర్చడానికి భారత ప్రభుత్వంవారు రెండు సంవత్సరాల అత్యావసర డిప్లొమా కోర్సుకు సంబంధించిన ఒక పథకాన్ని ప్రారంభించారు. ఆ పథకాన్ని అనుసరించి హైదరాబాదులో 1955—56 సం. లో ఒక సంస్థ ఏర్పాటు చేయబడింది. మొదటి సంవత్సరం 100 మంది అభ్యర్థులు చేర్చుకోబడినారు. 84 మంది అభ్యర్థులు 1957—58 లోను, 100 మంది అభ్యర్థులు

1958—59 లోను చేర్చుకోబడినారు. వర్తమాన సంవత్సరంలో 80 మంది అభ్యర్థులను చేర్చుకోవడానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0 60 లక్ష మొత్తం కేటాయించబడింది.

### స్టాక్ మెన్ లకు శిక్షణ

పశువైద్యశాస్త్రం, పశుగణాభివృద్ధి విషయాలలో ప్రాథమిక విజ్ఞానాన్ని గురించి అభ్యర్థులకు ఈ పథకం క్రింద ఆరునెలల శిక్షణ ఇవ్వబడుతుంది. ఇందుమూలంగా వారు అంటువ్యాధులు ప్రబలకుండా నిరోధక చర్యలు తీసికోవడానికి, పశుగణాభివృద్ధి పథకాలకు సంబంధించి ప్రాథమికమైన పనులను నిర్వహించటానికి వీలు చేకూరుతుంది. శిక్షణ పూర్తి అయిన తరువాత ఈ అభ్యర్థులు కాంపౌండర్లుగా నియమించబడుతారు. నారాయణగూడలోని పశువైద్యశాలలో 170 మంది విద్యార్థులు శిక్షణ నిమిత్తం 1957-59 లో చేర్చుకోబడినారు. 1959—60 లో తెలంగాణాలో మరో 260 మంది అభ్యర్థులకు స్టాక్ మెన్ లగా శిక్షణ ఇవ్వటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.38 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.219 లక్ష మొత్తం 160 మంది అభ్యర్థుల శిక్షణ నిమిత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

### రాజేంద్రనగరులో ఉన్నికి సంబంధించిన "టెక్నలాజికల్ లేబరేటరీ"ని ఏర్పాటు చేయటం.

గొర్రెలను పెంచటంలోను, పోషించటంలోను, నిర్మాణాత్మకమైన కార్యక్రమాన్ని అవలంబించటం ద్వారా గొర్రెల పెంపకాన్ని, ఉన్ని పరిశ్రమను అభివృద్ధిచేసే ఉద్దేశంతో 1958—59 లో రాజేంద్రనగరునందు ఉన్నికి సంబంధించిన "టెక్నలాజికల్ లేబరేటరి" ఒకటి ఏర్పాటు చేయబడింది. ఈ లేబరేటరీని కొనసాగించే నిమిత్తం 1959—60 ప్రణాళికలో రు. 0.21 లక్ష మొత్తం కేటాయించబడింది.

### కేంద్ర కోళ్ళ పెంపక క్షేత్రం

ఆధునిక పద్ధతుల్లో కోళ్ళ పెంపకాన్ని రైతులలో ప్రోత్సహించేటందుకై హైదరాబాదునందు 1957—58 లో ఒక కోళ్ళపెంపక క్షేత్రం

ఏర్పాటు చేయబడింది. ప్రజలకు గ్రుడ్లను, కోళ్ళను సరఫరా చేయటానికే కాక, కోళ్ళ పెంపకంలో ఆసక్తి ఉన్నవారికి నమూనా క్షేత్రంగా కూడ ఉపయోగించటానికి ఈ క్షేత్రం ఉద్దేశించబడింది. ఈ క్షేత్రంలో సిబ్బందికి వసతి గృహాలను నిర్మించడం, కోళ్ళ గూళ్ళను నిర్మించడం, నీటి సరఫరా సదుపాయాల్ని కలుగచేయడం మొదలయిన పనులకు గాను 1959—60 సం. లో రు. 0.75 లక్ష మొత్తం కేటాయించబడింది.

## కోళ్ళ పెంపక విస్తరణ కేంద్రాలు

క్రొత్తగా రెండు కోళ్ళ పెంపక విస్తరణ కేంద్రాలను ఏర్పాటు చేయటానికి, ఇంతకు ముందే ప్రారంభించబడిన నాలుగు కోళ్ళ పెంపక విస్తరణ కేంద్రాలను కొనసాగించటానికి గాను 1959—60 ప్రణాళికలో రు. 1.28 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.055 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. ఈ మొత్తంతో ఈ జిల్లాలో ఇదివరకే స్థాపించబడిన కేంద్రం కొనసాగించబడుతుంది.

## కీలక గ్రామ పథకం

తెలంగాణా ప్రాంతంలో ఇంతకుముందు ఏర్పాటు చేయబడిన 5 కీలక గ్రామ కేంద్రాలను కొనసాగించడానికి, క్రొత్తగా మరో రెండు కేంద్రాలను ఏర్పాటు చేయటానికి గాను 1959—60 ప్రణాళికలో రు. 3.65 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.366 లక్ష మొత్తం ఈ జిల్లాలో ఒక కీలక గ్రామ కేంద్రం కొనసాగింపు నిమిత్తం ప్రత్యేకించబడింది.

## గోశాల అభివృద్ధి పథకం

ఈ జిల్లాలోని 3 గోశాలలకు ఆర్థిక సహాయం (గ్రాంటు—ఇన్—ఎయిడ్) నిమిత్తం 1959—60 ప్రణాళికలో రు. 0.217 లక్ష మొత్తం కేటాయించబడింది.

## రాజ్య, జిల్లా పశుప్రదర్శనలు

1959—60 లో ఈ జిల్లాలో ఒక జిల్లా పశు ప్రదర్శనం ఏర్పాటు చేయబడుతుంది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.01 లక్ష మొత్తం కేటాయించబడింది.

## హైదరాబాదులోని "బయోలజికల్" మరియు "రిసెర్చి" కేంద్రాన్ని పునర్వ్యవస్థీకరించటం

మొత్తం ఆంధ్రప్రదేశ్‌కు కావలసిన "బయోలజికల్స్" ఉత్పత్తిని ఎక్కువ చేసేటందుకు, ప్రస్తుతం హైదరాబాదులో నున్న "సీరమ్ ఇనిస్టిట్యూట్"ను పరిశోధనలకు, "బయోలాజికల్" పదార్థాలను తయారుచేయుటకు వీలుగా ఉండే కేంద్రంగా పునర్వ్యవస్థీకరించుటకు గాను 1959–60 ప్రణాళికలో రు. 0.26 లక్ష మొత్తం కేటాయించబడింది.

## రిండరు పెస్టు వ్యాధి నిర్మూలనా పథకం

ఈ జిల్లాలో రిండరు పెస్టు వ్యాధి నిర్మూలన ఉద్యమం కోసం రు. 0.944 లక్ష మొత్తం కేటాయించబడింది.

## ఆబోతుల పంపకం

ఈ పథకం క్రింద, 1959–60 లో రు. 0 06 లక్ష అంచనా వ్యయంతో ఈ జిల్లాలో మూర్రా, ఒంగోలు, లేక ముర్రారకానికి చెందిన 6 ఆబోతులను పంచడానికి ప్రతిపాదింపబడింది.

## పశు క్షేత్రాలకు, పశు వైద్యశాలలకు భవనాలను నిర్మించటం

ఈ జిల్లాలో పశు వైద్యశాల ఏర్పాటు చేసేటందుకు గాను స్థలం ఉచితంగా లభ్యమయ్యే తావులో శాశ్వతంగా ఒక భవనం నిర్మించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు గాను 1959–60 ప్రణాళికలో రు 0.23 లక్ష మొత్తం కేటాయించబడింది.

## విదేశీ పశువులతో ఇక్కడి పశువులను కలపడం ద్వారా మిశ్రమ జాతి పశువుల పెంపకానికి సంబంధించిన పథకం

విదేశీ జాతి పశువులతో స్థానిక పశువులను కలపడం ద్వారా మిశ్రమ జాతి పశువులను పెంచి, తత్ఫలితంగా పాలఉత్పత్తిని అధికం చేయటానికి ఈ పథకం ఉద్దేశించబడింది. ఈ జిల్లాలో ఈ పథకం ప్రయోగాత్మక పద్ధతిపై

అమలు జరుపబడుతుంది. పశువులను పెంచటం, పాలను పితకటం మొదలయిన వాటికి సంబంధించిన పూర్తి సమాచారం సేకరించబడి వర్గీకరించబడి పరిశీలింపబడుతుంది. ఈ పథకాన్ని అమలు పరచేటందుకు 1959—60 ప్రణాళికలో రు. 0.19 లక్ష మొత్తం కేటాయించబడింది.

## పాడిపరిశ్రమ, పాలసరఫరా

### *రాజేంద్రనగరులో పశుపోషక క్షేత్రం*

హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరాల్లోని వాడకందార్లకు రాజేంద్రనగరులోని ప్రభుత్వ పశుపోషక క్షేత్రం పాలను సరఫరా చేయుచున్నది.పాల సరఫరాను అధికం చేసే ఉద్దేశంతో 1958–59లో 52 ముర్రా పాడిబర్రెలు కొనబడినాయి.గొశివారికి వసతిగృహాలను,పాలను పితకటానికి శాలను మొదలైన వాటి నిర్మాణం నిమిత్తం రు. 0.55 లక్ష, 1958—59 లో మంజూరు చేయబడిన సిబ్బందిని కొనసాగించటానికి గాను 0.04 లక్ష వర్తమాన సంవత్సరంలో కేటాయించబడినాయి.

### *హైదరాబాదు, సికిందరాబాదులకు పాల సరఫరా*

ప్రస్తుతం హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరాలకు పాలు ఎక్కువగా ప్రయివేటు వ్యక్తులద్వారా సరఫరా చేయడం జరుగుతున్నది. ఈ కారణంగా వివిధ దశల్లో పాలు కల్తీచేయబడడానికి వీలుంది. కల్తీలేని పాలు సరసమైన వెలకు ప్రజలకు అందుబాటులో లేవు. ఇందువల్ల పాల సరఫరా యూనియను నొకదానిని జంటనగరాల్లో ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. వ్యాను, సైకళ్లు, లాంబ్రెట్టా స్కూటరు, మోటారు సైకిళ్లు కొనేటందుకుగాను ఈ పథకం క్రింద 1957-59 లో రు. 2.85 లక్షల మొత్తం ఖర్చు పెట్టబడింది. సెంట్రలు స్టోర్సు పర్చేస్ డిపార్టుమెంటువారి ద్వారా ఒక పాశ్చురైజేషన్ ప్లాంటు కొనబడుతుంది. పాడిపరిశ్రమకు భవనం నిర్మించటానికి సంబంధించిన ప్రణాళికలు, అంచనాలు కూడ తయారు చేయబడినాయి.1959—60లో ఈపని మొదలుపెట్టబడి పూర్తిచేయబడుతుంది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 13.09 లక్షల మొత్తం కేటాయించబడింది.

# అ డ వు లు

## ప్రాంతీయ డివిజన్ల ఏర్పాటు, అదనపు సిబ్బంది నియామకం

భూసార రక్షణ కార్యక్రమాన్ని, భూమి కోరివేతను అరికట్టే పనులను, అడవులను పెంచే కార్యక్రమాన్ని, అడవులలో మొక్కలను నాటే కార్యక్రమాన్ని, స్వాధీనం చేసికోబడిన పూర్వపు ఎస్టేటు అడవులకు సంబంధించి సరిహద్దులను ఏర్పరచే పనిని నిర్వహించుటకు గాను 1956—57 లో నియమించబడిన సిబ్బందిని కొనసాగించే నిమిత్తం రు. 0.032 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది.

## అటవీ పెంపక పరిశోధన శాఖను పటిష్ఠం చేయటం

అటవీ పెంపకానికి సంబంధించి స్థానిక సమస్యలను గురించి పరిశీలించ టానికి, పరిశీలనల రికార్డును జాగ్రత పెట్టటానికి గాను 1956—57 లో నియ మించబడిన ఇద్దరు ఫారెస్టర్లు, ఇద్దరు గుమాస్తాలు, ఇద్దరు జవానులతో కూడిన సిబ్బందిని కొనసాగించే నిమిత్తం యీ సంవత్సరానికి రు. 0.06 లక్ష మొత్తం కేటాయించబడింది.

## అటవీ పరిశోధన, ప్రచారం

దేశీయ రకాలకు చెందిన చెట్ల పెరుగుదలను, వాటి లక్షణాలను గురించి వివరాల సేకరణకు సంబంధించిన పరిశోధనలు కొనసాగించటానికి, భూసార రక్షణ, అటవీ పెంపకాన్ని గురించి పరిశోధనలు సాగించటానికి, అడవుల అభివృద్ధికి సంబంధించి పథకాలను గురించి ప్రచారం చేయుటానికి గాను 1959—60 ప్రణాళికలో రు. 0.11 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## భూసార రక్షణ పరిశోధన కేంద్రం, సాహిబ్ నగరు

ఇసుక భూములు, నల్లరేగడి భూములు ఉండే భూసారం నశించిన మొత్తం ప్రాంతాలలో పరిశోధన నిమిత్తం సాహిబ్‌నగరులోని పరిశోధన కేంద్రం ప్రధాన కేంద్రంగా ఉపయోగపడుతున్నది. అదేవిధమయినటు

పంటి చెట్టుచేమ నశించినట్టి ప్రాంతాలలో వి_స్తృతంగా పరిశోధనలు సాగిం చుటకు కూడ యిది ప్రాతిపదిక కేంద్రంగా ఉపయోగపడుతుంది. ఈ పరిశోధనా కార్యక్రమాన్ని 1959—60 లో కొనసాగించే నిమి_త్తం ప్రణాళికలో రు. 0.40 లక్ష కేటాయించబడింది.

## మెట్ట భూములు, భూసారం క్షీణించిన భూములలో అడవుల పెంపకం; భూసార క్షీణతను అరికట్టేటందుకు చర్యలు తీసికోవడం

ఈ పథకం క్రింద, భూసార క్షీణతవల్ల దెబ్బతిన్న, ప్రభుత్వానికి లేక ప్రయివేటు వ్యక్తులకు చెందినట్టి బంజరు భూముల్లో అడవులు పెంచ డం, త్రవ్వకం పని చేయడం జరుగుతున్నది. వ_ర్త_మాన సంవత్సరంలో 3,420 ఎకరాలలో అడవులు పెంచే కార్యక్రమాన్ని చేకొనడానికి, ఇంతకు ముందే చెట్లు నాటబడిన అడవులను నిర్వహించటానికి గాను రు. 1.20 లక్షల మొ_త్తం కేటాయించబడింది. ఈ జిల్లాకు రు. 1.13 లక్షల మొ_త్తం కేటా యించబడింది. 2,750 ఎకరాలలో పై పనులు నిర్వహించబడతాయి.

## భూసార రక్షణ కార్యక్రమాల అమలుకై భూమిసేకరణ

అడవులను పెంచే కార్యక్రమం నిమి_త్తం ప్రయివేటు వ్యక్తులకు చెంది నట్టి బంజరు భూములను,భూసారం క్షీణించిన భూములను స్వాధీనం చేసుకోవ టానికి ఈ పథకం క్రింద ప్రతిపాదింపబడింది. 1956—57 లో లక్ష రూపాయల వ్యయంతో ప్రయివేటు వ్యక్తులకు చెందిన 400 ఎకరాల భూమి స్వాధీనం చేసుకోబడింది. 1957—59 సంవత్సరాలలో ఎలాంటి అభివృద్ధి సాధించబడలేదు. అడవులను పెంచే పనికోసం భూమిని స్వాధీనంచేసికొనే నిమి_త్తం యీ సంవత్సరంలో రు. 0.10 లక్ష మొ_త్తం కేటాయించబడింది.

## లక్క ఉత్ప_త్తి

ఆదిలాబాదు జిల్లా అటవీ ప్రాంతాలలో ఉత్ప_త్తి చేయబడే లక్కవల్ల విదేశీమారక ద్రవ్యం లభించడమే గాక, గ్రామీణ ప్రజలకు కొంత ఉపాధి కూడ ఏర్పడుచున్నది. ఈ పథకం క్రింద 1959—60 ప్రణాళికలో రు. 0.15 లక్ష మొ_త్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.03 లక్ష మొ_త్తం ఈ జిల్లాకు 50 మణుగుల లక్క ఉత్ప_త్తికిగాను ప్రత్యేకించబడింది.

## కలప అడవులలో కృత్రిమ పద్ధతిమీద చెట్ల పెంపకం

అటవీ శాఖవారిచే స్వాధీనం చేసికోబడిన అటవీ ప్రాంతాల ఉత్పాదక శక్తిని హెచ్చు చేసేటందుకు గాను, చెట్టుచేమ నశించినట్టి ప్రాంతాలలో పునరుద్ధరణ క్షేత్రాలు ఏర్పాటు చేయబడుతున్నాయి మేలురకం కలప నిచ్చేటటువంటి, ఆర్థికంగా ఉపయోగ పడేటటువంటి రకాల చెట్లు ఈ ప్రాంతాలలో వేయబడుతున్నాయి. ఇంతేకాక త్రవ్వకంపని కూడ సాగించ బడుతుంది. ఈ జిల్లాలోని 200 ఎకరాలలో పునరుద్ధరణ క్షేత్రాలు ఏర్పాటుచేయుటకు గాను యీ సంవత్సరానికి రు. 0. 20 లక్ష మొత్తం కేటాయించబడింది.

## భవనాల నిర్మాణం

అటవీశాఖ కార్యాలయాలు చాలవరకు అద్దెభవనాల్లో ఏర్పాటు చేయబడి ఉన్నాయి. వీటికి భవనాలను నిర్మించటానికి, జిల్లా అటవీశాఖాది కార్లకు వసతి గృహాలను నిర్మించడానికి ఈ పథకం ఉద్దేశించ బడింది. ఇంతకుముందే చేకొనబడిన పనిని పూర్తిచేయటం కోసం 1959—60 ప్రణాళికలో ఈ జిల్లాకు రు. 6. 0 లక్షల మొత్తం కేటాయించబడింది.

## జీడి తోటలు

ఈ పథకం క్రింద, ఈ జిల్లాలో 1,200 ఎకరాల భూమిలో 1959-60 నందు జీడి తోటలను రు. 0. 16 లక్ష వ్యయంతో ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది.

## జూలాజికల్ గార్డెన్సు ఏర్పాటు

వన్య మృగాలను, అందులో ముఖ్యంగా అరుదైన వాటిని, పరిరక్షించే నిమిత్తం, ప్రజలకు వన్య మృగాలను గురించి తెలిపే నిమిత్తం 1958—59 లో హైదరాబాదునందు "జూలాజికల్ గార్డెను" ఒకటి ఏర్పాటు చేయబడింది. ఈ "జూలాజికల్ గార్డెను"ను నిర్వహించటానికి, భూములను స్వాధీనంచేసుకోవటానికి, భవనాలను నిర్మించటానికి, బోనులు, కంచెలు, గుంటలు, చెరువులు మొదలయినవి ఏర్పాటు చేయటానికి గాను. ఈ సంవత్సరానికి రు. 7.50 లక్షల మొత్తం కేటాయించబడింది.

# భూసార రక్షణ

## భూసార రక్షణ, మెట్టసాగు పద్ధతుల్ని గురించి పెద్ద ఎత్తున ప్రదర్శన ప్రాజెక్టులను ఏర్పాటుచేయటం

భూసార రక్షణ, మెట్టసాగు పద్ధతుల్ని గురించి పెద్దఎత్తున ప్రచారం చేయటానికి, భూసార రక్షణ కార్యక్రమాన్ని గురించి ప్రజలలో ఆసక్తిని కలిగించటానికి, కర్షకులకు విద్యార్థులకు భూసారరక్షణ చర్యలకు సంబంధించి శిక్షణ ఇవ్వటానికి ఈ పథకం ఉద్దేశించబడింది. 1959—60 లో హైదరాబాదు లోని దాదాపు 400 ఎకరాల ఎఱ్ఱరేగడి భూమిలో ఒక భారీ ప్రదర్శన యూనిట్టును ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇంతేకాక ఒక డివిజనలు ఇంజనీరు (భూసార రక్షణ), ఒక అసిస్టెంటు అగ్రికల్చరల్ ఇంజనీరు, ఒక అగ్రానమిస్టు, నలుగురు సాయిల్ కన్సర్వేషన్ అసిస్టెంట్లు, ఇద్దరుఅగ్రికల్చరల్ ఇంజనీరింగు సూపరు వైజరులు, ఇద్దరుసర్వేయర్లు, ముగ్గురు ఫీల్డు అసిస్టెంట్లు, ఒక ట్రేసరు, ఒక సూపరింటెండెంటు, ఇద్దరు అప్పరు డివిజను గుమాస్తాలు, ఇద్దరు లోయరు డివిజను గుమస్తాలు, ఒక టైపిస్టు, ఇద్దరు జీపు డ్రైవర్లు, 6 గురు జవానులతో కూడిన సిబ్బంది నియమించబడుతుంది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.90 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఇంతేకాక టి.సి.ఎమ్. నుండి లభించే సహాయం నుండి సర్వే పరికరాలకు, జీపులకు, ఇతర పరికరాలకు అయ్యే వ్యయాన్ని భరించటానికి ప్రతిపాదింపబడింది.

## సబ్-అసిస్టెంట్ల శిక్షణకు సంబంధించిన పథకం

వ్యవసాయ భూముల్లో భూసారరక్షణ కార్యక్రమాలను అమలు పరచే విషయంలో సబ్ అసిస్టెంట్లయిన సర్వేయర్లకు, ఫీల్డుమెన్‌లకు శిక్షణ ఇవ్వటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను లేబరేటరీ, గ్రంథాలయ సౌకర్యాలు, నిపుణుల సహాయం లభ్యమయ్యే రాజేంద్రనగరులో ఒక కేంద్రం నెలకొల్పటానికి ప్రతిపాదింపబడింది. దరిదాపుల్లో ఉన్న భూసార రక్షణ ప్రాజెక్టు ప్రాంతాల్లో శిక్షణ పొందేవారికి ప్రత్యక్ష శిక్షణ కూడ ఇవ్వబడుతుంది. 52 మంది సబ్-అసిస్టెంట్లకు శిక్షణ ఇచ్చే నిమిత్తం 1959—60

ప్రణాళికతో రు. 0.62 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ పథకం అమలు జరపటంకోసం ఒక అసిస్టెంటు అగ్రికల్చరల్ ఇంజనీరు, ఒక సాయిల్ కన్సర్వేషను అసిస్టెంటు, ఒక అగ్రికల్చరల్ ఇంజనీరింగు సూపర్ వైజర్, నలుగురు స్టాఫ్ మెన్‌లు, 8 మంది చైర్ మెన్‌లు, ఒక అప్పరు డివిజను గుమాస్తా, ఒక లోయరు డివిజను గుమాస్తా, ఒక టైపిస్టు, ఒక స్టోరుకీపరు, ఇద్దరు జవానులు నియమించబడతారు.

## మెట్టసాగుకు సంబంధించి పైలట్ ప్రదర్శన ప్రాజెక్టులు

కంటూరుబడింగు (సొలోపు గట్లు) వేయబడిన ప్రాంతాలలో రైతులు మెట్టసాగు పద్ధతుల్ని అవలంబించేటందుకై వారికి ఎకరానికి రు. 15/- లు చొప్పున సబ్సిడీ ఇవ్వటానికి ఈ పథకం ఉద్దేశించబడింది. 30 ప్లాటులుగా ఏర్పరచబడిన 300 ఎకరాల భూమిలో మెట్టసాగు పద్ధతుల్ని ప్రవేశపెట్టటానికై ఈ జిల్లాకు 1959—60సంవత్సరానికి గాను రు. 0.049 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## కాంటూరు బండింగు (సొలోపు గట్లు పోయడం)

తెలంగాణా ప్రాంతంలో భూములు మిట్ట పల్లాలతో కూడుకొని ఉండటంచేత భూసార రక్షణ అనేది చాలా తాలూకాలలో సమస్యగా పరిణమించింది. భూసార క్షీణతను అరికట్టడానికి, భూమిలో తేమను కాపాడడానికి, తద్వారా పంట దిగుబడిని పెంచటానికిగాను సొలోపు గట్లు పోయడం, చదునుచేయడం, సొలోపుల వెంబడి దున్నడం, గట్లపై పైర్లు నాటడం వంటి భూసార రక్షణ చర్యలు తీసికోబడుతున్నాయి. మధ్యరకం, తేలిక రకం భూముల్లో, అందులోను ముఖ్యంగా ఎర్ర ఇసుక భూములలో, గట్లుపోసే కార్యక్రమం అమలు జరుపబడుతుంది. ఆరగాణి ఉండే ప్రాంతాల నుండే ఈ ప్రాంతాలు ఎంపిక చేయబడతాయి. 1955—56 లో ఈ పథకం ప్రారంభించబడింది. 1956—59 సంవత్సరాల కాలంలో 4,453 ఎకరాల్లో సొలోపు గట్లు వేయబడినాయి. ఈ పనులవల్ల లాభం పొందే వారినుండి తగినట్టి ఒప్పందం కుదుర్చుకొన్న తరువాతనే వ్యవసాయదార్ల పొలాల్లో ఈ పనులు నిర్వహించబడతాయి. తెలంగాణా ప్రాంతంలో 6,900 ఎకరాల భూమిలో సొలోపు గట్లు వేయడానికి, అవసరమైన అదనపు సిబ్బందిని నియ

మించడానికి, ప్రస్తుతమున్న సిబ్బందిని కొనసాగించడానికిగాను 1959–60 ప్రణాళికలో రు. 6.06 లక్షల మొత్తం కేటాయించబడింది.

## మత్స్య సంవర్ధన

### *బెస్తల సహకార సంఘాలకు సహాయం*

బెస్తలలో చాలమంది పేదవారు. తెలంగాణా ప్రాంతములోని బెస్తల సహకార సంఘాలకు తగ్గింపు ధరలకు నైలాను వలలను సమకూర్చడమే ఈ పథకం యొక్క ఆశయం. 40 వలలను కొని, సక్రమంగా నిర్వహింపబడుతున్న బెస్తల సహకార సంఘాలకు పంపకం చేసేనిమిత్తం 1959–60 సం॥లో రు. 0.10 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో 8 వలలు ఈ జిల్లాలో పంపకం చేయబడతాయి. ఈ వలల ఖరీదు బెస్తల నుండి 5 సంవత్సరాల కాలంలో, చేపలు పట్టని నెలలను మినహాయించి, తేలిక వాయిదాలలో వసూలు చేయబడుతుంది.

### *హైదరాబాదు జిల్లాలో మత్స్యపరిశ్రమాభివృద్ధి*

ఈ జిల్లాలో మత్స్య పరిశ్రమను అభివృద్ధిచేసే నిమిత్తం 1958–59లో ప్రత్యేక సిబ్బంది నియమించబడింది. 1959–60 లో ఇది రు. 0.53 లక్ష వ్యయంతో కొనసాగించబడుతుంది. వర్తమాన సంవత్సరంలో అదనంగా 6 లక్షల పౌనుల చేపలు ఉత్పత్తి చేయబడతాయని ఆశించబడుతున్నది.

## సహకారోద్యమం, గిడంగులు, మార్కెటింగు

### *గ్రామీణ పరపతి సంఘాల విస్తరణ*

ఆంధ్ర ప్రాంతంలో అమలులో ఉన్న పథకం పద్ధతి మీదనే ఈ పథకం కూడ రూపొందించబడింది. తెలంగాణా ప్రాంతంలో ఉన్న గ్రామీణ పరపతి సంఘాలను పునర్వ్యవస్థీకరించటం, పటిష్ఠం చేయటం, విస్తరింపచేయటం ఈ పథకం యొక్క ఉద్దేశం. సహకారశాఖ సిబ్బందిని పటిష్ఠం చేయటం ద్వారాను, సెంట్రల్ బ్యాంకులు పెద్దతరహా సంఘాలు అదనంగా నియమించే

పర్యవేక్షక, నిర్వాహక సిబ్బందికి అయ్యే ఖర్చు క్రింద సహాయం చేయటం ద్వారాను ఈ పథకం రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో అమలు జరుపబడింది. 1959—60 సం. లో ఇంతకు ముందు నియమించబడిన సిబ్బందిని కొనసాగించటానికి, తెలంగాణా ప్రాంతంలో క్రొత్తగా 650 చిన్నతరహా సంఘాలను ఏర్పాటు చేయటానికి, ప్రస్తుతమున్న 500 చిన్న తరహా సంఘాలను పటిష్ఠం చేయటానికి, నిర్వాహక సిబ్బంది ఖర్చు క్రింద ధన సహాయం చేయటానికి ప్రతిపాదింపబడింది. రు.300 లక్షల వరకు స్వల్పకాలిక ఋణాల పరిమితిని, రు. 30 లక్షల వరకు మధ్యకాలిక ఋణాల పరిమితిని పెంచడానికి కూడ ప్రతిపాదింపబడింది. అపెక్సు బ్యాంకులు, కేంద్రసహకార బ్యాంకులు అప్పు తీసుకొనే స్తోమతను ఎక్కువ చేసుకోవటానికి తద్వారా అవి అప్పులిచ్చే సౌకర్యాన్ని అధికం చేసుకోవటానికి వీలుకలిగించే నిమిత్తం వాటి వాట మూల ధనాల క్రింద ఇంకా ఎక్కువగా ప్రభుత్వం డబ్బును ఇవ్వడానికి ప్రతిపాదింపబడింది. ఇప్పుడున్న జిల్లా కార్యాలయాలన్నీ రెండు డిప్యూటి రిజిస్ట్రార్ల సర్కిళ్ళ క్రింద పునర్వ్యవస్థీకరించబడతాయి. డిప్యూటి రిజిస్ట్రార్లకు సహాయపడే నిమిత్తం సహకార సబ్—రిజిస్ట్రార్లు, సీనియరు, జూనియరు ఇనస్పెక్టర్లుతో కూడిన అదనపు సిబ్బంది నియమించబడుతుంది. కార్యనిర్వాహక శాఖనుండి ఆడిటు శాఖను విడతీసే పథకం కూడ వర్తమాన సంవత్సరంలోనే అమలు జరుపబడుతుంది.

ఈ కార్యక్రమం క్రింద ఈ జిల్లాలో క్రొత్తగా 60 చిన్న తరహా సంఘాలు ఏర్పాటు చేయబడతాయి. ప్రస్తుతమున్న 56 చిన్న తరహా సంఘాలు పటిష్ఠం చేయబడతాయి. పాతసంఘాల్లో 23,900 మంది సభ్యులు, క్రొత్త సంఘాల్లో 1,800 మంది సభ్యులు చేర్చుకోబడతారు. రు. 25 లక్షల వరకు స్వల్పకాలిక ఋణాలు, రు. 5 లక్షల వరకు మధ్యకాలిక ఋణాలు ఇవ్వబడతాయి.

పై కార్యక్రమం అమలు జరపటం కోసం ఈ జిల్లాకు రు.2,19,848లు కేటాయించబడినాయి. పై డబ్బు క్రింది విధంగా వినియోగించబడుతుంది.

| | రూపాయలు. |
|---|---|
| 1. చిన్నతరహా సంఘాలకు సహాయం. | |
| (ఎ) 1958—59 లో ప్రారంభించబడిన సంఘాలకు. | 1,800 |

| | | రూపాయలు |
|---|---|---|
| | (బి) 1959–60లో ఏర్పాటు చేయబడబోయే క్రొత్త సంఘాలకు | 6,900 |
| 2. | పెద్దతరహా సంఘాలకు సహాయం. | 5,500 |
| 3. | సెంట్రలు బ్యాంకులకు సహాయం. | |
| | (ఎ) సెక్రటరీగా నియమించబడిన కో–ఆపరేటివ్ సబ్–రిజిస్ట్రారు జీతభత్యాలకు | 3,300 |
| | (బి) ఎక్జిక్యూటివ్ ఆఫీసరుగా పనిచేయుటకు నియమించబడిన సీనియరు ఇనస్పెక్టరు జీతభత్యాలకు | 1,500 |
| | (సి) గత సంవత్సరాల్లో నియమించబడిన సూపరువైజరుల జీతభత్యాలకు | 5,000 |
| | (డి) ఈ సంవత్సరంలో నియమించబడే సూపరువైజరుల జీతభత్యాలకు | 3,200 |
| | (ఇ) అకౌంటెంటు, లోయరుడివిజను గుమాస్తా మొదలయిన సిబ్బంది జీతభత్యాలకు | 2,800 |
| 4. | అదనపు సిబ్బంది జీతభత్యాలకు | |
| | (ఎ) 1957-58 లో అదనంగా నియమించబడిన సేల్ ఆఫీసర్లకు | 36,000 |
| | (బి) 1957–58 లో అదనంగా నియమించబడిన ఆడిటు సిబ్బందికి | 20,000 |
| | (సి) సహకార సబ్ రిజిస్ట్రారు, టైపిస్టు, జవానులకు | 5,400 |
| | (డి) 1958–59లో అదనంగా నియమించబడిన ఆడిటు సిబ్బందికి | 21,000 |
| | (ఇ) రెండు కో–ఆపరేటివ్ సర్కిళ్ళుగా జిల్లాలను విభాగించుటకు | 24,600 |

| | | రూపాయలు |
|---|---|---|
| (ఎఫ్) | అదనపు తాలుకా ఇనస్పెక్టర్లకు | 19,460 |
| (జి) | సర్కిలుకు ముగ్గురు సహకార సబ్ రిజిస్ట్రార్లు, ఇద్దరు సీనియరు ఇనస్పెక్టర్లు, ఇద్దరు జూనియరు ఇనస్పెక్టర్ల చొప్పున అన్ని సర్కిళ్ళకు అదనపు సిబ్బందికి | 36,450 |
| (హెచ్) | 1959–60 లో క్రొత్తగా ఏర్పాటు చేయబడబోయే ప్రతి సర్కిలుకు సహకార సబ్ రిజిస్ట్రార్లు, టైపిస్టు మొదలగు వారికి | 5,400 |
| (ఐ) | ఆడిటు శాఖను వేరుచేయుటకు | 21,538 |
| | మొత్తం | 2,19,848 |

## భూమి తనఖా బ్యాంకుల అభివృద్ధి

ఈ పథకం క్రింద తెలంగాణా ప్రాంతంలో క్రొత్తగా ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులను ఏర్పాటు చేయటానికి దీర్ఘకాలిక ఋణాలు అధికంగా ఇవ్వటానికి తలపెట్టబడింది. 1957–58 లోను, 1958–59 లోను పథకం అమలు జరుపబడింది. క్రొత్తగా 14 ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులు ఏర్పాటు చేయబడినాయి. రు. 19.32 లక్షల వరకు దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వబడినాయి. ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులను ఏర్పాటు చేయటం, పర్యవేక్షించటం, తనఖీ చేయటం నిమిత్తం సహకార సబ్ రిజిస్ట్రార్లు, సీనియరు ఇనస్పెక్టర్లు, సూపరువైజరులతో కూడి అదనపు సిబ్బంది కూడ నియమించబడింది.

ఈ సంవత్సరంలో ఈ జిల్లాలో రు. 2.50 లక్షల వరకు దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వబడతాయి. రెండు భూమి తనఖా బ్యాంకులు ఏర్పాటు చేయబడతాయి. ఈ సంవత్సరానికి రు. 0.172 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. అది క్రింది విధంగా వినియోగించబడుతుంది.

| | | రూపాయలు లక్షలలో |
|---|---|---|
| 1. | నిర్వాహక సిబ్బంది క్రింద ఖర్చు. | |
| | (ఎ) ముందు సంవత్సరాల్లో ఏర్పాటు చేయబడిన పాత బ్యాంకులకు | 0.050 |
| | (బి) ఈ సంవత్సరంలో ఏర్పాటు చేయబడ పోయే క్రొత్త బ్యాంకులకు | 0.060 |
| 2. | చిల్లర ఖర్చుల క్రింద బ్యాంకులకు సబ్సిడీ. | 0.019 |
| 3. | భూమి తనఖా బ్యాంకుల పనికోసం నియమించబడే సహకార సబ్ రిజిస్ట్రార్లు, జవానుల క్రింద ఖర్చు. | |
| | (ఎ) ముందు సంవత్సరాల్లో నియమించబడిన పాత సిబ్బంది క్రింద. | 0.043 |
| | (బి) 1959–60 లో నియమించబడే క్రొత్త సిబ్బంది క్రింద. | — |
| | మొత్తం | 0.172 |

## సహకార మార్కెటింగు అభివృద్ధి

వ్యవసాయదార్లకు స్టోరేజి, గిడ్డంగి, ప్రాసెసింగు, మార్కెటింగు సౌకర్యాలను కలిగించటంద్వారా సహకార మార్కెటింగును అభివృద్ధి చేయడం ఈ పథకం క్రింద ఉద్దేశించబడింది. రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలోను ఇది అమలు జరుపబడింది. 39 మార్కెటింగు సంఘాలు ఏర్పాటు చేయబడినాయి. అంతేకాక గిడ్డంగులు మొదలైన వాటిని నిర్మించడంలో ఆర్థిక సహాయం కూడ చేయబడింది.

వర్తమాన సంవత్సరంలో తెలంగాణా ప్రాంతంలో మరో 10 సహకార మార్కెటింగు సంఘాలను ఏర్పాటు చేయటానికి, మార్కెటింగు సంఘాల వాటామూల ధనం క్రింద రు. 7 లక్షలను ఇవ్వటానికి ప్రతిపాదించబడింది. ఇంతేకాక గిడ్డంగుల నిర్మాణానికి ఆర్థిక సహాయం కూడ చేయబడుతుంది. సహకార మార్కెటింగు విషయాలకు సంబంధించి సీనియరు

ఇనస్పెక్టర్లకు శిక్షణ కూడ ఇవ్వబడుతుంది. ఈ సంవత్సరంలో క్రింది కార్యక్రమాలు ఈ జిల్లాలో అమలు జరుపబడుతాయి.

1. ఫలసాయంపై రు. 14 లక్షల వరకు ఋణాలు ఇవ్వడం.
2. క్రొత్తగా ఏర్పాటు చేయబడే మార్కెటింగు సంఘాలద్వారా ఒక గిడ్డంగుల నిర్మాణం.
3. క్రొత్తగా ఏర్పాటు చేయబడే పెద్దతరహా సంఘాలద్వారా మూడు గిడ్డంగుల నిర్మాణం.

పైకార్యక్రమాన్ని అమలు పరచటంకోసం ఈ జిల్లాకు రు. 2.225 లక్షల మొత్తం కేటాయించబడింది. అది క్రింది విధంగా వినియోగించ బడుతుంది.

| | | రూపాయలు లక్షలలో |
|---|---|---|
| 1. | మార్కెటింగు సంఘాలకు వాటామూలధనం క్రింద | 0.800 |
| 2. | ఇదివరలో ఏర్పాటు చేయబడిన మార్కెటింగు సంఘాల నిర్వాహక సిబ్బంది క్రింద సబ్సిడీ | 0.025 |
| 3. | ఈ సంవత్సరంలో ఏర్పాటు చేయబడే మార్కెటింగు సంఘాల నిర్వాహక సిబ్బంది క్రింద సబ్సిడీ. | ... |
| 4. | పెద్ద తరహా సంఘాలకు గిడ్డంగులు : | |
| | (ఎ) ఇదివరలో ప్రారంభించబడిన గిడ్డంగుల నిర్మాణం పూర్తి చేయటానికి. | 0.450 |
| | (బి) 1959—60 లో నిర్మించే గిడ్డంగులకు | 0.600 |
| 5. | మార్కెంటింగు సంఘాలకు గిడ్డంగులు : | |
| | (ఎ) ఇదివరలో ప్రారంభించబడిన గిడ్డంగుల నిర్మాణం పూర్తి చేయటానికి | 0.100 |
| | (బి) ఈ సంవత్సరంలో నిర్మించే గిడ్డంగులకు. | 0.250 |
| | మొత్తం | 2.225 |

## పరిశోధన, పరిశీలన, గణాంక వివరాలు

ఈ పథకం క్రింద సహకార శాఖలో ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటు చేయబడుతుంది. సహకారశాఖ ద్వారా అమలు జరుపబడే వివిధ పథకాల మూలంగా ప్రజలకు కలిగిన ప్రయోజనాన్ని, ఆ పథకాలను అమలు జరపడం లో తెలియ వచ్చిన అనుభవాన్ని పరిశీలించడానికి, సూత్ర విధానాలను రూపొందించడానికి, సహకార వ్యవస్థలో లోటుపాట్లు ఏమన్నా ఉంటే వాటిని సరిదిద్దుకొనేటందుకు మార్గాలను సూచించడానికి ఈ విభాగం కృషి చేస్తుంది. 1957–58 లో 20 మంది సీనియరు ఇనస్పెక్టర్లను జిల్లాలలో నియమించడం ద్వారాను, గణాంక వివరాల సేకరణ, సంకలనం చేయటం కోసం ప్రధాన కార్యాలయంలో ఒక విభాగం ఏర్పాటు చేయడం ద్వారాను ఈ పథకం అమలు జరుపబడింది. 1958–59 లో ఇది కొనసాగించబడింది.

1959–60 సంవత్సరంలో డిప్యూటి రిజిష్ట్రారు గ్రేడులో ఒక స్టాటిస్టీషియను, ఇద్దరు సీనియరు ఇనస్పెక్టర్లు. ఇద్దరు జూనియరు ఇనస్పెక్టర్లు, ఇద్దరు జవానులతో కూడిన సిబ్బందిని జిల్లాలలోని సిబ్బందికి సూచన లివ్వ టానికి, నియంత్రణ చేయుటకు గాను రిజిష్ట్రారు కార్యాలయంలో నియ మించేటందుకు, క్రొత్తసర్కిళ్ళకు 12 మంది సీనియరు ఇనస్పెక్టర్లను, ప్రతి సర్కిలు ఆఫీసుకు ఒక్కొక్కరు చొప్పున 46 మంది లోయరు డివిజను గుమాస్తాలను నియమించేటందుకు ప్రతిపాదింపబడింది. క్రొత్త విధానాలను రూపొందించి వాటిని అమలుపరచుటకు విధానాలను రూపొందించుటకు గాను సహకారశాఖలో పరిశోధన, పరిశీలన, ప్రచార విభాగం ఒకటి ఏర్పాటు • చేయబడుతుంది. మొట్టమొదటగా ముగ్గురు సహకార సబ్–రిజిష్ట్రార్లు, ముగ్గురు జవానులతో కూడిన సిబ్బంది ఈ విభాగంలో ఏర్పాటు చేయబడుతుంది. పై కార్యక్రమాన్ని అమలుపరచటంకోసం వర్తమాన సంవత్సరపు ప్రణాళికలో రు. 1.70 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.34 లక్ష మొత్తం ప్రధాన కార్యాలయంలో నియమించ బడే సిబ్బంది ఖర్చు క్రింద, ప్రచారం మొదలయినవాటి కయ్యే ఖర్చు క్రింద ప్రత్యేకించబడింది. మిగిలిన రు. 1.36 లక్షలలో రు. 6,950/– లు ఈ జిల్లాలో నియమించబడే సిబ్బంది ఖర్చు క్రింద కేటాయించబడింది.

## సహకార సంఘాల సభ్యులకు, పంచాయతీదార్లకు శిక్షణ

అఖిలభారత సహకార యూనియను ద్వారా భారతప్రభుత్వం వారిచే ప్రతిపాదింపబడిన పథకం నమూనాలో ఈ పథకం రూపొందించ బడింది. ఈ పథకం క్రింద సహకార సిద్ధాంతం యొక్క మూలసూత్రాలను గురించి, ఆచరణను గురించి, లెక్కలను తయారు చేయటం గురించి, సహకార సంస్థల నిర్వహణ గురించి, గ్రామీణ పరపతి సంఘాల సభ్యులకు రెండు, మూడు రోజులపాటు, పంచాయతీదారులకు ఒక వారంరోజులపాటు. సహకార సంఘాలలో జీతంతో పనిచేసే వారికి 5 లేక 6 వారాలపాటు శిక్షణ ఇవ్వబడుతుంది. ఈ జిల్లాలో 1000 మంది సభ్యులకు, 300 మంది పంచాయతీదారులకు, 40 మంది కార్యాలయోద్యోగులకు శిక్షణ ఇవ్వటం కోసం 1959–60 లో రు. 7,246/– లు కేటాయించబడినాయి.

## సహకార వ్యవసాయం

సహకార వ్యవసాయ సంఘాలను ఏర్పాటు చేయటం ద్వారాను, వాటా మూలధనం క్రింద, ఎద్దులు కొనుక్కోవటానికి, భూమిని సాగులోనికి తెచ్చి అభివృద్ధి చేయటానికి, వ్యవసాయ పరికరాలు మొదలైన వాటిని కొనుక్కోవటానికిగాను ఋణాల రూపంలోను, గ్రాంట్ల రూపంలోను ధన సహాయం చేయటంద్వారాను భూములేని వ్యవసాయ కూలీలకు భూములలో పునరావాసం కల్పించటానికి ఈ పథకం క్రింద ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను వర్తమాన సంవత్సరపు ప్రణాళికలో రు. 2.22 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.34 లక్షలు ఆంధ్ర ప్రణాళిక క్రింద, రు. 0.88 లక్ష తెలంగాణా ప్రణాళిక క్రింద కేటాయించబడినవి. సహకార, వ్యవసాయానికి సంబంధించిన పనిని నిర్వహించటానికై ప్రధాన కార్యాలయంలో నియమించబడిన సిబ్బంది జీతభత్యాల క్రింద పై మొత్తంలో రు. 0.28 లక్ష ప్రత్యేకించబడింది. మిగత మొత్తంలో రు. 10,000 లు ఈ జిల్లాకు కేటాయించబడినాయి. ఈ జిల్లాలో యీ సంవత్సరంలో ఏర్పాటు చేయబడబోయే సంఘాలకు ఆర్థిక సహాయం చేయటానికి ఈ పథకం వినియోగించబడుతుంది. ఈ జిల్లాలో ఒక క్రొత్త సంఘం యీ సంవత్సరంలో 100 మంది సభ్యులతో ఏర్పాటు చేయబడుతుంది. 500 ఎకరాల భూమి సాగుచేయబడుతుంది.

## రాజ్యా గిడ్డంగి సంస్థ

దేశంలో గిడ్డంగుల నిర్మాణావశ్యకతను గురించి పెక్కు కమిటీలు, కమిషన్లు అనేకసార్లు నొక్కిచెప్పాయి. అవి పరపతి సంఘాలకు, పరపతేతర సంఘాలకు మధ్య చక్కని సారథ్యం వహిస్తాయి. ఈ విషయం దృష్ట్యా భారతప్రభుత్వంవారు సెంట్రల్ వేరుహౌసింగు కార్పొరేషనును (గిడ్డంగిసంస్థ) ఏర్పాటు చేశారు. దీనికనుగుణంగా తమ తమ రాజ్యాలలో రాజ్య గిడ్డంగి కార్పొరేషన్లను ఏర్పాటు చేయవలసిందిగా రాజ్య ప్రభుత్వాలు కోరబడినాయి. ఈ కార్పొరేషన్లు వేరు హౌసింగు బోర్డు అజమాయిషీ క్రింద పని చేస్తాయి. ఈ గిడ్డంగులు ఇచ్చే రసీదులు "నెగోషియబుల్ ఇన్స్ట్రుమెంట్సు"గా పరిగణించబడతాయి. ఈ గిడ్డంగులలో వ్యవసాయోత్పత్తులను నిలువచేసుకొనే వారికి అవి ఇచ్చే రసీదులు ధరావతుగా ఉంచుకొని బ్యాంకులు అప్పులను ఇస్తాయి. 1958–59 లో రాజ్య గిడ్డంగి సంస్థ ఒకటి ఈ రాజ్యంలో ఏర్పాటు చేయబడింది. ఈ సంస్థ వాటా మూల ధనం క్రింద ప్రభుత్వం వారు రు. 2.50 లక్షల మొత్తం ఇచ్చారు. ఈ సంస్థకు వాటా మూలధనం క్రింద మరి కొంతడబ్బు ఇచ్చేటందుకుగాను యీ సంవత్సరంలో ఆంధ్ర ప్రణాళికలో రు. 5 లక్షలు, తెలంగాణా ప్రణాళికలో రు. 5 లక్షలు కేటాయించబడినాయి. ఈ పథకం క్రింద ఈ జిల్లాలోని రైతులకు కూడ లాభం చేకూరుతుంది.

## జాతీయ విస్తరణ సేవాకేంద్రాలు,
## సామాజికాభివృది కేంద్రాలు

1959 మార్చి నెల అంతం నాటికి ఈ జిల్లాలో 5 మొదటిదశ బ్లాకులు, 3 సామాజికాభివృద్ధి బ్లాకులు ఉన్నాయి. వీటి వైశాల్యం 2216.17 చదరపు మైళ్ళు. ఈ కేంద్రాలలోని గ్రామాల సంఖ్య 930. ఇందు నివసించే జనాభా 5,90,162. భారత ప్రభుత్వంవారి నిర్ణయానుసారంగా 1959 ఏప్రెలు నెల నుండి ఏర్పాటు చేయబడబోయే ప్రతి బ్లాకులో కూడ "ప్రీ—ఎక్స్టెన్షన్" కార్యక్రమం క్రింద ఒక సంవత్సరంపాటు వ్యవసాయ విషయాలను గురించి తీవ్ర కృషి జరగాలి.

ఈ జిల్లాలోని వికారబాదు సామాజికాభివృద్ధి కేంద్రం మాత్రం 1–4–59 నుండి రెండవ దశ బ్లాకుగా ఏర్పడింది. ఈ కారణంగా 1.4.1959

నాటికి ఈ జిల్లాలో 5 మొదటి దశ బ్లాకులు, ఒక రెండవ దశ బ్లాకు, రెండు సామాజికాభివృద్ధి బ్లాకులు ఉన్నాయి.

ఈ జిల్లాలో సామాజికాభివృద్ధి కార్యక్రమాన్ని అమలు జరపటం కోసం వర్తమాన సంవత్సరపు ప్రణాళికలో రు. 5,10,600 లు ఋణాల పద్దు క్రింద, రు. 8,23,700 లు గ్రాంట్లు పద్దు క్రింద—మొత్తం రు. 13,34,300 లు కేటాయించబడినాయి.

1–4–1959 వ తేదీనాటికి ఈ జిల్లాలో ఉన్న సామాజికాభివృద్ధి బ్లాకులను చూపే పటం ప్రక్క పుటలో ఇవ్వబడింది.

# పంచాయితీలను పటిష్ఠం చేయటం

## సిబ్బందికి సంబంధించిన పథకం

పంచాయతీలను పటిష్ఠం చేసే ఉద్దేశంతో జిల్లా స్థాయిలో జిల్లా పంచాయతీ ఆఫీసరును, రెవెన్యూ డివిజను స్థాయిలో డివిజనులు పంచాయతీ ఆఫీసరును, తాలూకా స్థాయిలో (బ్లాకు ప్రాంతాలను మినహాయించి) డిప్యూటి పంచాయతి ఆఫీసరును, బ్లాకు స్థాయిలో పంచాయతీలకు ఎక్స్టెన్షన్ ఆఫీసర్లను నియమించటం ద్వారాను, జిల్లా పంచాయతీ ఆఫీసర్ల కార్యాలయాలను పటిష్ఠం చేయటం ద్వారాను 1958—59 సంవత్సరంలో పంచాయతీల నిర్వహణకు సంబంధించిన పరిపాలనా యంత్రాంగం పునర్వ్యవస్థీకరించబడింది. 1959—60 లో ఈ పథకం క్రింద రు. 8.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.120 లక్ష మొత్తం ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషను కార్యాలయంలో నియమించబడిన సిబ్బందిని కొనసాగించేటందుకు, రు. 0 191 లక్ష మొత్తం పశ్చిమ, తూర్పు ఇన్స్పెక్టింగ్ ఆఫీసర్ల కార్యాలయాల్లో నియమించబడిన అదనపు సిబ్బందిని కొనసాగించేటందుకుగాను ప్రత్యేకించబడింది. అధికవ్యయం అయ్యే జిల్లాలకు పంపకంచేసే నిమిత్తం రు. 0.524 లక్ష మొత్తం ఇన్స్పెక్టర్ జనరలు ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషన్ ఆధీనంలో ఉంచబడింది. మిగిలిన రు. 7.165 లక్షల మొత్తంలో రు. 0.2895 లక్ష 1958—59 లో ఈ జిల్లాలో నియమించబడిన అదనపు సిబ్బంది కొనసాగింపు నిమిత్తం ప్రత్యేకించబడింది.

## శిక్షణకు సంబంధించిన పథకం

ఈ పథకం క్రింద సామర్లకోట, రాజేంద్ర నగరులలోని "ఎక్స్టెన్షన్" శిక్షణ కేంద్రాలలో పంచాయతీలకుగాను నియమించబడిన డిప్యూటీ పంచాయతి ఆఫీసర్లకు, ఎక్స్టెన్షన్ ఆఫీసర్లకు, డివిజనల్ పంచాయతి ఆఫీసర్లకు పరిపాలన నిర్వహణ విషయాలలో శిక్షణ ఇచ్చేటందుకు ప్రతిపాదింపబడింది. ఈ శిక్షణ రెండు మాసాలపాటు ఇవ్వబడుతుంది. దఫవకు 40 మంది ఆఫీసర్లకు శిక్షణ ఇవ్వబడుతుంది. మొత్తం 390 మంది పై వర్గాలకు చెందినట్టి ఆఫీసర్లకు 1959—60 లో శిక్షణ ఇవ్వబడుతుంది. ఇందుకు గాను ప్రణాళికలో రు. 2.90 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలోని ఆఫీసర్లకు కూడ ఈ పథకం క్రింద శిక్షణ ఇవ్వబడుతుంది.

## పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనులు

పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనుల నిర్వహణకోసం ఈ జిల్లాకు రు. 6.50 లక్షల మొత్తం 1959—60 సంవత్సరానికి కేటాయించ బడింది. వివరాలు క్రింద ఇవ్వబడినాయి.

| వరుస సంఖ్య | ప్రాజెక్టు పేరు | 1959—60 లో కేటాయింపు (రూపాయలు లక్షలలో) | ఉద్దేశ్యం | నీటిపారుదల జరిగే విస్తీర్ణం (ఎకరాలలో) |
|---|---|---|---|---|
| 1. | జట్పల్లి ప్రాజెక్టు | 3.00 | పని ప్రారంభించుటకు | — |
| 2. | లక్నపూరు ప్రాజెక్టు | 3.00 | ,, | — |
| 3. | చినమూసి ప్రాజెక్టు | 0.50 | ,, | — |

## విద్యుచ్ఛక్తి

### తెలంగాణా హైడ్రోథర్మల్ పథకం

(1) రామగుండం థర్మల్ పథకము క్రింద పనులు, (2) నిజాంసాగరు జల విద్యుచ్ఛక్తి పథకము క్రింద పనులు, (3) సిటీ సర్కిల్ పునర్వ్యవస్థీకరణ—ఇవన్నీ ఈ సమగ్ర పథకము క్రిందకు తేబడినాయి. తెలంగాణాకు సమగ్రమైన "గ్రిడ్" నొకదాన్ని ఏర్పాటు చేయటంకోసం అవసరమైన అదనపు ట్రాన్సుమిషను లైన్లను వేయటం, సబ్—స్టేషనులను నిర్మించటం కూడ ఈ పథకం క్రింద జరుగుతుంది. ఈ ప్రాంతంలో ఉన్న అన్ని జల విద్యుచ్ఛక్తి కేంద్రాలను కలిపి విద్యుచ్ఛక్తి వనరులను అభివృద్ధి చేయటమే ఈ పథకం యొక్క ఉద్దేశ్యం. హైదరాబాదు, సికిందరాబాదు నగరాల్లో రోజురోజుకు ఎక్కువవుతున్న విద్యుచ్ఛక్తి అవసరాలను తీర్చటం కోసం విద్యుచ్ఛక్తి సరఫరా ఏర్పాట్లను అభివృద్ధిచేయటం కూడ ఈ పథకం క్రింద ఉద్దేశించబడింది. ప్రణాళికలో 1959—60 సంవత్సరానికి ఈ పథకం క్రింద రు. 100.59 లక్షల మొత్తం కేటాయించబడింది. అది క్రింది పనులకు గాను వినియోగించబడుతుంది.

1. ఎల్లుగడ్డ — విజయవాడ 132 కె. వి. లైను.
2. కరీంనగరు — సిద్దిపేట 66 కె. వి. లైను. (రెండవ సర్క్యూటు.)
3. దాదాపు 200 మైళ్ళ 33 కె. వి. గ్రిడ్ సబ్—ట్రాన్సుమిషను లైన్లు.
4. దాదాపు 500 మైళ్ళ 11 కె. వి. ట్రాన్సు మిషను లైన్లు.
5. హుసేనుసాగరు విద్యుచ్ఛక్తి కేంద్రంలో అదనపు బాయిలరును ఏర్పాటు చేయటంకోసం సివిల్ పనులను ప్రారంభించుటకు.
6. నగర విద్యుచ్ఛక్తి సరఫరాకు అభివృద్ధి పనులు

కేటాయించబడిన రు. 100.59 లక్షలలో ఈ జిల్లా వాటా రు. 29.13 లక్షలు.

## గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

1959—60 లో రు. 75.54 లక్షల వ్యయంతో తెలంగాణా ప్రాంతంలో 100 పట్టణాలకు, గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయుటకు ప్రతిపాదింపబడింది. ఇందులో రు. 3.78 లక్షల మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ మొత్తంతో 5 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయడం జరుగుతుంది.

## గ్రామీణ పరిశ్రమలు, చిన్న తరహా పరిశ్రమలు

### చిన్నతరహా పరిశ్రమలు

### విద్యుచ్ఛక్తితో నడుపబడే యంత్రాల నిర్వాహణలో పనివారికి శిక్షణ

విద్యుచ్ఛక్తితో నడుపబడే యంత్రములను ఉపయోగించటంలోను, నడపటంలోను పనివారికి శిక్షణ ఇచ్చేటందుకై హైదరాబాదులో ఉన్న గ్రామీణ పరిశ్రమల శిక్షణ కేంద్ర ఆవరణలో ఒక శిక్షణ కేంద్రం ఏర్పాటు చేయబడింది. 16 రకాల వృత్తులలో ఏటా 64 మందికి శిక్షణ ఇవ్వటానికి ఈ పథకం రూపొందించబడింది. ప్రతి అభ్యర్థికీ నెలకు రు. 25/— లు స్టయిపండు ఇవ్వబడుతుంది. శిక్షణ ఇవ్వబడే వృత్తుల సంఖ్యను 80కి తగ్గించటం ద్వారా ఇటీవల ఇది పునర్వ్యవస్థీకరించబడింది. మొదటి మూడు సంవత్సరాల్లోను 105 మంది అభ్యర్థులకు ఈ కేంద్రంలో శిక్షణ ఇవ్వబడింది.

ఈ సంవత్సరంలో కూడ ఈ కేంద్రం కొనసాగించబడుతుంది. 64 మంది అభ్యర్థులకు శిక్షణ ఇవ్వటానికి ప్రతిపాదించబడింది. ఇందుకుగాను రు. 0.97 లక్ష కేటాయించబడింది. ఈ కేంద్రంలో ఉత్పత్తి చేయబడే వస్తువుల వల్ల రు. 40,000/– లు రాబడి ఉండగలదని ఆశించబడుతున్నది.

## వరంగల్లులో నమూనా తోళ్ళ పదును కర్మాగారం

తోళ్ళను పదును చేయటంలోను, మంచిరకం తోలును ఉత్పత్తి చేయటం లోను మేలురకం పరికరాలను వాడటంలోను ఏటా 10 మంది పనివారికి శిక్షణ ఇచ్చేటందుకు ఈ పథకం ఉద్దేశించబడింది. శిక్షణ పూర్తయిన తరువాత ఈ అభ్యర్థులకు శిక్షణ పొందిన పనివారు కొరతగా ఉన్నట్టి తోళ్ళను పదును చేసే ప్రైవేటు కర్మాగారాలలో ఉద్యోగం దొరుకుతుంది. శిక్షణను ఇవ్వటమే కాక ఈ కేంద్రంలో వ్యాపార పద్ధతులలో పదును పెట్టిన తోలు కూడ ఉత్పత్తిచేయబడుతుంది. వరంగల్లులో అద్దెకు తీసికొనబడిన తోళ్ళను పదును చేసే ప్రయివేటు కర్మాగారంలో ఈ పథకం 1956–57 లో అమలు జరుప బడింది. 1957–59లో ఇది కొనసాగించబడింది. అయితే ఇంతవరకు అభ్యర్థులకు శిక్షణ ఇచ్చే కార్యక్రమం అమలు జరుపబడలేదు.

వర్తమాన సంవత్సరంలో ఈ కేంద్రాన్ని హైదరాబాదుకు తరలించ డానికి, 10 మంది అభ్యర్థులకు శిక్షణ ఇవ్వడానికి, వారికొక్కరికి నెలకు రు. 30/–లు చొప్పున స్టయిఫండు ఇవ్వడానికి ప్రతిపాదించబడింది. యంత్రా లను కొనడానికి, తోళ్ళ పదునుచేసే కర్మాగారాన్ని నిర్వహించడానికి గాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.65 లక్షల మొత్తం కేటాయించ బడింది.

## హైద్రాబాదులో తోలు వస్తువుల తయారీ కేంద్రం

ఆధునిక పద్ధతులలో వివిధ రకములయిన తోలు వస్తువులను, పాద రక్షలను తయారు చేయడానికి, వాటిని తయారు చేయడంలో ఏటా 10 మంది పనివారికి శిక్షణ ఇవ్వడానికి ఈ పథకం ఉద్దేశించబడింది హైదరా బాదులోని ముషీరాబాదులో నెలకొల్పబడిన గ్రామీణ పరిశ్రమల శిక్షణ కేంద్రంలో ఒక యూనిట్టు ఇందుకోసం నెలకొల్పబడిఉంది. యంత్రసామగ్రి ఇంకా దిగుమతి కానందువల్ల 1958–59 లో శిక్షణ కోర్సు ప్రారంభించ

బడలేదు. వ్యాపార పద్ధతులలో రు. 76,000/—లు విలువ చేసే వస్తువులను తయారు చేయడం ఆరంభింపబడినది.

దిగుమతి చేసికోవలసిన యంత్రాలు, పరికరాల యొక్క ఖరీదు క్రింద, కేంద్రం నిర్వహణకు అయ్యే ఖర్చు క్రింద, 10 మంది అభ్యర్థులకు శిక్షణ ఇవ్వటానికి అయ్యే ఖర్చుక్రింద వర్తమాన సంవత్సరపు ప్రణాళికలో రు. 0.96 లక్ష మొత్తం కేటాయించబడింది. వర్తమాన సంవత్సరంలో ఈ కేంద్రం అనువైన భవనానికి తరలించబడుతుంది. ఈ కేంద్రం మూలంగా రు. 0.80 లక్ష మొత్తం రాబడిఉండగలదని ఆశించబడుతున్నది.

## *20 సహకార పరిశ్రమ కేంద్రాలను ఏర్పాటు చేయటం*

నిరుద్యోగ సమస్యను పరిష్కరించటానికి, నిత్యావసరాలకు పనికివచ్చే వస్తువులను తయారు చేయుటానికి గాను ఈ పథకం క్రింద 20 సహకార పరిశ్రమ కేంద్రాలు ఏర్పాటు చేయబడినాయి. ఇందులో 19 హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరాల్లోను, ఒకటి నల్లగొండ జిల్లాలోను ఏర్పాటు చేయబడినాయి. వేయిమందికి పైగా పనివారికి ఇందుమూలంగా లాభం చేకూరింది. నిర్వహణ ఖర్చు క్రింద గ్రాంటు ఇవ్వడం మూలంగా ఈ కేంద్రాలను యీ సంవత్సరంలో కొనసాగించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను రు. 0.48 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ కేంద్రాలు ఈ సంవత్సరంలో రు. 5 లక్షలు విలువచేసే వస్తువులను తయారుచేస్తాయని ఆశించబడుతున్నది.

## *హైదరాబాదులో సన్నరాగి తీగెల తయారి కేంద్రం*

ఇది పూర్తిగా వ్యాపార సరళిలో నిర్వహించబడే పథకం. ఈ పథకం క్రింద ఫ్రాక్షనల్ హార్సుపవరు మోటార్లు, రేడియో ట్రాన్స్‌ఫార్మర్లు, రిసీవర్లు మొదలగు వాటికి అవసరమయ్యే ఇన్సులేటెడ్ రాగి తీగెలను తయారు చేసే కేంద్రం ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. ఈ యూనిట్టులో సంవత్సరానికి 25,000 పౌన్ల రాగితీగెలు తయారు అవుతాయని ఆశించబడుతున్నది. ఈ కేంద్రం స్థాపించటం కోసం సనత్‌నగరులోని పారిశ్రామిక ఎస్టేటులో గత సంవత్సరం శాశ్వత భవనాలను నిర్మించటం ప్రారంభించబడింది.

నిర్మాణంలో ఉన్న భవనాలను పూర్తిచేయటానికి, యంత్రాలు, పరికరాలు కొనటానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 4.37 లక్షల మొత్తం కేటాయించబడింది.

### హైదరాబాదులో ఫ్రాక్షనల్ హార్సుపవరు మోటార్లను తయారు చేయటం

శాస్త్రీయ విజ్ఞాన పరికరాలకు, కర్మాగార యంత్రాలకు, రేడియో ట్రాన్సుఫార్మర్లకు అవసరమయ్యే ఫ్రాక్షనల్ హార్సుపవరు మోటార్లను తయారు చేసే కేంద్రం స్థాపన ఈ పథకం క్రింద ఉద్దేశించబడింది. సంవత్సరానికి 3,000 మోటార్లను, 5,000 రేడియో ట్రాన్సుఫార్మర్లు, ఛోక్కులను తయారుచేయటానికి ప్రతిపాదింపబడింది. ఈ యూనిట్టును స్థాపించటం కోసం నిరుడు సంవత్సరం సనత్‌నగరులోని పారిశ్రామిక ఎస్టేటులో శాశ్వత భవనాల నిర్మాణం ప్రారంభమైంది. భవనాల నిర్మాణం పూర్తిచేయటానికి, యంత్రాలు, పరికరాలు కొనుగోలుకు గాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.98 లక్షల మొత్తం కేటాయించబడింది.

### హైదరాబాదులో రేడియో విడిభాగాలు, రిసీవర్ల తయారీ

సెరామిక్ కెపాసిటర్లు, మైకా కెపాసిటర్లు, ఐ.ఎఫ్. ట్రాన్సుఫార్మర్లు, కాయిల్సు, ఛేసిస్సు వంటి రేడియో విడిభాగాలు, ఇతర లోహపరికరాలు, రిసీవర్లు తయారు చేయటానికి ఈ పథకం ఉద్దేశించబడింది. ఈ యూనిట్టు కోసం భవనాల నిర్మాణం సనత్‌నగరులోని పారిశ్రామిక ఎస్టేటులో 1958–59 లో ప్రారంభించబడింది. భవనాల నిర్మాణం పూర్తిచేయటానికి; ఈ కేంద్రం కోసం యంత్రాలు, పరికరాలు కొనటానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.54 లక్షల మొత్తం కేటాయించబడింది.

### పది సహకార పరిశ్రమ కేంద్రాలను ఏర్పాటు చేయటం

. సామాన్య సౌకర్యాలను పనివారందరికి అందుబాటులో ఉంచటం వల్ల వారు మేలురకం వస్తువులను పెద్ద ఎత్తున ఉత్పత్తి చేయటానికి వీలు చేకూరుతుంది. అట్టి సౌకర్యం కలిగించే నిమిత్తం తెలంగాణా ప్రాంతంలో పది సహకార పరిశ్రమ కేంద్రాలు 1957–58 లో ఏర్పాటు చేయబడినాయి. ఈ కేంద్రాలలో దాదాపు 200 మందికి పని కల్పించబడింది.

ఈ పథకం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.24 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.072 లక్ష మొత్తం ఈ జిల్లాలో ఏర్పాటు చేయబడిన 8 కేంద్రాల కొనసాగింపు నిమిత్తం ప్రత్యేకించబడింది.

### *పరిశ్రమలకు హైద్రాబాదు రాజ్య ప్రభుత్వ సహాయ చట్టంక్రింద ఋణాలు*

చిన్నతరహా పరిశ్రమలను అభివృద్ధిచేసేటందుకు గాను ప్రయివేటు రంగంలోని పారిశ్రామికులకు ప్రభుత్వ సహాయ చట్టం (స్టేటు ఎయిడ్ టు ఇండస్ట్రీస్ చట్టం) క్రింద ఋణాలు ఇవ్వటంకోసం రెండవ ప్రణాళికలో రు. 37.40 లక్షల మొత్తం కేటాయించబడింది. మొదటి మూడు సంవత్సరాల్లోను రు. 20.78 లక్షల మొత్తం ఋణాలుగా పంపకం చేయబడింది. ఈ సంవత్సరంలో రు. 7.00 లక్షలు ఈ పథకం క్రింద ఋణాలుగా ఇవ్వటం జరుగుతుంది. ఈ పథకంవల్ల ఈ జిల్లాలోని పారిశ్రామికులకు కూడ లాభం చేకూరుతుంది

### *పరిశ్రమల శాఖ డైరెక్టరు కార్యాలయాన్ని పటిష్ఠం చేయటం (జిల్లాల సిబ్బందికి మాత్రం చేయబడిన కేటాయింపు)*

రెండవ పంచవర్ష ప్రణాళికలో పేర్కొనబడిన వివిధ పథకాలను జిల్లా స్థాయిలో సక్రమంగాను, సమర్థవంతంగాను అమలుజరిపేటందుకుగాను పరిశ్రమల శాఖను పటిష్ఠంచేసే ఉద్దేశంతో తెలంగాణా ప్రాంతం కోసం రెండవ ప్రణాళికలో రు. 6 10 లక్షల మొత్తం కేటాయించబడింది. 1957—58, 1958—59 లలో కొంత అదనపు సిబ్బంది జిల్లాలలో నియమించబడింది. ఈ సిబ్బందిని కొనసాగించేటందుకు, మరి కొంత అదనపు సిబ్బందిని నియమించేటందుకు గాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.25 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో కొంత డబ్బు ఈ జిల్లాలో వినియోగించబడుతుంది.

### *పరిశ్రమల శాఖ అసిస్టెంటు డైరెక్టర్లకు జీపుల సరఫరా*

వివిధ పథకాలను సమర్థవంతగా అమలు జరిపేటందుకు వీలు కల్పించే నిమిత్తం తెలంగాణా ప్రాంతంలోని తొమ్మిది జిల్లాలలోను పనిచేస్తున్న పరిశ్రమల శాఖ అసిస్టెంటు డైరక్టర్లు తొమ్మిది మందికి 1958—59 లో జీపులు

సరఫరా చేయబడినాయి. ఈ జీపుల నిర్వహణ కోసం యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.30 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో ఒక జీపు ఈ జిల్లాలో ఉపయోగించబడుతున్నది.

## బ్లాకు ప్రాంతములలో నియమించబడిన పరిశ్రమల విస్తరణాధికార్ల జీతాలు

బ్లాకు ప్రాంతాలలో నియమించబడిన పరిశ్రమల విస్తరణాధికార్ల జీతాల క్రింద 1959—60 ప్రణాళికలో రు. 3.06 లక్షల మొత్తం కేటాయించ బడింది.

## హైదరాబాదులో రంపపు మిల్లు; కొయ్యా సామాను తయారీ; కలప సీజనింగు ప్లాంటు స్థాపన

హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరాల్లో మేలురకం కుర్చీలు, బల్లలు మొదలగు కొయ్యా సామానుకు, ఇతర కొయ్యా సామగ్రికి మంచి గిరాకి ఉంది. ఈ పథకం క్రింద పై కొయ్యా సామానులను తయారు చేసే టందుకుగాను ఆధునికయంత్రాలతో కొయ్యా సామాగ్రి కర్మాగారాన్నొక దాన్ని సీజనింగు ప్లాంటుతో సహా స్థాపించటానికి ఉద్దేశించబడింది. హైదరా బాదులోని సనత్‌నగరు పారిశ్రామిక ఎస్టేటులో ఈ యూనిట్టు నెలకొల్ప బడుతుంది. యంత్రాల కొనుగోలుకు, భవనాల నిర్మాణానికి గాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 4.19 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ పథకం క్రింద పదిమంది పనివారికి శిక్షణ ఇవ్వటానికి కూడ ప్రతిపాదింపబడింది. నెలకు రు. 30/— లు చొప్పున శిక్షణ పొందే ప్రతి ఒక్కరికి స్టయిఫండు ఇవ్వబడుతుంది.

## హైదరాబాదులో "సెరామిక్ సర్వీసు" కేంద్రం స్థాపన

హైదరాబాదు, సికిందరాబాదు జంట నగరాల్లో నిరుద్యోగ సమస్య పరిష్కారం కోసం ఈ పథకం తలపెట్టబడింది. ఈ పథకం క్రింద ఆధునిక పద్ధతుల్లో వివిధరకములైన మృణ్మయ సామగ్రిని తయారుచేసే "సెరామిక్ సర్వీసు" కేంద్రాన్ని ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. ఈ పథకం క్రింద పనివారందరికి ఉమ్మడిగా తమ పనికి వలసిన సౌకర్యాలు కూడ

ఏర్పాటు చేయబడతాయి. అవసరమైన పరికరాలను కొనడానికి, భవనాలు, కొలిమి నిర్మించడానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.45 లక్షల మొత్తం కేటాయించబడింది.

## హైదరాబాదులోని సనత్ నగరులో ముడిపదార్థాల సరఫరా కేంద్రం ఏర్పాటు

జంటనగరాల్లో ఉన్న చిన్నతరహా పారిశ్రామికులకు, అందులోను ముఖ్యంగా సనత్ నగరు పారిశ్రామిక ఎస్టేటులో పరిశ్రమలను నెలకొల్పుకొనిన పారిశ్రామికులకు అవసరమయ్యే ముడిపదార్థాలను సరఫరా చేసేటందుకు గాను ముడిపదార్థాల సరఫరా కేంద్రాన్నొకదానిని సనత్‌నగరు పారిశ్రామిక ఎస్టేటులో ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. చిన్నతరహా పారిశ్రామికుల కందరికీ ఈ కేంద్రం ముడిపదార్థాలను అసలు ధరకు సరఫరా చేస్తుంది.

భవనాలు నిర్మించటానికి, లారీలు మొదలగు వాటిని కొనటానికి, కేంద్రం నిర్వహణకు గాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.19 లక్షల మొత్తం కేటాయించబడింది.

## పారిశ్రామిక ఎస్టేట్లు

### సనత్ నగరులో పారిశ్రామిక ఎస్టేటు

హైదరాబాదులోని సనత్ నగరులో పారిశ్రామిక ఎస్టేటు స్థాపన కోసం రెండవ ప్రణాళికలో రు. 38.86 లక్షల మొత్తం కేటాయించబడింది. వివిధరకాలైన 30 ఫ్యాక్టరీ భవనాలను నిర్మించటం కోసం సనత్ నగరులో 49.25 ఎకరాల విస్తీర్ణంగల భూమి 1957-58 లో స్వాధీనపరచుకొనబడింది. ఇందులో 17 భవనాల నిర్మాణం పూర్తి అయింది. మిగిలిన 13 భవనాల నిర్మాణం చేకొనబడింది. 1959 మార్చి అంతంనాటికి ఈ పథకం క్రింద రు. 23.85 లక్షల మొత్తం ఖర్చు పెట్టబడింది. మిగత ఫ్యాక్టరీ భవనాల నిర్మాణం పూర్తి చేయటం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.50 లక్షల మొత్తం కేటాయించబడింది. 1959-60 లో రు. 11.50 లక్షల వ్యయంతో యీ ఎస్టేటును విస్తృతం చేయటానికి ప్రతిపాదింపబడింది. అదనంగా అవసరం అయ్యే ధనం భవన నిర్మాణ కార్యక్రమంలో మార్పు చేయడం ద్వారా సమకూర్చబడుతుంది.

## హస్తకళలు

### సికింద్రాబాదులో దంతము, కొమ్ము పరిశ్రమ

కళాత్మకమైన దంతపు వస్తువులను, కొమ్ము వస్తువులను తయారు చేయటానికి, ఈ పనిలో ఏటా 8 మంది పనివారికి శిక్షణ ఇవ్వటానికిగాను ఈ పథకం 1956–57 లో అసలు జరుపబడింది. "శ్రీ ఐవరీ అండ్ హారన్ ఇండస్ట్రియల్ కోఆపరేటివ్ సొసైటీ" అను పేరిట ఒక పారిశ్రామిక సహకార సంఘం సికింద్రాబాదులో ఏర్పాటు చేయబడింది. మొదటి మూడు సంవత్సరాల కాలంలోను రు. 0.47 లక్ష మొత్తం వరకు ఆర్థిక సహాయం ఈ సంఘానికి ఇవ్వబడింది. ఈ సంవత్సరంలో ఈ సంఘానికి ఇంకా రు. 0.11 లక్ష వరకు ఆర్థిక సహాయం చేయబడుతుంది. 8 మంది అభ్యర్థులకు శిక్షణ ఇవ్వబడుతుంది.

### హైదరాబాదులో ఉన్న ప్రభుత్వ కుటీర పరిశ్రమల విక్రయశాలల విస్తరణ

హైదరాబాదులో ఉన్న ప్రభుత్వ కుటీర పరిశ్రమల విక్రయశాలలో అమ్మకాలు ఎక్కువ య్యేటట్లు చేయటంకోసం దానిని విస్తరింపచేయటానికి తలపెట్టబడింది. ఇందుకుగాను రెండవ ప్రణాళికలో రు. 3.08 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇంతవరకు రు. 2 22 లక్షల మొత్తం ఖర్చు పెట్టబడింది. ఈ పథకం కోసం 1959–60 ప్రణాళికలో రు. 0.39 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ సంవత్సరంలో అమ్మకాలు రు. 6.50 లక్షల వరకు పెరగ గలవని ఆశించబడుతున్నది.

### హస్తకళల విభాగానికి సిబ్బంది

పరిశ్రమల శాఖ డైరెక్టరేటులోని "హస్తకళలు—మార్కెటింగు" విభాగంలో అదనంగా సిబ్బందిని నియమించే ఉద్దేశంతో ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.36 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ పథకం క్రింద రెండవ ప్రణాళికలో కేటాయించబడిన మొత్తం రు. 0.92 లక్ష.

### హైదరాబాదులోని హిమ్రూ పనివారికి, బిద్రి పనివారికి సమిష్టి సౌకర్యాలుగల కేంద్రాలను స్థాపించటం

ఈ పథకం క్రింద గ్రామీణ ప్రాంతాల్లో బిద్రీ, హిమ్రూ పనివారికి గాను నివాస గృహాలు ఏర్పాటు చెయ్యటానికి, సమిష్టి ఉత్పత్తి కార్య

క్రమాన్ని రూపొందించడానికి ప్రతిపాదింపబడింది. సమిష్టి సౌకర్యాలుగల కేంద్రాలు ఏర్పాటు చేయటంకోసం ఈ సంవత్సరంలో రు. 0.16 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.08 లక్ష హిమ్రూ పనివారికి, రు. 0.08లక్ష బిద్రి పనివారికి గాను వినియోగించబడుతుంది. ఈ పథకంవల్ల సుమారు 25 మంది బిద్రిపనివారికి, 25 మంది హిమ్రూ పనివారికి లాభం చేకూరుతుంది. ఈ సంవత్సరంలో రు. 0.80 లక్ష విలువచేసే వస్తువులు బిద్రీ, హిమ్రూ పనివారిచేత ఉత్పత్తి చేయబడతాయని ఆశించబడుతున్నది.

## క్రొత్త పథకాలు

ఈ సంవత్సరంలో క్రింది క్రొత్త పథకాలు రాజ్యస్థాయిలో హస్త కళల విభాగం క్రింద అమలు పరచబడతాయి. ఇందువల్ల తెలంగాణాలోని అన్ని జిల్లాలకు లాభం చేకూరుతుంది.

| పథకం పేరు | 1959—60లో కేటాయింపు (లక్షల రూపాయలలో) |
|---|---|
| సహకార సంఘాల క్రిందకు తీసుక రావటానికి వీలు లేకుండా ఉన్న పనివారికి గ్రాంట్లు, ఋణాలు ఇవ్వటానికి. | 0.10 |
| సంచార ప్రచార వ్యానుకు, దానికి కావలసిన సిబ్బందికి. | 0.20 |
| వస్తువుల నాణ్యతను ధృవీకరించటం | 0.10 |

ఈ క్రింది క్రొత్త పథకాలు కూడ ఈ సంవత్సరంలో ఈ జిల్లాలో అమలు పరచబడతాయి.

| పథకం పేరు | కేటాయింపు (రూపాయలు లక్షలలో) |
|---|---|
| (1) ఖైరతాబాదులో నిర్మల్ పరిశ్రమ అభివృద్ధికి. | 0.61 |
| (2) సికిందరాబాదులో దంతం, కొమ్ముపనివారికి సమిష్టి ఉత్పత్తి సౌకర్యాల కేంద్రం ఏర్పాటుకు | 0.15 |
| (3) బ్లాకు ప్రింటింగు పరిశ్రమ అభివృద్ధికి. | 0.14 |

# చేనేత పరిశ్రమ

## చేనేత పారిశ్రామిక సంఘాలకు వాటా మూలధనం, నిర్వాహణ మూల ధనం క్రింద ఋణాలు

చేనేత పారిశ్రామిక సంఘాలలో వాటాలు తీసికొని, వాటిలో సభ్యులుగా చేరటానికి వీలుగా నేతపనివారికి ఈ పథకం క్రింద ఋణాలు ఇవ్వబడతాయి. ఈ సంవత్సరపు తెలంగాణా ప్రణాళికలో ఈ పథకం క్రింద రు. 0.87 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.08 లక్ష వాటా మూలధనంగా ఋణాల రూపంలో పంపకానికి గాను ఈ జిల్లాకు కేటాయించబడింది. ఈ జిల్లాలో ఈ సంవత్సరంలో దాదాపు 400 క్రొత్త మగ్గాలు సహకార వ్యవస్థలోకి తీసుకురాబడతాయని ఆశించబడుతున్నది.

## కేంద్ర సంఘం యొక్క మార్కెటింగు వ్యావస్థ విస్తరణ

నేత బట్టలను విరివిగా విక్రయించేటందుకు హైదరాబాదు చేనేత కార్మిక కేంద్ర సహకార సంఘం వారు, ప్రాథమిక చేనేత కార్మిక సంఘాల వారు జిల్లాల్లో అమ్మకం డిపోలను ఏర్పాటు చేస్తున్నారు. ప్రతి డిపోకు రు. 1,500/—లు విలువచేసే కుర్చీలు, బల్లలు మొదలైన సామాగ్రిను సరఫరా చేయబడుతున్నది. రెండవ ప్రణాళిక మొదటి మూడు సంవత్సరాల్లో 53 డిపోలు తెరువబడినాయి. ఈ సంవత్సరంలో ఇంకా 12 డిపోలు తెరవడానికి, చేనేత బట్టలను గురించి తీవ్ర ప్రచారం జరిపించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 1.54 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.30 లక్ష మొత్తం ఈ జిల్లాలో రెండు డిపోలను తెరవటానికి ప్రత్యేకించబడింది.

## సాంకేతిక అభివృద్ధి, మేలురకం పరికరాలు

చేనేత పరిశ్రమలో సాంకేతిక నైపుణ్యాన్ని అభివృద్ధిచేసే ఉద్దేశంతో ఈ పథకం క్రింద చేనేత కార్మికులకు మేలురకం పరికరాలు సరఫరా చేయబడతాయి. ఇందుకుగాను ఈ సంవత్సరంలో రు. 1.91 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.20 లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ మొత్తంతో 39 ప్రామాణికమైన రీడ్లు, 6 వార్పింగు యంత్రాలు, 33 స్లేలు, 2 ప్రెస్ యంత్రాలు సరఫరా చేయబడతాయి.

## అద్దకం కార్ఖానాల ఏర్పాటు

ఆంధ్రప్రాంతంలో ప్రస్తుతం ఉన్న 3 అద్దకం యూనిట్లలో ఒకదాన్ని హైదరాబాదుకు తరలించడం ద్వారా ఆధునిక అద్దకం కేంద్రం ఒకటి హైదరాబాదులో స్థాపించబడుతుంది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.05 లక్ష మొత్తం కేటాయించబడింది.

## ముదరా

చేనేత గుడ్డ అమ్మకాన్ని ప్రోత్సహించటం ద్వారా దాని ఉత్పత్తిని అధికం చేసే ఉద్దేశంతో చేనేత గుడ్డ అమ్మకంపై ముదరా ఇవ్వబడుతున్నది. సాధారణంగా రూపాయకు 6 నయాపైసల చొప్పున ముదరా ఇవ్వబడుతుంది. అయితే సంఘాల్లో సరకు నిలువ ఉండిపోయినపుడు మాత్రం దాన్ని అమ్మివేయటంకోసం అప్పుడప్పుడు అదనపు ముదరా కూడ ఇవ్వటానికి అనుమతించబడుతున్నది. ఈ పథకం క్రింద వర్తమాన సంవత్సరపు ప్రణాళికలో రు. 35.00 లక్షల మొత్తం కేటాయించబడింది ఇందులో రు. 2.50 లక్షల మొత్తం ఈ జిల్లాలో ముదరా ఇవ్వటంకోసం ప్రత్యేకించబడింది.

## ఉన్ని పరిశ్రమ (కంబళ్ళ పరిశ్రమ)

తెలంగాణా ప్రాంతంలో ఉన్ని పరిశ్రమ అభివృద్ధికోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.58 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.71 లక్షల మొత్తం క్రింది పనుల నిమిత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది.

(ఎ) 50 క్రొత్త మగ్గాలను చేర్చుకొనుటకు.

(బి) ఉన్ని నేతపనివారికి క్రింది మేలురకం పరికరాలను సరఫరా చేయుటకు.

| | | |
|---|---|---|
| (i) ఫ్లయిషటిల్ మగ్గాలు | ... | 20 |
| (ii) హీల్డులు | ... | 20,000 |
| (iii) రీడ్లు | ... | 80 |
| (iv) ఉన్ని కార్డింగు యంత్రాలు | ... | 1 |

(సి) నైపుణ్యా స్థాయిని నియంత్రణ చేయటంకోసం ఇద్దరు టెక్నికల్ అసిస్టెంట్ల నియామకానికి.

(డి) ఒక కేంద్ర అమ్మకం డిపో తెరవటానికి.

## నేత పనివారికి గృహవసతి

తెలంగాణాలోని నేతపనివారి గృహవసతి సౌకర్యాలను అభివృద్ధి చేసే నిమిత్తం 1959—60 ప్రణాళికలో రు. 2.11 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.47 లక్ష మొత్తం హైదరాబాదు జిల్లాకు కేటాయించబడింది. ఈ డబ్బుతో 100 ఇళ్ళు సికిందరాబాదులో నిర్మించబడతాయి

## పట్టు పరిశ్రమ అభివృద్ధి

హైదరాబాదులో పట్టు అద్దకం కేంద్రాన్నొకదాన్ని ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు కావలసిన డబ్బు మహబూనగరు జిల్లాకు చేయబడిన కేటాయింపునుండి వినియోగించబడుతుంది.

# రోడ్లు

## తెలంగాణా-బకాయిపనులు

తెలంగాణాలో ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలో పూర్తి చేయబడకుండా మిగిలిన బకాయ రోడ్డు పనులను కొనసాగించే నిమిత్తం 1959—60 ప్రణాళికలో రు. 3.09 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.001 లక్ష మొత్తం క్రింది పనుల నిమిత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | 1959-60 లో చేయబడిన కేటాయింపు (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | అఫ్జల్ గంజ్ వంతెన కిరువైపులనున్న కాలిబాటల విస్తరణకు | 0 001 |

## క్రొత్తరోడ్డు పనులు

తెలంగాణా ప్రాంతంలో క్రొత్త రోడ్డుపనుల నిర్వహణ నిమిత్తం 1959–60 లో ఈ పథకం క్రింద రు. 37.69 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.50 లక్ష ఈ జిల్లాకు క్రింది పనుల నిమిత్తం ప్రత్యేకించబడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | 1959–60లో కేటాయింపు (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | చేబాలనుండి శంకరపల్లికి రోడ్డు నిర్మాణం | 0.30 |
| 2. | షామీరుపేట నుండి మేడ్చల్‌కు రోడ్డు నిర్మాణం | 0.20 |

## దుమ్మురేగని రోడ్ల నిర్మాణం

తెలంగాణా ప్రాంతంలో దుమ్మురేగని రోడ్డుపనుల నిర్వహణ నిమిత్తం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 20.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు 8.20 లక్షల మొత్తం క్రింది పనుల నిమిత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

| వరుస సంఖ్య | పనివివరం | 1959–60లో కేటాయింపు (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | హైదరాబాదు–మల్లేపల్లి రోడ్డు (భాగం) | 4.50 |
| 2. | హైదరాబాదు–హనుమకొండ రోడ్డు. | 1.90 |
| 3. | హైదరాబారు-మెదక్-నరసాపూరు రోడ్డు | 0.40 |
| 4. | హైదరాబాదు–చాందా రోడ్డు మై. 13/1 నుండి 26/5 | 1.40 |

## ప్రజలలో పర్యటనాభిలాషను పెంపొందించడం

ప్రజలలో ఎక్కువగా పర్యటనలు జరిపే అలవాటును పెంపొందించే నిమిత్తం తెలంగాణా ప్రాంతానికి 1959-60 ప్రణాళికలో రు. 2.04 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.26 లక్ష మొత్తం క్రింది పథకానికిగాను ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

| వరుస సంఖ్య | పనివివరం | 1959-60 లో కేటాయింపు (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | ఉస్మాన్‌సాగరు వద్ద లోఇన్‌కంగ్రూపు రెస్టుహౌస్ (విశ్రాంతి గృహం) నిర్మాణం. | 0.26 |

## విద్య

### ప్రాథమిక విద్య

ఈ జిల్లాలో ప్రాథమిక విద్య పద్దు క్రింద రు. 13.71 లక్షల మొత్తం క్రింది పథకముల నిమిత్తం ఖర్చు పెట్టడానికి ప్రతిపాదింపబడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (లక్షలు రూపాయలలో) |
|---|---|---|
| 1. | ఈ క్రింద తెలుపబడిన సంవత్సరాలలో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలకొరకు నియమించబడిన అదనపు ఉపాధ్యాయులకొరకు. | |
| | (ఎ) 1956-57 లో (34 పాఠశాలలు) | 0 38 |
| | (బి) 1957-58 లో (96 పాఠశాలలు) | 0 53 |
| | (సి) 1958-59 లో (72 పాఠశాలలు) | 0.35 |
| 2. | ఈ క్రింది సంవత్సరాలలో ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలుగా మార్చబడిన వాలంటరీ ఎయిడెడ్ పాఠశాలలకు. | |

| | | |
|---|---|---|
| | (ఎ) 1956–57 లో (6 పాఠశాలలు) | 0.03 |
| | (బి) 1957–58 లో (24 పాఠశాలలు) | 0.03 |
| | (సి) 1958–59 లో (8 పాఠశాలలు) | 0.03 |
| 3. | ఈ క్రింది సంవత్సరాలలో జూనియర్ బేసిక్ పాఠశాలలుగా మార్చబడిన ప్రాథమిక పాఠశాలలు. | |
| | (ఎ) 1956–57 లో (18 పాఠశాలలు) | 0.03 |
| | (బి) 1957–58 లో (14 పాఠశాలలు) | 0.05 |
| | (సి) 1958–59 లో (17 శాఠశాలలు) | 0.03 |
| 4. | ఎయిడెడ్ బేసిక్ శిక్షణ పాఠశాలలకు గ్రాంట్లు. | 0.13 |
| 5. | ప్రాథమిక పాఠశాలలకు కుర్చీలు, బల్లలు మొదలగు కొయ్యసామాను, పరికరాలు. | 0.02 |
| 6. | ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాలలు, హాస్టళ్ళకు భవనాలు. | 0.80 |
| 7. | ప్రాథమిక పాఠశాలలో విజ్ఞాన శాస్త్ర బోధనకు (భారత ప్రభుత్వం వారి పైలట్ పథకం) | 0.05 |
| 8. | ఈ క్రింది సంవత్సరాలలో ప్రారంభించబడిన ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులకొరకు. | |
| | (ఎ) 1956–57 లో (10 పాఠశాలలు) | 0.08 |
| | (బి) 1957–58 లో (6 పాఠశాలలు) | 0.09 |
| | (సి) 1958–59 లో (2 పాఠశాలలు) | 0.60 |
| 9. | ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలలలో ఉపాధ్యాయుల జీతాల పెంపుదలకు. | 1.68 |
| 10. | 1957–58 లో డిప్యూటి ఇన్‌స్పెక్టర్ల కార్యాలయాల్లో నియమించబడిన అదనపు సిబ్బందికి. | 0.12 |
| 11. | (ఎ) 1957–58లో నియమించబడిన ఒక డిప్యూటీ ఇన్‌స్పెక్టరుకు. | 0.03 |
| | (బి) 1958–59 లో నియమించబడిన ఇద్దరు డిప్యూటీ ఇన్‌స్పెక్టర్లు. | 0.07 |

| | | |
|---|---|---|
| 12. | 1958–59 లో తెరవబడిన ఎయిడెడ్ మాధ్యమిక పాఠశాలలకు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులకు. | 0.03 |
| 13. | మూడవ ఫారంవరకు ఉచిత విద్య గరపటానికి సంబంధించిన పథకంకొరకు డైరెక్టరేటులో నియమించబడిన గుమాస్తాలకు (అప్పరు డివిజను గుమాస్తా, లోయరు డివిజను గుమాస్తా) | 0.03 |
| 14. | జిల్లా విద్యా శాఖాధికారికి పర్సనల్ అసిస్టెంటు (1958–59 లో నియమించబడిన ఇద్దరికి) | 0.02 |
| 15. | జిల్లా విద్యా శాఖాధికారి జీపు నిర్వహణకు, డ్రయివరుకు | 0.07 |

## క్రొత్త పథకాలు

| | | |
|---|---|---|
| 16. | విద్యార్హతలు ఉన్న నిరుద్యోగులకు జీవనోపాధి కల్పించుటకు సంబంధించిన పథకం.<br>(ఎ) పాఠశాలలు–144 (బి) డిప్యూటి ఇన్‌స్పెక్టర్లు–5 | 3.00 |
| 17. | ఉపాధ్యాయుల శిక్షణ కోర్సుకు పంపబడిన ఉపాధ్యాయుల స్థానంలో ఇతరులను నియమించుటకు | 1.15 |
| 18. | 23 ప్రాథమిక పాఠశాలలను జూనియరు బేసికు పాఠశాలలుగా మార్చుటకు. | 0.13 |
| 19. | ప్రాథమిక పాఠశాలలలో అదనంగా 30 మంది ఉపాధ్యాయులను నియమించుటకు. | 0.21 |
| 20. | ప్రాథమిక పాఠశాలలకు కుర్చీలు, బల్లలు మొదలగు కొయ్యసామానుకు. | 0.05 |
| 21. | స్త్రీ విద్యకు సంబంధించిన కేంద్ర పథకం.<br>(ఎ) ప్రత్యేక శిక్షణ పాఠశాల (1)<br>(బి) ప్రాథమిక స్థాయి శిక్షణ పాఠశాల (1) | 0.43 |
| 22. | తాలూకా కేంద్రాలలో ప్రభుత్వ బాలికల పాఠశాలలను మాధ్యమిక పాఠశాలలుగా మార్చుటకు (మూడు) | 0.08 |

| | | |
|---|---|---|
| 23. | ప్రయివేటుగా నిర్వహించబడుతున్న 15 లోయరు సెకండరీ పాఠశాలలను స్వాధీనపరచుకొనటానికి, అదనంగా 31 లోయరు సెకండరీ తరగతులను ప్రారంభించటానికి. | 0.51 |
| 24. | క్రొత్తగా ఒక ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాలను ఏర్పాటు చేయుటకు. | 0.28 |
| 25 | రెండు సెకండరీ గ్రేడు, రెండు ఎలిమెంటరీ గ్రేడు శిక్షణ విభాగాలను ప్రారంభించుటకు. | 1.04 |
| 26. | పట్టభద్రులయిన ఉపాధ్యాయులకు బేసిక్ విధానాలలో తిరిగి శిక్షణ ఇచ్చుటకు. | 0.04 |
| 27. | డిప్యూటి ఇనస్పెక్టర్ల కార్యాలయాల్లో 16 మంది అటెండర్లను నియమించుటకు. | 0.15 |
| 28. | "ప్రీ బేసిక్" ఉపాధ్యాయుల శిక్షణ పాఠశాలలను ప్రారంభించుటకు. | 0.30 |
| 29. | నాంపల్లిలోని ప్రభుత్వ బాలికల మాధ్యమిక పాఠశాల విస్తరణకు. | 0.28 |
| 30. | రామ్‌కోటిలోని మనోరంజితం మెమోరియల్ ఎయిడెడ్ మాడల్ పాఠశాలకు భవనాల నిర్మాణం. | 0.23 |
| 31. | సాయంత్రపు వేళలలో శిక్షణ తరగతులు నాలుగింటిని ఏర్పాటు చేయుటకు. | 0.10 |
| 32. | బేసిక్ విద్యకు సంబంధించి సమాలోచనములు ఏర్పాటు చేయుటకు | 0.05 |
| | మొత్తం | 13.71 |

## సెకండరీ విద్య

ఈ జిల్లాలో సెకండరీ విద్యాభివృద్ధి కోసం రు. 14.94 లక్షల మొత్తం కేటాయించబడింది. అది క్రింది విధంగా వినియోగించబడుతుంది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| | కొనసాగింపు పథకాలు | |
| 1. | ఈ క్రింది సంవత్సరాలలో ప్రారంభించబడిన ఎయిడెడ్ సెకండరీ పాఠశాలలకు, అదనపు తరగతులకు గ్రాంట్లు. | |
| | (ఎ) 1956—57 లో ప్రారంభించబడినవాటికి | 4.77 |
| | (బి) 1957-58 లో ప్రారంభించబడినవాటికి | 0.30 |
| | (సి) 1958—59 లో ప్రారంభించబడినవాటికి | 0.08 |
| 2. | ఈ క్రింది సంవత్సరాలలో ప్రారంభించబడిన ప్రభుత్వ సెకండరీ పాఠశాలలు, అదనపు తరగతులకు | |
| | (ఎ) 1956-58 లో ప్రారంభించబడిన రెండు సెక్షనులకు | 0.10 |
| | (బి) 1958—59 లో ప్రారంభించబడిన ఒక పాఠశాలకు | 0.10 |
| 3. | బహుళార్థసాధక పాఠశాలలలో కొన్ని కోర్సులను పునరుద్ధరించటానికి, జీతాలను సవరించటానికి | 0.06 |
| 4. | సెకండరీ పాఠశాలల ఉపాధ్యాయుల జీతాలను పెంచటానికి | 0.50 |
| 5. | హిందీ ప్రచారం (హిందీ ఉపాధ్యాయులను నియమించుటకు) | 0.16 |
| 6. | ప్రభుత్వ బహుళార్థసాధక పాఠశాలకు భవనాలు (ఒకటి) | 0.08 |
| 7. | 1958—59 లో ప్రారంభించబడిన ఇన్‌స్పెక్ట్రెసెస్ ఆఫ్ గర్ల్స్‌స్కూల్స్ కార్యాలయాలకు (2) | 0.42 |

| | | |
|---|---|---|
| 8. | "స్టేట్ ఎడ్యుకేషనల్ అండ్ ఒకేషనల్ గయిడెన్సు బ్యూరో" స్థాపించుటకు | 0.30 |
| 9. | ప్రభుత్వ పరీక్షల కమీషనరు కార్యాలయంలో అదనపు సెక్షనుల పర్పాటుకు (2) | 0.15 |

క్రొత్త పథకాలు

| | | |
|---|---|---|
| 10. | ప్రయివేటు ప్రాతిపదికపై నిర్వహించబడుతున్న సెకండరీ పాఠశాలలను స్వాధీనపరచుకొనటానికి, అదనపు తరగతులు ఏర్పాటు చేయటానికి | 0.61 |
| 11. | ఉన్నత పాఠశాలలను హైయ్యరు సెకండరీ పాఠశాలలు గాను, బహుళార్థసాధక పాఠశాలలగాను మార్చటానికి | |
| | (ఎ) ప్రభుత్వంవారివి ( 2 + 2 ) | 3.64 |
| | (బి) ఎయిడెడ్ వి ( 1 + 2 ) | 3.26 |
| 12. | కోర్ సబ్జక్టుల (మూలపాఠ్య విషయాలు) అభివృద్ధికి (5 పాఠశాలలు) | 0.60 |
| 13. | అదనపు తరగతి గదులు, ఆర్ట్ హాలు నిర్మాణానికి (ఒకటి) | 0.14 |
| 14. | ఎయిడెడ్ సెకండరీ పాఠశాలలకు పరికరాల క్రింద గ్రాంట్లు | 0.20 |
| 15. | బహుళార్థసాధక పాఠశాలలు, హైయ్యరు సెకండరీ పాఠశాలలలో ఫిజికల్ డైరెక్టర్ల (వ్యాయామ శిక్షకుల) నియామకం (2) | 0.09 |
| 16. | 3 ఎయిడెడ్ ఉన్నత పాఠశాలలకు బిల్డింగు గ్రాంట్లు | 1.51 |
| 17. | ప్రధానోపాధ్యాయుల సమాలోచనము | 0.10 |
| 18. | రాజధానిలో ప్రభుత్వ శిక్షణ కళాశాల ఏర్పాటుకు | 1.36 |

| | | |
|---|---|---|
| 19. | "స్టేట్ ఎడ్యుకేషనల్ అండ్ ఒకేషనల్ గయిడెన్సు బ్యూరో" అభివృద్ధికి | 0.43 |
| 20. | ఉస్మానియా శిక్షణ కళాశాలలో "ఎక్స్టెన్షన్ సర్వీసు" ఏర్పాటుకు | 0 06 |
| 21. | హైదరాబాదులోని "రెసిడెన్షియల్ స్కూలు"కు సహాయం | 0.25 |
| 22. | హిందీ పండితుల శిక్షణ కోర్సులు | 0.04 |
| 23. | హిందీ టీచర్లకు సెమినార్లు (సమాలోచనములు) | 0.02 |
| 24. | ఉస్మానియా శిక్షణ కళాశాలలో "పార్టు సర్టిఫికేటు పోస్టు గ్రాడ్యుయేటు కోర్సు" ఏర్పాటుకు | 0.05 |
| 25. | స్పెషల్ ఇనస్పెక్టర్సు, సలహాసిబ్బంది నియామకం | 0.33 |

## యూనివర్సిటీ విద్య

తెలంగాణా ప్రాంతంలో యూనివర్సిటీ (విశ్వవిద్యాలయ) విద్యాభివృద్ధికి గాను ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో రు. 29.62 లక్షల మొత్తం ఖర్చు పెట్టబడింది. ఈ సంవత్సరపు తెలంగాణా ప్రణాళికలో రు. 7.27 లక్షల మొత్తం ప్రత్యేకించబడింది. ఇందులో రు. 6.37 లక్షల మొత్తం క్రింద చూపిన విధంగా ఈ జిల్లాలో ఖర్చు పెట్టబడుతుంది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | మూడేళ్ళ డిగ్రీ కోర్సుకుగాను 4 ఎయిడెడ్ కళాశాలలకు గ్రాంట్లు. | 1.07 |
| 2. | మూడు ఎయిడెడ్ కళాశాలలకు పరికరాలకు గాను గ్రాంట్లు | 0.30 |
| 3. | ఉస్మానియా విశ్వవిద్యాలయానికి గ్రాంట్లు. | 5.00 |
| | మొత్తం | 6.37 |

## ఇతర పథకాలు

ఈ జిల్లాలో రు. 7.25 లక్షల మొత్తం క్రింద చూపబడిన విధంగా ఖర్చు పెట్టడానికి ప్రతిపాదింపబడింది.

### కొనసాగింపు పథకాలు

| | | |
|---|---|---|
| 1. | 1958—59లో నియమించబడిన జిల్లా సాంఘిక విద్యాధికారికి గాను. | 0 15 |
| 2. | సాంఘిక విద్యా సేవకుల శిక్షణకు. | 0.20 |
| 3. | విద్యాశాఖ డైరక్టరు కార్యాలయంలో సాంఘిక విద్యా విభాగాన్ని ఏర్పాటు చేయుటకు. (గ్రంథాలయాల నిర్వహణకు డిప్యూటి డైరెక్టరు నియామకం). | 0.14 |
| 4. | సెంట్రల్ ఫిల్మ్ లైబ్రరికి. | 0.10 |
| 5. | హైదరాబాదులోని కేంద్ర గ్రంథాలయానికి. | 1.15 |
| 6. | వ్యాయామ శిక్షణ పొందుతున్న టీచర్లకు అనవెన్సుల క్రింద. | 0.01 |
| 7. | ఎన్ సి.సి , ఎ.సి సి ల విస్తృతికి | 0.60 |
| 8. | ఫిజికల్ ఎడ్యుకేషన్ ఇనస్పెక్టరేటుకు. | 0.06 |
| 9. | ప్రభుత్వ వ్యాయామ శిక్షణ కళాశాలకు. | 0.60 |
| 10. | స్కౌటింగు మరియు గర్ల్ గైడింగుకు. | 0.07 |
| 11. | రియాయతి స్కాలరుషిప్పులకు | 0.20 |
| 12. | మలకపేటలో నున్న అంధ మూగ విద్యార్థుల పాఠశాల పునర్వ్యవస్థీకరణకు. | 1.10 |
| 13. | ప్రణాళికను సత్వరంగా అమలు పరచటం కోసం డిప్యూటీ డైరెక్టరు ఆఫ్ పబ్లిక్ ఇనస్ట్రక్షన్ (ప్లానింగు) పేరుతో ఒక స్పెషల్ ఆఫీసరును నియమించుటకు. | 0.10 |
| 14. | ప్లానింగు మరియు స్టాటిస్టికల్ యూనిటుకు. | 0.10 |
| 15. | హిందీ ప్రచారం కోసం ప్రత్యేక యూనిట్టు ఏర్పాటు. | 0.20 |

## క్రొత్త పథకాలు

| | | |
|---|---|---|
| 16. | గ్రంథాలయ శాస్త్ర విషయంలో లైబ్రేరియన్లకు శిక్షణ. | 0.14 |
| 17. | పిల్లల గ్రంథాలయానికి అభివృద్ధి పనులు. | 0.05 |
| 18. | దృక్ శ్రవణ విద్యా శిక్షణ కేంద్రానికి. | 0.20 |
| 19. | విద్యాశాఖ డైరెక్టరు కార్యాలయంలో ఉన్న గ్రంథాలయానికి అభివృద్ధి పనులు. | 0.02 |
| 20. | ఒక జిల్లా గ్రంథాలయము, 3 బ్రాంచి గ్రంథాలయాల ఏర్పాటుకు | 0.12 |
| 21. | రియాయతి స్కాలరుషిప్పులకు | 0.04 |
| 22. | సైనిక శిక్షణ కోర్సులకు పోటీ చేసే విద్యార్థులకు శిక్షణ ఇచ్చుటకు | 0.20 |
| 23. | అవిటి పిల్లల పాఠశాలలలో అంధ, బధిర శాఖలను విడతీసి ప్రత్యేక పాఠశాలలుగా ఏర్పాటు చేయుటకు. | 0.86 |
| 24. | హిందీ విద్యాలయాలకు గ్రాంట్లు | 0.05 |
| 25. | కళాశాల ఆడిటుశాఖకు | 0.04 |
| 26. | గృహశాస్త్ర శిక్షణ కళాశాలకు | 0.50 |
| 27. | యువక సంక్షేమ క్యాంపులకు | 0.02 |
| 28. | విద్యాశాఖ డైరెక్టరు కార్యాలయానికి జీపు సరఫరా, డ్రయివరు నియామకం. | 0.21 |
| 29. | హిందీవిద్యకు సంబంధించి సాహిత్యాన్ని తయారు చేయటానికి. | 0.02 |
| | | 7.25 |

## సాంకేతిక విద్య

### ప్రభుత్వ సాంకేతిక కళాశాల అభివృద్ధి

(ఇప్పుడు దీని పేరు ప్రభుత్వ పాలిటెక్నిక్, హైదరాబాదు అని మార్చబడింది)

హైదరాబాదులోని ప్రభుత్వ పాలిటెక్నిక్ అభివృద్ధికిగాను రెండవ ప్రణాళికలో రు. 10.25 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ సంస్థ

కొరకు అదనపు పరికరాలు సమకూర్చబడతాయి. శాశ్వత భవనాలు కూడ నిర్మించబడతాయి. పరికరాల కొనుగోలుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.74 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇంతేకాక భవనాల నిర్మాణం కోసం కేంద్ర ప్రతిపాదిత పథకాల క్రింద ఈ సంవత్సరంలో "మాచింగు కంట్రిబ్యూషన్"గా రు. 6.45 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 5.72 లక్షల మొత్తం కేంద్ర ప్రభుత్వము, రు. 0.73 లక్ష రాజ్య ప్రభుత్వము భరిస్తాయి.

### *ప్రభుత్వేతర సాంకేతిక విద్యాసంస్థలకు గ్రాంటు-ఇన్-ఎయిడ్ (ఆర్థిక సహాయం)—హైదరాబాదు, వనపర్తి పాలిటెక్నిక్‌లు*

వనపర్తి, హైదరాబాదు పాలిటెక్నిక్‌లకు గ్రాంట్లు ఇవ్వటం కోసం 1959–60 ప్రణాళికలో రు. 1.60 లక్షల మొత్తం కేటాయించబడింది.

### *సాంకేతిక విద్యాశాఖ డైరెక్టరేటు నిర్వాహణ*

సాంకేతిక విద్యాశాఖ డైరెక్టరేటును విస్తృత పరచటానికి రెండవ ప్రణాళికలో రు. 3.88 లక్షల మొత్తం కేటాయించబడింది. 1957–58, 1958–59 లలో రు. 1.10 లక్షల మొత్తం ఖర్చుపెట్టబడింది. 1959–60 లో ఈ పథకం కోసం రు 0.63 లక్ష ప్రత్యేకించబడింది

### *స్కాలరుషిప్పుల మంజూరీ*

విద్యార్థులు సాంకేతిక, వృత్తి విద్యా కోర్సులను అభ్యసించటానికి ప్రోత్సహించేటందుకై అర్హులైన బీదవిద్యార్థులకు ఆర్థిక సహాయం చేయటానికిగాను స్కాలరుషిప్పులు, బర్సరీలు మంజూరుచేయడం కోసం 1957–58, 1958–59 లలో రు. 0.37 లక్ష మొత్తం ఖర్చు చేయడింది. బర్సరీలు, స్కాలరుషిప్పులు మంజూరు చేయటం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.30 లక్ష కేటాయించబడింది.

### *వివిధ విషయాలు*

ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకం క్రింద రు. 0.21 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.06 లక్ష హైదరాబాదులోని ప్రభుత్వ

లలితకళల కళాశాల అభివృద్ధికి, రు. 0.15 లక్ష సికిందరాబాదులోని సంగీత, నృత్య బ్రాంచి పాఠశాల అభివృద్ధికి వినియోగించబడుతుంది. సికిందరాబాదులోని సంగీత పాఠశాలలో అదనపు సిబ్బంది కూడ నియమించబడుతుంది.

## వైద్యం

### హైదరాబాదులోని ఉస్మానియా ఆసుపత్రి, ఉస్మానియా వైద్యకళాశాలల స్థాయిని పెంచటం

భారత వైద్యసంఘము వారి సిఫారసులకనుగుణంగా ఉస్మానియా ఆసుపత్రి స్థాయిని పెంచటానికి, ఉస్మానియా వైద్యకళాశాలయొక్క శాఖలను పునర్వ్యవస్థీకరించటానికి గాను ఉస్మానియా జనరలు ఆసుపత్రిలో నర్సుల వసతిగృహము, ఇంటర్నీలకు వసతి గృహాలు, అదనపు లెక్చరుహాలు, క్రొత్త ఆపరేషను థియేటరుబ్లాకు, ఔటు–పేషంటుబ్లాకు నిర్మించటంకోసం 1959–60 ప్రణాళికలో రు. 10 లక్షలు కేటాయించబడినాయి. 1957–58, 1958–59 లలో ప్రారంభించబడిన అదనపు భవనాలనిర్మాణం, స్త్రీల కళాశాల ఆవరణలో క్రొత్త వైద్యకళాశాల భవన నిర్మాణం ఈ సంవత్సరంలో కూడ కొనసాగించడం జరుగుతుంది.

### కె.ఇ.ఎమ్. ఆసుపత్రి స్థాయిని పెంచటం; గాంధి వైద్యకళాశాలను ప్రారంభించటం

1957–58 లో సికిందరాబాదులోని కె.ఇ.ఎమ్. ఆసుపత్రిలో పడకల సంఖ్య 310 నుండి 400 లకు పెంచబడింది. ఇంతేకాక అదనపు సిబ్బంది నియమించటం, పరికరాలను సమకూర్చటం జరిగింది. కె.ఇ.ఎమ్. ఆసుపత్రికి, గాంధి వైద్యకళాశాలకు కొన్ని అదనపు భవనాలను నిర్మించటం, ఉన్న భవనాలకు మార్పులు చేయటంకూడ జరిగింది. 1958–59లో గాంధి వైద్యకళాశాలలో క్లినికల్ తరగతులు ఏర్పాటు చేయబడినాయి. అదనపు సిబ్బంది నియమించబడింది. పరికరాలు కూడ సమకూర్చబడినాయి. ఇంతేకాక రెండు మెడికల్ యూనిట్లు, రెండు సర్జికల్ యూనిట్లు, ఒక అబ్‌స్టెట్రిక్ మరియు గైనకాలజి యూనిట్టు కె.ఇ.ఎమ్. ఆసుపత్రిలో ఏర్పాటు చేయబడినాయి. ఈ సంవత్సరంలో గాంధి వైద్యకళాశాలలో అదనంగా ఒక లెక్చరుహాలును

నిర్మించటానికి కె.ఇ ఎమ్. ఆసుపత్రిలో ఒక ఆపరేషను థియేటరు బ్లాకు, ఒక ఔటు పేషెంటు బ్లాకు నిర్మించటానికి, నర్సుల వసతి గృహాలకు విస్తరణ పనులు ప్రారంభించటానికి ప్రతిపాదింపబడింది. కె.ఇ.ఎమ్. ఆసుపత్రిలో పడకల సంఖ్య కూడ 400 నుండి 500 లకు పెంచబడుతుంది. పై అభివృద్ధి పనులను జరిపించటంకోసం 1959–60 ప్రణాళికలో రు. 7.00 లక్షల మొత్తం కేటాయించబడింది.

### *ఉస్మానియా, గాంధి వైద్యకళాశాలలలో "సోషల్ అండ్ ప్రివెంటివ్ మెడిసిన్" శాఖను ఏర్పాటు చేయటం*

1957–58 లో ఉస్మానియా వైద్యకళాశాలయందు "సోషల్ అండ్ ప్రివెంటివ్ మెడిసిన్" శాఖ ఒకటి ఏర్పాటు చేయబడింది. పటన్‌చేరువద్ద ఒక ప్రత్యక్ష శిక్షణ కేంద్రం కూడ స్థాపించబడి దీనికి అనుబంధించబడింది. 1958–59లో యిది కొనసాగించ బడింది. దీని కొనసాగింపు నిమిత్తం ఈ సంవత్సరంలో రు. 1.67 లక్షల మొత్తం కేటాయించబడింది.

### *లేబరేటరీ అసిస్టెంట్లకు, ఎక్స్‌రే టెక్నీషియన్లు మొదలగు వారికి శిక్షణ*

ఈ పథకం క్రింద సెంట్రల్ లేబరేటరీస్‌లో 12 మంది ఎక్స్‌రే టెక్నీషియన్లకు శిక్షణ ఇవ్వబడుతుంది. ఇంతేకాక ఉస్మానియా వైద్యకళాశాలలో 12 మంది లేబరేటరీ టెక్నీషియన్లకు, 12 మంది మెడికో సోషల్ వర్కర్లకు కూడ శిక్షణ ఇవ్వబడుతుంది. 1959–60 ప్రణాళికలో ఈ పథకం కోసం రు. 0.27 లక్ష కేటాయించబడింది.

### *నర్సుల శిక్షణ పాఠశాల; నర్సింగులో బి. ఎస్. సి. కోర్సు ప్రారంభించటం*

నర్సింగులో బి. ఎస్. సి., కోర్సు ప్రారంభించడానికి 1959–60 ప్రణాళికలో లక్ష రూపాయలు కేటాయించబడినాయి. ఇందుకు గాను అదనపు సిబ్బంది నియమించబడుతుంది. పరికరాలు సమకూర్చబడతాయి.

### *రేడియం ఇన్‌స్టిట్యూట్*

హైదరాబాదులోని రేడియం ఇనిస్టిట్యూట్‌లో పడకల సంఖ్య 40 నుండి 105 కు 1957–58 లో పెంచబడింది. ఇంతేకాక అదనపు సిబ్బందిని

నియమించడం, పరికరాలను సమకూర్చడం, డి.ఎమ్.ఆర్. కోర్సులను ఏర్పాటు చేయటం జరిగింది. 1959–60 లో కోశాల్టు యూనిట్టుకోసం ఒక భవనాన్ని నిర్మించడానికి, పడకల సంఖ్యను 150 కి పెంచడానికి తలపెట్టబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 1.50 లక్షల మొత్తం కేటాయించబడింది.

## వైద్యశాస్త్ర చరిత్రశాఖ స్థాయిని పెంచటం

విశాఖపట్టణంలోని ఆంధ్ర వైద్యకళాశాలలో వైద్యశాస్త్ర చరిత్ర శాఖ ఏర్పాటు చేయబడి ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరం ఉస్మానియా వైద్య కళాశాలకు మార్చబడింది. బోధనకు, పరిశోధనకు పనికివచ్చే అఖిలభారత సంస్థగా దీన్ని రూపొందించే ఉద్దేశ్యంతో 1959 జనవరిలో ఈ శాఖ స్థాయి పెంచబడింది. ఈ శాఖ కొనసాగింపు నిమిత్తం ఈ సంవత్సరంలో రు. 0.33 లక్ష కేటాయించబడింది.

## రాజ్యంలో వైద్యపరిశోధన

ఫెలోషిప్పులను ఇవ్వటానికి ప్రభుత్వంచే నియమించబడిన రిసెర్చి కమిటీచే ఆమోదింపబడిన ఏ పరిశోధనా పథకం క్రిందనయినా రిసెర్చి స్కాలర్లకు ఫెలోషిప్పులు ఇవ్వటానికి ఈ పథకం క్రింద ఉద్దేశించబడింది. విశాఖపట్టణంలోని ఆంధ్ర వైద్యకళాశాలలోను, హైదరాబాదులోని ఉస్మానియా వైద్యకళాశాలలోను, గుంటూరు వైద్యకళాశాలలోను, ఈ పథకం ప్రవేశపెట్టబడింది. పరిశోధన కోసం రిసెర్చి స్కాలర్లు నియమించబడినారు. పై కళాశాలల్లో ఈ పథకాన్ని ఈ సంవత్సరంలో కొనసాగించేటందుకు గాను ప్రణాళికలో రు. 0.18 లక్ష మొత్తం కేటాయించబడింది.

## మెంటలు హాస్పిటలు, మానసిక చికిత్సాలయము

1957–58 లో గుంటూరులో స్థాపించబడిన మానసిక చికిత్సాలయాన్ని కొనసాగించటానికి, హైదరాబాదులోని మెంటలు హాస్పిటలు (పిచ్చాసుపత్రి)కు అభివృద్ధి పనులు చేయటానికి, ఈ ఆసుపత్రిలో 150 పడకలు పట్టే వార్డులు నిర్మించటానికిగాను 1959–60 ప్రణాళికలో లక్ష రూపాయలు కేటాయించబడినాయి.

### శిశువైద్యా కేంద్రం

1959—60 లో నీలోఫరు ఆసుపత్రిలో ఒక "చైల్డుగైడెన్సు క్లినిక్కు"ను, "పేడియాట్రికు సెంటరు"ను (శిశువైద్య కేంద్రం). ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. అవసరమయిన సిబ్బంది నియమించ బడుతుంది. పరికరాలు సమకూర్చబడతాయి. ఇందుకు గాను రు. 0.50 లక్ష మొత్తం కేటాయించబడింది

### మందులు, పరికరాలు, సాధన సామగ్రి అధికంగా సరఫరా చేయటం

తెలంగాణా ప్రాంతములోని వైద్య సంస్థల అవసరాలను ఆదుకొనుటకుగాను హైదరాబాదులో ఉన్న మెడికల్ స్టోరుకు మందులు, పరికరాలు, లినెన్‌లు కొనటంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు 3.17 లక్షల మొత్తం కేటాయించబడింది.

### ఉస్మానియా ఆసుపత్రిలో ప్రత్యేక ఆహారం తయారు చేయుటకు వంటశాల నిర్మాణం

ఉస్మానియా జనరలు ఆసుపత్రిలో ప్రత్యేక ఆహారం తయారు చేయుటకుగాను, 1956—57 లో ప్రత్యేకంగా ఒక వంటశాల ఏర్పాటు చేయబడింది. 1959—60 లో ఇది కొనసాగించబడుతుంది. ఇంతేగాక నీలోఫరు ఆసుపత్రిలో గూడ వంటశాల ఏర్పాటు చేయబడుతుంది. ఇందుకు గాను ప్రణాళికలో రు. 0.07 లక్ష కేటాయించబడింది.

### పబ్లిక్ హెల్త్ లేబరేటరీలు

హైదరాబాదులోని సెంట్రల్ లేబరేటరీలో సీరం, వాక్సినులు తయారు చేయుటకుగాను అదనపు శాఖను ఏర్పాటుచేయుటకై అదనపు భవనాల నిర్మాణం 1958—59 లో ప్రారంభించబడింది. 1959—60 లో ఇవి పూర్తి చేయబడతాయి. ఈ లేబరేటరీని అభివృద్ధిచేయటం కోసం సుమారు 50 లేక 60 ఎకరాల భూమిని స్వాధీనం చేసికోవటానికి, అదనపు సిబ్బందిని నియమించటానికి, పరికరాలను సమకూర్చటానికి కూడ ప్రతిపాదింపబడింది. "కింగ్ ఇన్‌స్టిట్యూట్ పద్ధతిలో పబ్లిక్ హెల్త్ లేబరేటరీని

స్థాపించటం" అన్న పథకం క్రింద ఈ సంవత్సరంలో ఇందుకుగాను తెలంగాణా ప్రణాళికలో రు. 0.50 లక్ష, ఆంధ్ర ప్రణాళికలో రు. 2.00 లక్షల మొత్తం కేటాయించబడినవి.

### నీలోఫరు ఆసుపత్రిలో "పేడియాట్రిక్ సెంటరు" (శిశువైద్య కేంద్రం)

1957—58 లో భారత ప్రభుత్వం వారి సహాయంతో హైదరాబాదు లోని నీలోఫరు ఆసుపత్రిలో "పేడియాట్రిక్ సెంటరు" ఒకటి ఏర్పాటు చేయబడింది. 1958—59 లో ఇది కొనసాగించబడింది. 1959—60 లో ప్రయివేటు వ్యక్తులకు చెందిన కొంత భూమిని స్వాధీనం చేసికొని ఔట్ పేషెంటు డిపార్టుమెంటు భవనాన్ని, హౌసు సర్జనులకుగాను వసతిగృహాలను నిర్మించటానికి ప్రతిపాదింపబడింది. 1959—60 లో ఈ పథకంకోసం రు. 2.40 లక్షల మొత్తం కేటాయించబడింది.

### సరోజినీదేవి ఆసుపత్రికి అభివృద్ధి పనులు

1957—59 లో సరోజినీదేవి ఆసుపత్రిలో "అడ్మినిస్ట్రేటివ్ బ్లాకు" నిర్మించటం పూర్తి అయింది. ఇంతేగాక "ఆఫ్తాల్మాలజీ మరియు "లారింగాలజీ ఇనిస్టిట్యూట్" కూడ ఏర్పాటు చేయబడింది. ఆసుపత్రిలో పడకల సంఖ్యను 200 లకు పెంచటానికి, 1958—59 లో నిర్మించటం ప్రారంభించ బడిన ఔట్ పేషెంట్ బ్లాకు నిర్మాణం పూర్తి చేయటానికి గాను ఈ సంవత్సరానికి రు. 2.30 లక్షల మొత్తం కేటాయించబడింది.

### హైదరాబాదులోని ప్రసూతి ఆసుపత్రికి అభివృద్ధిపనులు

రు. 0.40 లక్ష వ్యయంతో 1959—60 లో ప్రభుత్వ ప్రసూతి ఆసుపత్రికి అదనపు సిబ్బందిని నియమించటానికి, అదనపు పరికరాలను సమకూర్చటానికి ప్రతిపాదింపబడింది.

### హైదరాబాదులోని మెంటలు హాస్పిటలు (పిచ్చాసుపత్రి)కు అభివృద్ధిపనులు

హైదరాబాదులోని మెంటలు హాస్పిటలులో 150 పడకలు పట్టే వార్డులను నిర్మించటానికి, అదనపు సిబ్బందిని నియమించటానికి గాను 1959—60 ప్రణాళికలో. రు. 2.35 లక్షల మొత్తం కేటాయించబడింది.

1958–59 ప్రణాళికలో ఈ పథకం చేర్చబడినప్పటికీ ప్లానులు, అంచనాలు తయారుగా లేనందువల్ల అమలు పరచబడలేదు.

### ఇర్రంసుమాలోని క్షయ ఆసుపత్రికి అభివృద్ధి పనులు

ఇర్రంసుమాలోని క్షయ ఆసుపత్రిలోని పడకల సంఖ్య 1958–59లో 500 నుండి 600 లకు పెంచబడింది. అదనంగా సిబ్బంది మంజూరు చేయబడింది. అదనపు పరికరాల కొనుగోలుకు కూడ మంజూరు ఇవ్వబడింది. కిచెను బ్లాకు, ఎలక్ట్రిక్ సబ్ స్టేషను నిర్మాణంలో ఉన్నాయి. "అడ్మినిస్ట్రేటివ్ బ్లాకు" నిర్మాణానికి మంజూరు ఇవ్వబడింది. ఈ సంవత్సరంలో దీని నిర్మాణం ప్రారంభించబడి పూర్తి చేయబడుతుంది. 1959–60 ప్రణాళికలో ఈ పథకం కోసం రు. 1.10 లక్షల మొత్తం కేటాయించబడింది.

### వికారాబాదులోని క్షయ ఆసుపత్రికి అభివృద్ధి పనులు

1958-59 లో ఈ ఆసుపత్రిలోని పడకల సంఖ్య 200 నుండి 300 లకు పెంచబడింది. అదనంగా సిబ్బంది నియమించబడింది. పరికరాలు కూడ సమకూర్చబడినాయి. రఫత్ బాగ్ భవనం సంరక్షక, పునరావాస కేంద్రంగా మార్చబడింది. అవసరమయిన సిబ్బందికూడ నియమించబడింది. 40 పడకలు పట్టే క్షయవ్యాధి ప్రత్యేక (ఐసొలేషన్) వార్డు నిర్మాణంలో ఉంది. 1959–60 లో ఇది పూర్తి చేయబడుతుంది. ఇందుకుగాను 1959-60 ప్రణాళికలో లక్ష రూపాయలు కేటాయించబడినాయి.

### ఫీవరు హాస్పిటలు స్థాయిని పెంచటం

లింగంపల్లిలోని ఫీవరు ఆసుపత్రిలోని పడకల సంఖ్య 1958-59లో 120 నుండి 150 కి పెంచబడింది. అదనపు సిబ్బంది నియమించటం, పరికరాలను సమకూర్చటం కూడ జరిగింది. 1959–60 లో పడకల సంఖ్యను 150 నుండి 200 లకు పెంచటానికి, నిర్మాణంలో ఉన్న ఐసొలేషన్ షెడ్ల నిర్మాణాన్ని పూర్తి చేయటానికి ప్రతిపాదింప బడింది. నర్సులకు వసతిగృహాలు, అదనంగా ఆసుపత్రిలో చేర్చుకోబడే రోగులకు భవనాలు కూడ నిర్మించబడతాయి. పై కార్యక్రమాలను అమలు జరపటంకోసం 1959–60 ప్రణాళికలో రు. 1.10 లక్షల మొత్తం కేటాయించబడింది.

### రిఫ్రాక్షనిస్టులకు, ఆప్టీషియన్లకు శిక్షణ

భారత ప్రభుత్వంవారు చేసే సహాయంతో 1957–58 నుండి హైదరాబాదులోని సరోజనీదేవి ఆసుపత్రిలో ఏటా 12 మంది అభ్యర్థులు శిక్షణ నిమిత్తం చేర్చుకోబడుతున్నారు. 1959–60 లో మరో 12 మంది అభ్యర్థులు శిక్షణ నిమిత్తం చేర్చుకోబడతారు. ఇందుకుగాను రు. 0 44 లక్ష మొత్తం కేటాయించబడింది.

### జిల్లా ఆసుపత్రుల స్థాయిని పెంచటం

వర్తమాన సంవత్సరంలో ఈ పథకంకోసం చేయబడిన మొత్తం కేటాయింపు రు. 6.50 లక్షలలో రు. 0.90 లక్ష మొత్తం, వికారాబాదు, గోల్కొండలలో ఉన్న జిల్లా ఆసుపత్రుల స్థాయిని పెంచటంకోసం ఈ జిల్లాలో వినియోగించబడుతుంది.

### సబ్సిడీ ఈయబడు వైద్యులు

1958-59 లో సబ్సిడీ పద్ధతిపై 37 గ్రామీణ వైద్యశాలలు ప్రారంభించ బడినాయి. అవి ఈ సంవత్సరం కొనసాగించబడతాయి. అంతేకాక ఈసంవత్స రంలో మరో 30 క్రొత్త కేంద్రాలను స్థాపించటానికిగాను 1959–60 ప్రణాళికలో రు. 0.50 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.06 లక్ష మొత్తం ఈ జిల్లాలోని వైద్యశాలలకు అయ్యే ఖర్చు నిమిత్తం ప్రత్యేకించబడింది.

### దంత వైద్యకళాశాల, దంత వైద్యశాలలను ఏర్పాటు చేయటం

గతంలో ఏర్పాటు చేయబడిన దంత వైద్యశాలలను నిర్వహించ టానికి, క్రొత్తవాటిని ఏర్పాటు చేయటానికి, హైదరాబాదులోని ఉస్మానియా ఆసుపత్రిలో 1958–59 లో తెరవబడిన దంత చికిత్సా విభా గాన్ని కొనసాగించటానికి గాను ఈ సంవత్సరంలో ఆంధ్ర ప్రాంతపు ప్రణాళికలో రు. 2 50 లక్షలు, తెలంగాణా ప్రాంతపు ప్రణాళికలో రు. 0.56 లక్ష — మొత్తం రు 3.06 లక్షలు కేటాయించబడినాయి. ఇందులో రు. 0.84 లక్ష మొత్తం హైదరాబాదులోని ఉస్మానియా జనరలు ఆసుపత్రిలో ఏర్పాటు చేయబడిన దంత వైద్యశాల, దంత చికిత్సా విభా గాలను నిర్వహించటానికి గాను ప్రత్యేకించబడింది.

## క్షయవ్యాధి నివారణోద్యమం

ఈ పథకం క్రింద రు. 6.90 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 4.00 లక్షలు తెలంగాణా ప్రణాళికలోను, రు. 2.90 లక్షలు ఆంధ్ర ప్రణాళికలోను కేటాయించబడినాయి. పై కేటాయింపులోనుండి రు. 5.90 లక్షల మొత్తం క్రింది పనులకుగాను హైదరాబాదు జిల్లాకు కేటాయించబడింది :—

1. 1956-57 లో దబీర్‌పురాలో ఏర్పాటు చేయబడిన క్షయ చికిత్సాలయాన్ని కొనసాగించటం;

2. వికారాబాదు, సికిందరాబాదులలో రెండు క్షయ చికిత్సాలయాలను ఏర్పాటు చేయటం;

3. ఇర్రంనుమాలో 40, వికారాబాదులో 40— మొత్తం 80 పడకలను క్షయ రోగుల నిమిత్తం ఏర్పాటు చేయటం;

4. క్షయ వ్యాధి నివారణ, ప్రదర్శన శిక్షణ కేంద్రంకోసం భవన నిర్మాణం;

5. ఇర్రంనుమాలో సంరక్షక, పునరావాస కేంద్రం ఏర్పాటు చేయటం.

## కుటుంబ నియంత్రణ కేంద్రాలు

దేశంలో జనాభా త్వరితగతిని పెరిగిపోతూ, దేశం యొక్క పరిమిత సాధన సంపత్తిమీద అధిక ఒత్తిడిని కలుగచేస్తున్నది. ఈ విషయాల దృష్ట్యా దేశంలో కుటుంబనియంత్రణకు, జనాభా పెరుగుదలను అరికట్టే విషయాలకు ప్రాధాన్యం ఏర్పడింది. 1957-59 లో ఆంధ్రలో 13, తెలంగాణాలో 7 — మొత్తం 20 కుటుంబనియంత్రణ కేంద్రాలు ఏర్పాటు చేయబడినాయి. ఈ సంవత్సరంలో ఇంకా 10 కేంద్రాలను ఆంధ్రలోను, 5 కేంద్రాలను తెలంగాణాలోను—మొత్తం 15 కేంద్రాలను ఏర్పాటు చేయటానికి, ఇంతకు ముందు ఏర్పాటు చేసినవాటిని నిర్వహించటానికి ప్రతిపాదించబడింది. ఇందుకు గాను 1959-60 ప్రణాళికలో రు. 0.66 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.04 లక్ష ఈ జిల్లాలో వినియోగించబడుతుంది. ఈ మొత్తంతో గోల్కొండలో ఒక కుటుంబనియంత్రణ కేంద్రాన్ని ఏర్పాటు

చేయటం, 1957-59 లో నీలోఫరు ఆసుపత్రిలోను, ఉస్మానియా వైద్య కళాశాలలోను ఏర్పాటు చేయబడిన కేంద్రాలను కొనసాగించటం జరుగుతుంది.

### సుఖవ్యాధుల నివారణ కార్యక్రమం

తెలంగాణా ప్రాంతంలో సుఖవ్యాధుల నివారణ కార్యక్రమంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.05 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.01 లక్ష 1957-58 లో హైదరాబాదులోని ఉస్మానియా జనరలు ఆసుపత్రియందు స్థాపించబడిన సుఖవ్యాధుల చికిత్సా కేంద్రం కొనసాగింపు కొరకు వినియోగించబడుతుంది.

### ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు

ఈ పథకం క్రింద, గ్రామీణ ప్రజల అవసరాలను ఆదుకొనటం కోసం బ్లాకు ప్రాంతాలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ఏర్పాటు చేయబడతాయి. ఈ పథకం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 10.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.00 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. ఈ మొత్తంతో ఈ జిల్లాలో 4 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ఏర్పాటు చేయబడతాయి. గతంలో స్థాపించబడిన కేంద్రాలు కొనసాగించబడతాయి.

### ఇండియన్ మెడిసిన్ ఆసుపత్రి స్థాపన

ఈ పథకం క్రింద భారతీయ వైద్య శాస్త్ర ప్రకారం చికిత్స చేసే క్రింది సంస్థలను అభివృద్ధి చేయడమే కాక, ఆయుర్వేద, యూనాని వైద్య శాస్త్రాలకు సంబంధించి పరిశోధన కూడ చేయబడుతుంది.

1. ఓషధీవనంకు అభివృద్ధి పనులు.
2. హైదరాబాదులోని ప్రభుత్వ ఆయుర్వేద కళాశాలకు, దానికి అనుబంధించబడిన ఆసుపత్రికిగాను అదనపు సిబ్బందిని నియమించటం, పరికరాలను సమకూర్చటం.
3. హైదరాబాదులోని నిజామియా జనరలు ఆసుపత్రికి శస్త్ర చికిత్సా పరికరాలను కొనుగోలుచేయటం.

4. హైదరాబాదులోని నిజామియా ఆసుపత్రిలో రెండవ గ్రేడు సెక్రటరీని, ప్రౌజరరును నియమించటం.

ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకమునకు గాను రు. 2.00 లక్షల మొత్తం కేటాయించబడింది.

## ప్రజారోగ్యం

### *నేషనలు మలేరియా కంట్రోలు కార్యక్రమం*

మలేరియా నివారణ కార్యక్రమంగా ఈ పథకం 1–4–58 నుండి మార్చబడింది. ఈ పథకం క్రింద అన్ని జిల్లాలలోను తీవ్రంగా డి. డి టి. మొదలైన మందులు చల్లటం జరుగుతుంది. ఈ సంవత్సరంలో 8 1/2 హైపో-ఎండమిక్ యూనిట్లను ఏర్పాటు చేయటానికి, ఇద్దరు ప్రాంతీయ ప్రజారోగ్య అసిస్టెంటు డైరెక్టర్ల కార్యాలయాలను స్థాపించటానికి, ప్రస్తుత మున్న 8 మలేరియా నివారణ యూనిట్లను కొనసాగించటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను తెలంగాణా ప్రాంతపు ప్రణాళికలో రు. 12.30 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో 1.33 లక్షల మొత్తం 1 1/2 హైపో-ఎండమిక్ యూనిట్ల స్థాపించటానికి ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఇంతేగాక ప్రజారోగ్య అసిస్టెంటు డైరెక్టరు పదవిని, అతని క్రింద పని చేయుచున్న సిబ్బందిని కొనసాగించటంకోసం రు. 0.25* లక్ష మొత్తం కూడ కేటాయించబడింది.

### *బి. సి. జి. టీకాలు*

మొదటి ప్రణాళికా కాలంలో క్షయ వ్యాధిని అరికట్టేటందుకు బి. సి. జి. టీకాలు వేయటం ప్రారంభించబడింది. ఒక కేంద్ర పరిపాలక యూనిట్టు, 6 ఫీల్డు టీములు ఇందుకుగాను ఏర్పాటు చేయబడినాయి. మొదటి మూడు సంవత్సరాల్లోను ఈ యూనిట్టులను కొనసాగించటం జరిగింది. 1959–60 లో అదనంగా ఇంకా మూడు ఫీల్డు టీములను ఏర్పాటు చేయటానికి, అంతేకాక ప్రస్తుతమున్న పరిపాలక యూనిట్టును, 6 ఫీల్డు

---

*ఆంధ్ర ప్రాంతపు మలేరియా నివారణ కార్యక్రమం క్రింద కేటాయించబడిన ప్రణాళికా కేటాయింపులో ఇది చేర్చబడింది.

టీములను కొనసాగించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు అయ్యే ఖర్చులో రాజ్యప్రభుత్వ వాటా క్రింద ప్రణాళికలో రు. 3.70 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.27 లక్ష హైదరాబాదులోని కేంద్ర పరిపాలక యూనిట్టును కొనసాగించటానికి వినియోగించబడుతుంది.

## *బలవర్ధక ఆహారం గురించి పరిశోధన*

ఉమ్మడి మదరాసు రాజ్యంలోని ఆంధ్రప్రాంతంలో 1950 లో ప్రాంతీయ బలవర్ధక ఆహార విషయక కేంద్రం ఏర్పాటు చేయటంతో బలవర్ధక ఆహారపరిశోధన పథకం ప్రారంభించబడింది. ప్రస్తుతం ప్రజల్లో భోజన రీతులను పరిశీలించటానికి, క్రింది వర్గాల ప్రజలు తీసుకొనే ఆహారంలో పుష్టి ఎంత కొరవడి ఉండేది నిర్ణయించటానికి, వారి ఆహారంలోని పుష్టి హీనతను పోగొట్టటానికి, బలవర్ధక ఆహార పదార్థాల్ని సరఫరా చేయటానికి, బలవర్ధక ఆహారం విషయం గురించి ప్రజలకు తెలియచేయటానికి గాను ఈ పథకం క్రింద పరిశోధనలు జరిపేటందుకు ఉద్దేశించబడింది. 1956–57 లో ఈ యూనిట్టు కొనసాగించబడింది. ఇంతేకాక భారతవైద్య పరిశోధనా సంస్థ మరియు పరిశోధన కార్పొరేషను వారి తోడ్పాటుతో విశాఖ పట్టణంలో బెరి–బెరివ్యాధికి సంబంధించి పరిశోధన జరపటానికి ఒక పథకం ప్రారంభించబడింది. తరువాత ఈ పరిశోధన కేంద్రం గుంటూరుకు మార్చబడింది. 1957–58 లో మరో ప్రాంతీయ బలవర్ధక ఆహార యూనిట్టు కర్నూలు ప్రధాన కార్యస్థానంగా ఏర్పాటు చేయబడింది. 1959–60 ప్రణాళికలో ఈ పథకం క్రింద రు. 1.4 లక్షల మొత్తం కేటాయించబడింది. ఆంధ్ర ప్రాంతములలోని గుంటూరు, కర్నూలులలో ప్రస్తుతం ఉన్న రెండు యూనిట్టులను కొనసాగించటానికి, గుంటూరులో అమలునందున్న బెరి-బెరివ్యాధిపరిశోధన పథకాన్ని కొనసాగించటానికి, 1957–58 లో తెలంగాణా ప్రాంతమందలి వరంగల్లులో ఏర్పాటు చేయబడిన యూనిట్టును కొనసాగించటానికి గాను పై మొత్తం వినియోగించబడుతుంది. ఇందులో రు. 0.19 లక్ష మొత్తం హైదరాబాదులో ఉన్న ప్రజారోగ్యశాఖ డైరెక్టరు కార్యాలయంలో నియమించబడిన అసిస్టెంటు డైరెక్టరు (ప్రజారోగ్యం) పదవిని, ఆయన క్రింద పని చేయుచున్న సిబ్బందిని కొనసాగించుటకు గాను ప్రత్యేకించబడింది.

## గ్రామీణ పారిశుధ్యా యూనిట్లు

గ్రామీణ ప్రాంతాల్లో ఆరోగ్య వాతావరణాన్ని అభివృద్ధి చేసే టందుకు గాను తీసికోవలసిన అవసరమైనట్టి చర్యలను రూపొందించేటందుకు గాను 1954-55 లో కేంద్ర ప్రజారోగ్య ఇంజనీరింగ్ వ్యవస్థ ఒకటి స్థాపించ బడింది. రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలం లోను ఇది కొనసాగించబడింది. 1959—60 లో కూడ దీన్ని కొనసాగించు టకు ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.28 లక్ష మొత్తం కేటాయించబడింది.

## ప్రజారోగ్యా ప్రచారం

ప్రజారోగ్యశాఖ డైరెక్టరు కార్యాలయంలో ఆరోగ్య విషయాలగూర్చి సామాన్య ప్రజలకు తెలియచేయటానికి గాను 1957-58 లో కేంద్ర ఆరోగ్య విద్యాసంస్థ ఒకటి ఏర్పాటు చేయబడింది. రెండు వ్యానులు కొనబడినాయి. ఇంతేకాక గతంలో కొనబడిన 11 జీపులను, అంటువ్యాధి నివారణ, ప్రచారం కోసం ఉద్దేశించబడిన రెండు వ్యానులను ఈ కార్యక్రమంకోసం నిర్వ హించటం జరిగింది. 1958-59 లో ఈ పథకాన్ని కొనసాగించుటకు క్రొత్త ఢిల్లీలోని కార్యాచరణ వర్గము వారు సమ్మతించలేదు. అయినప్పటికి జిల్లాలలో ప్రస్తుతమున్న 11 జీపులను, 4 వ్యానులను ఈ కార్యక్రమం కోసం నిర్వహించటానికి హైదరాబాదులో ఉన్న కేంద్ర ఆరోగ్య విద్యా సంస్థను కొనసాగించటానికి, క్రొత్తగా మరో 8 వ్యానులను కొనటానికి, మూడు ఆరోగ్య ప్రచార బ్యూరోలను స్థాపించటానికి గాను 1959—60 లో రు. 4.15 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.69 లక్షల మొత్తం హైదరాబాదులోని కేంద్ర ఆరోగ్య విద్యాసంస్థను కొనసాగించ టానికి, 8 క్రొత్త వ్యానులను కొనటానికి గాను వినియోగించబడుతుంది.

## సెంట్రల్ మలేరియా లేబరేటరీ మరియు మ్యూజియం స్థాపన

మలేరియా నివారణ పథకాలను అమలు పరచటానికి నియమించ బడిన సిబ్బందికి శిక్షణ సౌకర్యాలను కలుగచేసే నిమిత్తం 1956—57 లో విశాఖపట్టణంలో సెంట్రల్ మలేరియా లేబరేటరీ ఒకటి స్థాపించబడింది. 1957-58 లో ఇది హైదరాబాదుకు మార్చబడింది. 1958—59 లో దీన్ని

కొనసాగించటం జరిగింది. 1959-60 లో కూడ ఈ సెంట్రల్ మలేరియా లేబరేటరీ కొనసాగించబడుతుంది. ఇందుకుగాను రు. 0 43 లక్ష మొత్తం కేటాయించబడింది.

### సెంట్రల్ న్యూట్రిషన్ లేబరేటరీ స్థాపించటం

బలవర్ధక ఆహారాన్ని గురించి పరిశోధనలు జరిపేటందుకు గాను హైదరాబాదులోని ప్రజారోగ్యశాఖ డైరెక్టరు కార్యాలయంలో సెంట్రల్ న్యూట్రిషన్ లేబరేటరీ నొకదాన్ని ఏర్పాటు చేయటానికి ఈ పథకం క్రింద మొదట ప్రతిపాదింపబడింది. కాని తదుపరి వరంగల్లు ప్రధాన కార్యస్థానంగా 1957-58 లో ప్రాంతీయ న్యూట్రిషన్ యూనిట్టు ఒకటి ఏర్పాటు చేయబడింది. ప్రజారోగ్య అసిస్టెంటు డైరెక్టరు ఒకరు ఈ పనికోసం నియమించబడినారు. 1958-59 లో ఈ పథకాన్ని కొనసాగించేటందుకు క్రొత్త ఢిల్లీలోని కార్యాచరణ వర్గమువారు సమ్మతించలేదు. అయినప్పటికీ హైదరాబాదులో సెంట్రల్ న్యూట్రిషన్ లేబరేటరీ స్థాపించటంకోసం 1959-60 ప్రణాళికలో రు. 0.56 లక్ష కేటాయించబడింది.

### గణాంక వివరాలు

ప్రజారోగ్యశాఖ డైరెక్టరు కార్యాలయంలో జననమరణాలకు సంబంధించిన ముఖ్య వివరాలను సేకరించి సంకలనం చేసే కార్యక్రమాన్ని కంప్యూటేటర్లు మొదలైన యంత్రాల సహాయంతో కొనసాగించటంద్వారా ఈ పని ఇంకా సమర్థవంతంగా చేయటానికి ఈ పథకం ఉద్దేశించబడింది. 1958-59 లో ఈ పథకం అమలు జరుపబడింది. 1959-60 లో కొనసాగించబడుతుంది. ఇందుకు గాను రు. 0 22 లక్ష మొత్తం కేటాయించబడింది.

### ఆరోగ్యశాఖ సిబ్బందికి శిక్షణ

శిక్షణ పొందిన ఆరోగ్యశాఖ సిబ్బంది కొరతను రెండవ ప్రణాళికా కాలంలో తీర్చటానికై ప్రణాళికా కాలంలో 90 మంది హెల్త్ విజిటర్లకు, ప్రతి సంవత్సరం 30 మంది సహాయక నర్సు-మంత్రసానులకు శిక్షణ ఇవ్వటానికి ప్రతిపాదింపబడింది. 1959-60 లో ఈ శిక్షణ కార్యక్రమం కొనసాగించబడుతుంది. ఇంతేకాక 30 మంది సహాయక నర్సు-మంత్రసానులు శిక్షణ నిమిత్తం చేర్చుకోబడతారు. 7 మంది సిస్టరు-ట్యూటర్లు కూడ నియ

మించబడతారు. ప్రణాళికలో ఇందుకు గాను రు. 1.26 లక్షల మొత్తం కేటాయించబడింది.

### దాయీలకు శిక్షణ

ఈ సంవత్సరంలో తెలంగాణా ప్రాంతంలో నాటు మంత్రసానుల (దాయీలు) కు శిక్షణ ఇవ్వటానికి సంబంధించిన పథకాన్ని ప్రవేశ పెట్ట టానికి, 240 మంది దాయీలకు శిక్షణ ఇవ్వటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు గాను ప్రణాళికలో రు. 0.12 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో 60 మంది దాయీలకు రు. 0.03 లక్ష ఖర్చుతో ఈ జిల్లాలో శిక్షణ ఇవ్వబడుతుంది.

### పంచవర్ష ప్రణాళిక అమలుకు సంబంధించిన పనికై లయజన్ ఆఫీసరు నియామకం

పంచవర్ష ప్రణాళిక క్రింద అమలు జరుపబడే వివిధ పథకాల కారణంగా ప్రజారోగ్యశాఖ డైరక్టరు కార్యాలయంలో మినిస్టీరియల్ పని బాగా పెరిగిపోయింది. ఇందువల్ల రెండవ ప్రణాళికా కాలంలో ఒక లయజన్ ఆఫీసరును, ఇతర సహాయక సిబ్బందిని నియమించటానికి ప్రతి పాదింపబడింది. పై సిబ్బందిని నియమించుటకు గాను 1959—60 ప్రణాళిక లో రు 0.17 లక్ష మొత్తం కేటాయించబడింది.

### గ్రామాలకు మందుల పెట్టెల సరఫరా

ఈ పథకం క్రింద జిల్లాకు 12 చొప్పున 108 మందుల పెట్టెలు తెలంగాణా ప్రాంతంలో 1957—58, 1958-59 సంవత్సరాలలో సరఫరా చేయబడినాయి. ఈ 108 మందుల పెట్టెలకు మందులు సరఫరా చేయ టానికి, ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలో సరఫరా చేయబడిన 797 పెట్టెలకు కూడ మందులను సరఫరా చేయటానికి గాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.91 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాకు 1957—59 లలో సరఫరా చేయబడిన 12 పెట్టెలకు, ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలో సరఫరా చేయబడిన 96 పెట్టెలకు మందులు సరఫరా చేయటానికి గాను పై మొత్తంలో రు. 0.10854 లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## వెనుకబడిన జాతులకు ప్రసూతి, శిశు ఆరోగ్యా కేంద్రాలు

తెలంగాణా ప్రాంతములోని వెనుకబడిన ప్రాంతాలకు చెందిన గ్రామీణ ప్రజలకు ప్రసూతి, శిశు ఆరోగ్య సౌకర్యాలను కలిగించటానికిగాను 1957-58 లో రెండు ప్రసూతి, శిశు ఆరోగ్య కేంద్రాలు ఏర్పాటు చేయబడినాయి. ఈ పథకం కొనసాగించటానికి క్రొత్త ఢిల్లీలోని కార్యాచరణ వర్గం వారు సమ్మతించనందున 1958-59 ప్రణాళికలో ఈ పథకంకోసం ధనం కేటాయించబడలేదు. అయినా ప్రస్తుతమున్న రెండు కేంద్రాలను కొనసాగించటానికి, క్రొత్తగా మరో 6 కేంద్రాలను స్థాపించటానికి గాను 1959-60 ప్రణాళికలో రు. 1.42 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.17 లక్ష మొత్తం ప్రస్తుతం ఈ జిల్లాలో ఉన్న ఒక కేంద్రాన్ని కొనసాగించటానికి గాను వినియోగించబడుతుంది.

## కుటుంబ సంక్షేమ కేంద్రాలు

1959-60 లో తెలంగాణా ప్రాంతంలోని గ్రామీణ ప్రాంతాల్లో 42 కుటుంబ సంక్షేమ కేంద్రాలు ఏర్పాటు చేయటానికి (ఇందులో 30 కేంద్రాలు 1957-59 లో మంజూరు చేయబడినవి, 12 క్రొత్తగా ఏర్పాటు చేయబడేవి) హైదరాబాదులోని సంక్షేమ కేంద్రాన్ని కొనసాగించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.99 లక్ష మొత్తం కేటాయించబడింది.

ఇందులో రు.0.3733 లక్ష మొత్తం హైదరాబాదు జిల్లాలో 5 సంక్షేమ కేంద్రాలను స్థాపించడానికి (ఇందులో నాల్గింటికి ఇంతకు ముందుగాను, మిగత ఒక కేంద్రానికి క్రొత్తగాను మంజూరు ఇవ్వబడింది) హైదరాబాదులో ప్రస్తుతమున్న ఒక కేంద్రాన్ని కొనసాగించటానికి ప్రత్యేకించబడింది.

## ఆరోగ్యా విద్యాప్రచార పథకం

1959-60 సం॥ లో ఈ పథకం క్రింద రు. 1.72 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.17 లక్ష 1957-58 లో 6 జిల్లాలకు కేటాయించబడిన 6 "ఎపిడమిక్ జీపు"ల నిర్వహణను కొనసాగించటానికి, రు, 0.83 లక్ష హైదరాబాదులోని హెల్త్ మ్యూజియంలో ఒక విభాగం

యొక్క నిర్మాణం మొదలు పెట్టటానికి, రు. 0.72 లక్ష, 16 మిల్లీమీటర్ల సౌండు ప్రొజెక్టర్లు కలిగి ఉండే రెండు ప్రచార వ్యానులను కొనడానికిగాను వినియోగించబడుతుంది. ఇందులో రు. 1.19 లక్షల మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది. 16 మిల్లీమీటర్ల సౌండు ప్రొజెక్టరు ఉండే ఒక ప్రచార వ్యాను కొనటానికి, హైదరాబాదులోని హెల్త్ మ్యూజియంలో ఒక విభాగం యొక్క నిర్మాణము ప్రారంభించటానికి పై మొత్తం వినియోగించబడుతుంది.

### *50 మంది హెల్త్ అసిస్టెంట్లను నియమించటం*

తెలంగాణా జిల్లాలలో టీకాలు వేసే కార్యక్రమానికిగాను నియమించబడిన హెల్త్ అసిస్టెంట్ల సంఖ్య చాలినంతగా లేదు. ఇందువల్ల యీ సంవత్సరంలో అదనంగా 50 మంది హెల్త్ అసిస్టెంట్లను నియమించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు రు. 0.82 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో 5 గురు హెల్త్ అసిస్టెంట్లు ఈ జిల్లాలో నియమించబడతారు. ఇందుకు రు. 0.082 లక్ష వ్యయమవుతుంది.

### *లీవ్ రిజర్వు హెల్త్ ఇనస్పెక్టరు పదవులను ఏర్పాటు చేయటం*

ప్రస్తుతం ఆంధ్రప్రాంతంలో 79 మంది రిజర్వు హెల్త్ ఇనస్పెక్టర్లు పనిచేస్తుండగా తెలంగాణాలో 25 మంది మాత్రం పనిచేస్తున్నారు. అంటు వ్యాధులు ప్రబలినప్పుడు, ప్రస్తుతం పనిచేస్తున్నవారు సెలవులో ఉండినప్పుడు పనిచేసేటందుకు ఈ సిబ్బంది తగినంతగాలేదు. ఈ కారణంగా 1959—60 లో తెలంగాణా ప్రాంతంలో ఇంకా 50 లీవు రిజర్వు హెల్త్ ఇనస్పెక్టర్ల పదవులను ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.08 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.108 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. ఈ మొత్తంతో 5 హెల్త్ ఇనస్పెక్టర్ల పదవులు ఏర్పాటు చేయబడుతాయి.

### *పట్టణాల్లో నీటి సరఫరా, మురుగు పారుదల పథకాలు*

స్థానిక సంస్థలకు సంబంధించిన పట్టణ నీటి సరఫరా, మురుగు పారుదల పథకాలు అమలు జరుపుటకుగాను అయ్యే వ్యయం క్రింద ఈ సంవత్స

రంలో భారత ప్రభుత్వం వారు రు. 102.446 లక్షల మొత్తం (రు. 82.446 లక్షలు కేంద్ర ప్రణాళిక క్రింద, రు. 20.00 లక్షలు రాజ్య ప్రణాళిక క్రింద) ఋణ సహాయంగా ఇస్తారని ఆశించబడుతున్నది. ఇందులో రు. 41.270 లక్షల మొత్తం కార్పొరేషను పథకాలకుగాను ప్రత్యేకించ బడింది. అది క్రింది విధంగా వినియోగించబడుతుంది.

| | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూపాయలు, లక్షలలో) |
|---|---|---|
| 1. | హైదరాబాదు మురుగు పారుదల పథకం | 11.000 |
| 2. | హైదరాబాదు వాటరు వర్క్సు రీమోడలింగు | 20.000 |
| 3. | సికిందరాబాదు నీటి సరఫరా అభివృద్ధి పనులు | 10.270 |
| | మొత్తం | 41.270 |

## గ్రామీణ నీటి సరఫరా, పారిశుధ్యం పథకాలు

గ్రామీణ ప్రజలకు మంచినీటి సరఫరా, పారిశుధ్యం సౌకర్యాలను కలిగించటమే ఈ పథకం యొక్క ఉద్దేశ్యం. ఈ పథకం క్రింద ఈ సంవత్స రపు ప్రణాళికలో రు. 13.28 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.80 లక్ష మొత్తం సిబ్బంది ఖర్చు క్రింద వినియోగించ బడుతుంది. మిగత రు. 12 48 లక్షల మొత్తం, 1957 మార్చిలో ప్రారం భించబడిన రెండు యూనిట్లను – అంటే, హైదరాబాదు జిల్లాలోని కర్జేవను యూనిట్టును, మహబూబునగరు జిల్లాలోని గద్వాల యూనిట్టును, 1958–59 లో ఆదిలాబాదు జిల్లాలో ప్రారంభించబడిన ఉట్నూరు యూనిట్టును కొనసాగించటానికి వినియోగించబడుతుంది. పైన పేర్కొన్న రు. 12.48 లక్షలు క్రింది విధంగా పై మూడు యూనిట్లకు కేటాయించ బడింది.

| | | (కేటాయించబడిన మొత్తం-రూపాయలు, లక్షలలో) |
|---|---|---|
| 1. | కర్నేదను యూనిట్టు | 1.50 |
| 2. | గద్వాల యూనిట్టు | 3.00 |
| 3. | ఉట్నూరు యూనిట్టు | 7.98 |
| | మొత్తం | 12.48 |

# గృహ నిర్మాణం

## *మురికి పేటల నిర్మూలన; పాకీవారికి ఇళ్ళు*

హైదరాబాదు సిటీ ఇంప్రూవ్‌మెంటు బోర్డువారిచే యాకుత్‌పుర, దోమలగూడ ప్రాంతాల్లో మురికి పేటలు నిర్మూలించటానికి నివేశన స్థలాలను అభివృద్ధి చేసి గృహాలను నిర్మించటానికి ఈ పథకం క్రింద ఉద్దేశించబడింది. 1957-59 లో 140 నివేశన స్థలాలను అభివృద్ధి చేయటానికి, 204 ఇళ్ళ నిర్మాణానికి, మురికిపేటల నిర్మూలనకు గాను రు. 7.749 లక్షల మొత్తం ఖర్చు చేయబడింది నగరంలోని పై ప్రాంతాల్లో హైదరాబాదు సిటీ ఇంప్రూవ్‌మెంటు బోర్డువారు మురికిపేటల నిర్మూలన కార్యక్రమాన్ని కొనసాగించుటకు గాను రాజ్యప్రభుత్వం భరించవలసిన నాలుగోవంతువాటా క్రింద 1959-60 ప్రణాళికలో రు. 3.48 లక్షల మొత్తం కేటాయించబడింది.

## *పారిశ్రామిక గృహ నిర్మాణ పథకం*

ఈ పథకం క్రింద భారత ప్రభుత్వంవారు చేసే ఆర్థిక సహాయంతో పారిశ్రామిక కార్మికులకు గృహవసతిని కలిగించేటందుకు గాను హైదరాబాదు నగరంలోని చిక్కడపల్లి, సీతాఫలమండి, అంబరుపేట కాలనీలలోను, వరంగల్లు, ఖమ్మం, నిజామాబాదు పట్టణాలలోను ఒక గది ఇళ్లు, రెండు గదుల ఇళ్ళు నిర్మించబడుతున్నాయి. పైన పేర్కొన్న స్థలాలలో పారిశ్రామిక కార్మికులకు గాను 665 ఇళ్లు నిర్మించే నిమిత్తం 1959-60

పణాళికలో రు. 17.65 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 8.34 లక్షల మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## తక్కువ ఆదాయంగల వర్గాలవారికి గృహ నిర్మాణం
## ప్రభుత్వ రంగం

దేశంలో నివాస గృహాల కొరతను తీర్చే ఉద్దేశంతో భారత ప్రభుత్వం వారు తక్కువ ఆదాయం గల వర్గాలవారి గృహాలను నిర్మించే ఈ పథకాన్ని ప్రారంభించారు. ఈ పథకం క్రింద నూటికి 80 వంతుల ఖర్చు ఋణ రూపంలో కేంద్ర ప్రభుత్వం ఇవ్వగా మిగత 20 వంతుల ఖర్చు రాజ్య ప్రభుత్వం భరిస్తుంది. హైదరాబాదు సిటీ ఇంప్రూవ్‌మెంటు బోర్డువారు, సికిందరాబాదు టౌను ఇంప్రూవ్‌మెంటు ట్రస్టువారు, జిల్లా మునిసిపాలిటీలు 267 ఇళ్ళను నిర్మించేటందుకు గాను ఈ సంవత్సరంలో రు. 20.95 లక్షల మొత్తం కేటాయించబడింది. జిల్లాల వారిగా కేటాయించవలసిన డబ్బు విషయమై ఇంకా తుది నిర్ణయం తీసికోబడలేదు.

## మునిసిపలు రంగం

ఈ పథకం క్రింద తక్కువ ఆదాయం గల వర్గాలవారికి ఇళ్ళు నిర్మించటంకోసం మునిసిపాలిటీలకు ఋణాలు ఇవ్వబడతాయి. 170 ఇళ్ళ నిర్మాణంకోసం 1959-60 ప్రణాళికలో రు. 4.00 లక్షల మొత్తం కేటాయించబడింది. పై మొత్తం క్రింద చూపిన విధంగా ఋణాలుగా ఇవ్వబడుతుంది.

| | | రూపాయలు లక్షలలో |
|---|---|---|
| మునిసిపాలిటీలు | ... | 2.00 |
| హైదరాబాదు మునిసిపలు కార్పొరేషను | ... | 1.00 |
| సికిందరాబాదు మునిసిపలు కార్పొరేషను | ... | 1.00 |
| మొత్తం | ... | 4.00 |

### సహకార రంగం

ఈ పథకం క్రింద తెలంగాణా ప్రాంతంలోని సహకార గృహ నిర్మాణ సంఘాల సభ్యులకు, అందును ముఖ్యంగా హైదరాబాదు, సికిందరాబాదు జంట నగరాల్లోని సభ్యులకు క్రొత్త ఇళ్ళను కట్టుకొనేటందుకు గాను దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వబడతాయి. ఈ సంవత్సరంలో 340 గృహాల నిర్మాణం నిమిత్తం ఋణాలు ఇచ్చేటందుకు గాను రు. 20.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 12.96 లక్షల మొత్తం ఈ జిల్లాలో 220 ఇళ్ళ నిర్మాణం నిమిత్తం ప్రత్యేకించబడింది.

## కార్మికులు-కార్మిక సంక్షేమం

### ఉద్యోగ సమాచార సేకరణ

ఈ పథకం యొక్క లక్ష్యా లేవంటే :—

1. ఏ తరగతి వారు తక్కువగా ఉన్నారో సరిగా నిర్ణయించేటందుకు వీలుగా ఎంప్లాయిమెంటు ఆఫీసర్లకు ఇంకా ఎక్కువ వివరాలను అందచేయటం ;

2. ఉద్యోగాల్లో చేరగోరేటటువంటి విద్యాభ్యాసం పూర్తి చేసిన యువకులకు, ఇతరులకు ఉద్యోగాలను గురించి, ఉద్యోగావకాశాలను గురించి, సలహాలు ఇవ్వటానికి సమాచారం అందచేయటం ;

3. ఏ దేని ఉద్యోగసాధక కేంద్ర ప్రాంతంలో కాని లేక ఉద్యోగ అవకాశాలను నిర్ణయించటానికి నిర్ణయింపబడిన ఏదేని ప్రత్యేక ప్రాంతములో కాని ఉద్యోగాలకు సంబంధించి వచ్చేమార్పులను తెలిసికొనడానికి ఒక విధానాన్ని రూపొందించటం;

4. ప్రతి పరిశ్రమలోను, వృత్తిలోను సంభవించే ఉద్యోగ, నిరుద్యోగ విషయాలను గురించి ముందుగానే సూచించటం.

హైదరాబాదు, వరంగల్లు, విశాఖపట్టణం, విజయవాడ, కర్నూలులలోని ప్రధాన ఉద్యోగ సాధక కేంద్రాలలో ఈ పథకం 1957—58 లో అమలుజరుపబడింది. వీటికి సంబంధించిన కేంద్ర యూనిట్టు హైదరాబా

లోని జాతీయ ఉద్యోగ సేవా కేంద్ర డైరెక్టరేటులో ఏర్పాటు చేయబడింది. కాకినాడ, గుంటూరు, నిజామాబాదులలోని జిల్లా ఉద్యోగ సాధక కేంద్రాలకు ఈ పథకం 1958–59 లో విస్తరింప చేయటం జరిగింది. విశాఖపట్టణం, విజయవాడ, కాకినాడ, గుంటూరు, వరంగల్లులలో ప్రయివేటురంగాన్ని గురించి 1959–60 లో పరిశీలించేటందుకు ప్రతిపాదింపబడింది. ఇందుకు గాను జాతీయ ఉద్యోగసేవా కేంద్రం డైరెక్టరేటులో కేంద్ర యూనిట్టు ఒక సీనియరు ఆఫీసరు పర్యవేక్షణలోకి తీసుకరాబడి పటిష్ఠం చే య బ డు తు ం ది. పైన పేర్కొన్న సాధక కేంద్రాలలో కూడ అదనపు సిబ్బంది నియమించబడుతుంది. మిగత సాధక కేంద్రాలు ప్రతిదానిలో కూడ ఒక గుమాస్తాను నియమించటంద్వారా వాటిని పటిష్ఠం చేయటానికి ప్రతిపాదంపబడింది. పథకాన్ని అమలు పరచుటకు గాను అయ్యే ఖర్చులో రాజ్యప్రభుత్వ వాటా క్రింద 1959–60 ప్రణాళికలో రు. 0.31 లక్ష మొత్తం కేటాయించబడింది. కేంద్రప్రభుత్వం కూడ రు. 0.47 లక్ష మొత్తం భరిస్తుంది. కే టా యి ం చ బ డి న మొత్తం రు. 0.78 ల క్ష లో రు. 0.31 లక్ష మొత్తం జిల్లాకు సంబంధించిన కార్యక్రమమునకు గాను, వినియోగించబడుతుంది. హైదరాబాదులోని రాజ్య డైరెక్టరేటును పటిష్ఠంచేయుటానికి అయ్యే ఖర్చుపై మొత్తంలో చేర్చబడింది.

## *వృత్తులకు సంబంధించిన విషయాలను గురించి పరిశోధన, వివరణ.*

వృత్తి విషయాలను గురించి సలహాలిచ్చేటందుకు వృత్తులను వర్గీకరించి వృత్తులకు సంబంధించిన ఇతర సమాచారంతో కూడిన నిఘంటువు లవసరం. అట్టి నిఘంటువును సంకలనం చేయటానికి డైరెక్టరేటు జనరలు ఆఫ్ రిసెటులుమెంటు అండు ఎంప్లాయిమెంటు కార్యాలయంలో ఒక కేంద్ర యూనిట్టు ఏర్పాటు చేయబడింది. ఆ కేంద్ర యూనిట్టు యొక్క ఆదేశాలను అనుసరించి రాజ్యంలోని వివిధ వృత్తుల పేర్లను వృత్తి వివరాలను సేకరించేటందుకు 1956–57 లో ఒక వృత్తుల పరిశీలక యూనిట్టు హైదరాబాదులో స్థాపించబడింది. 1957–58, 1958–59 సంవత్సరాలలో అది కొనసాగించబడింది. “శిక్షణ సౌకర్యాలు” అనే ఈ రాజ్యానికి

సంబంధించిన పుస్తకాలు తయారు చేసే పని కూడ 1958–59లో ఈ యూనిటుకు అప్పగించబడింది. 1959–60 లో కూడ ఈ యూనిటును కొనసాగించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు అయ్యే ఖర్చులో రాజ్య ప్రభుత్వ వాటా క్రింద రు. 0.03 లక్ష మొత్తం కేటాయించబడింది.

## ఉద్యోగుల రాజ్య భీమా పథకం

కార్మికులకు మాత్రం వైద్య సౌకర్యాలను కలిగించే ఉద్దేశంతో ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో ఈ పథకం 1955 లో అమలు జరపబడింది. భారత ప్రభుత్వంవారి ప్రోత్సాహంతో 1957–58 లో ఈ పథకం క్రింది సౌకర్యాలను భీమా చేసిన కార్మికుల కుటుంబాలకు కూడ విస్తరింప చేయటానికి ప్రతిపాదింపబడింది. అయితే ఆ సంవత్సరంలో ఈ పథకాన్ని అమలు పరచటానికి వీలులేక పోయింది. ఈ పథకం క్రింది వైద్య సౌకర్యాలు రాజ్యంలో భీమా చేసిన కార్మికుల కుటుంబాలకు 26–1–1959 తేదీ నుండి విస్తరింప చేయబడినాయి. నియమిత వేళలో మాత్రం పని చేసే వైద్యాలయాలు చాలమటుకు పూర్తి కాలపు వైద్యాలయాలుగా మార్చబడినాయి. ఈ పథకం క్రింద రు. 1.80 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.60 లక్ష, భీమా చేసిన వారి కుంటుంబాలకు వైద్య సౌకర్యాలను విస్తరింప చేసే నిమిత్తం పూర్తికాలపు వైద్యాలయాలను ఏర్పాటు చేయటానికి, నియమిత వేళలో మాత్రం పనిచేసే వాటిని పూర్తికాలపు వైద్యాలయాలుగా మార్చటానికి గాను ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## హైదరాబాదులోని ప్రాంతీయ ఉద్యోగ సాధక కేంద్రం స్థాయిని పెంచటం

దేశంలో ప్రధాన ఉద్యోగ సాధక కేంద్రాలలో ఒకటయిన హైదరాబాదు కేంద్రంలో తగినంత సిబ్బందిలేదు. ఇందువల్ల 1958–59 లో రీజినల్ ఎప్లాయిమెంటు ఆఫీసరుకు సహాయంచేయటం కోసం ఒక అసిస్టెంటు ఎంప్లాయిమెంటు ఆఫీసరును, ఒక అప్పరు డివిజను గుమాస్తాను, నికి లోయరు డివిజను గుమాస్తాను, ఒక గైడును, ఒక జవానును నియ.64 టానికి ప్రతిపాదింపబడింది. అయితే ఒక లోయరు డివిజను గుమాలోని ఒక జవానును మాత్రం నియమించటం జరిగింది. 1958–59 లో నియ వివి బడిన సిబ్బంది—అంటే ఒక లోయరు డివిజను గుమాస్తాను, ఒక

కొనసాగించటం కోసం అయ్యే ఖర్చులో రాజ్య ప్రభుత్వవాటా క్రింద ఈ సంవత్సరంలో రు. 0.01 లక్ష మొత్తం కేటాయించబడింది.

## యూత్ ఎంప్లాయిమెంటు సర్వీసు, ఎంప్లాయిమెంటు కౌన్సిలింగు పథకం.

ప్రతివ్యక్తి తన అభిరుచులకు, దేహదార్ఢ్యానికి, విద్యార్హతలు మొదలయిన వాటికి అనువుగా ఉన్న ఉద్యోగంలో చేరటానికి సహాయపడేటందుకు జాతీయ మానవ సంపదనంతటిని పూర్తిగా వినియోగించటానికి గాను ఈ పథకం క్రింద 1957—58 లో హైదరాబాదులోని ప్రాంతీయ ఉద్యోగసాధక కేంద్రంలో వృత్తి విషయాలలో సలహానిచ్చే యూనిట్టు ఒకటి ఏర్పాటు చేయబడింది. ఈ యూనిట్టు 1958—59 లో కొనసాగించబడింది. 1959-60లో కొనసాగించబడుతుంది. ఇందుకయ్యే ఖర్చులో రాజ్య ప్రభుత్వ వాటా క్రింద ప్రణాళికలో రు. 0 05 లక్ష కేటాయించబడింది.

## కార్మిక సంక్షేమ కేంద్రాలు

కార్మిక వర్గాలకు చెందిన స్త్రీ, పురుషులకు, పిల్లలకు వినోద సౌకర్యాలు కలిగించే ఉద్దేశంతో తెలంగాణా ప్రాంతంలో 2 "ఎ" తరగతి సంక్షేమ కేంద్రాలు 3 'బి' తరగతి సంక్షేమ కేంద్రాలు 1958—59 లో అద్దె భవనాల్లో ఏర్పాటు చేయబడినాయి. ఈ కేంద్రాలకు వరంగల్లులో మినహా ఇతర ప్రదేశాలలో 1958—59 సం॥ లోనే శాశ్వత భవనాలు కూడ నిర్మించబడినాయి. ఈ సంవత్సరంలో ఇంతకుముందు ఏర్పాటు చేసిన కేంద్రాలను కొనసాగించటమేగాక మరో 2 "బి" తరగతి కేంద్రాలను ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. ఈపథకంకోసం రు. 3.41 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.60 లక్షల మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ డబ్బుతో హైదరాబాదులోని ముషీరాబాదులోను, సనత్‌నగర్‌లోను ఆజమాబాదు లోను ఏర్పాటు చేయబడిన 3 కేంద్రాలను (ఒక "ఎ" తరగతి కేంద్రం, రెండు "బి" తరగతి కేంద్రాలు) కొనసాగించటం, సీతాఫలమండిలో ఒక "బి" తరగతి కేంద్రాన్ని ఏర్పాటు చేయటం, దానికి శాశ్వత భవనాలను నిర్మించటం జరుగుతుంది.

## కార్మిక విద్య

తెలంగాణా ప్రాంతంలో 500 మందికంటె తక్కువగా కార్మికులను నియమించే ఫ్యాక్టరీలలో పూర్తికాలపు ఉపాధ్యాయులను నియమించటం ద్వారా 1957-58, 1958-59 లలో 10 కార్మిక విద్యా తరగతులు ఏర్పాటు చేయబడినాయి. ఈ సంవత్సరంలో ఈ తరగతులు కొనసాగించబడతాయి. ఇంతేకాక మరో 4 తరగతులు ప్రారంభించబడతాయి. హైదరాబాదు, సికిందరాబాదులలోని ఫ్యాక్టరీలలో ప్రస్తుతమున్న 7 తరగతులను కొనసాగించటానికి, క్రొత్తగా మరో 4 తరగతులను ఏర్పాటు చేయటానికి గాను ఈ జిల్లాకు రు. 0.144 లక్ష మొత్తం కేటాయించబడింది.

## గ్రంథాలయాల ఏర్పాటు

తెలంగాణా ప్రాంతంలోని ఫ్యాక్టరీలలో 1959-60 లో 15 గ్రంథాలయాలను ఏర్పాటు చేయటంకోసం ఈ పథకం క్రింద రు. 0.03 లక్ష మొత్తం కేటాయించబడింది. ఎన్నిక చేయబడిన ఫ్యాక్టరీలలో 11 గ్రంథాలయాలను ఏర్పాటు చేయటంకోసం పై మొత్తంలో రు. 0.22 లక్ష మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## కార్మికశాఖ విస్తరణ

రెండవ ప్రణాళికా కాలంలో ఎక్కువయిన కార్యకలాపాల దృష్ట్యా కార్మికశాఖలో అదనపు సిబ్బందిని నియమించటం అవసరమయింది. 1957-58 లో 10 మంది అసిస్టెంటు లేబరు ఇనస్పెక్టర్లు, ఒక సంక్షేమ కేంద్రాల సూపరింటెండెంటు ఇతర సిబ్బంది నియమించబడినారు. 1958-59 లో మంజూరు చేయబడిన నాలుగు అసిస్టెంటు లేబరు ఇనస్పెక్టరు పదవులకుగాను రెండు పదవులు మాత్రం భర్తీ చేయబడినవి. 1959-60 లో పై సిబ్బంది కొనసాగించబడుతుంది. అంతేకాక 10 మంది అసిస్టెంటు లేబరు ఇనస్పెక్టర్లను, అవసరమయిన ఇతర సిబ్బందిని నియమించటం జరుగుతుంది. ఒక జీపు స్టేషను వాగనును కొని డ్రైవరును నియమించటానికి కూడ ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959-60 ప్రణాళికలో రు. 1.64 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో కొంత మొత్తం ఈ జిల్లాలోని ఇద్దరు లేబరు ఇనస్పెక్టర్లను, వారి సిబ్బందిని కొనసాగించటానికిగాను వినియోగించబడుతుంది.

## పారిశ్రామిక భద్రత, ఉత్పత్తి విషయక సంస్థ

పారిశ్రామిక సంస్థల్లో తీసికోవలసిన భద్రతా చర్యలను గురించి, ఆరోగ్యాన్ని గురించి, కార్మిక సంక్షేమాన్ని గురించి కార్మికులకు విద్య గరపటానికిగాను 1957-58 లో పారిశ్రామిక భద్రత ఉత్పత్తి విషయక సంస్థను హైదరాబాదులో ఏర్పాటుచేయుటకు ప్రతిపాదింపబడింది. పారిశ్రామిక సంస్థలను ఆరోగ్యకరమైన పంసరాల్లో పరిశుభ్రంగా నిర్వహించే విషయాలను గురించి పరిశ్రమలో కలిగే అపాయాలను అరికట్టేటందుకు తీసుకోవలసిన చర్యలను గురించి ఈ సంస్థలో పరిశోధనలు జరుపబడతాయి. ఈ సంస్థకు ఒక వ్యాను, రాజ్యంలోని వివిధ పారిశ్రామిక కేంద్రాల్లో కార్మికులకుపయోగకరంగా ఉండే ఫిల్ములను ప్రదర్శించటానికిగాను ప్రొజెక్టరు సమకూర్చబడతాయి. ఈ సంస్థ స్థాపనకోసం లక్ష రూపాయలు కేటాయించబడినవి. అయితే ఆ మొత్తం సరిపోనందున 1957-58 లో ఈ పథకం అమలు పరచబడలేదు.

ఇందువల్ల ఈ పథకంకోసం అయ్యే ఖర్చులో కొంత భాగాన్ని పారిశ్రామికులనుండి చందాలరూపంలో వసూలుచేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ఒక సంఘం ఏర్పాటు చేయబడింది. ఫ్యాక్టరీల చీఫ్ ఇనస్పెక్టర్ ఈ సంఘానికి కార్యదర్శిగా నియమించబడినారు. ఈ విషయంలో అవసరమయిన చర్య ఈయన తీసికొంటున్నారు. ఈ పథకానికిగాను 1959-60 ప్రణాళికలో రు. 0.50 లక్ష మొత్తం కేటాయించబడింది.

## సెంట్రల్ క్రాఫ్ట్ ఇనిస్టిట్యూట్, హైదరాబాదు

## వృత్తిపనివారికి శిక్షణ సౌకర్యాలను విస్తరింపచేయటం

1957-58 సంవత్సరానికి ముందు ఈ సంస్థలో 112 మందిని మాత్రం చేర్చుకోవటానికి వీలుండేది. 1957-58 లో "డబుల్ షిఫ్టు" విధానం ప్రవేశపెట్టడం ద్వారా అదనంగా ఇంకా 112 మందిని చేర్చుకోవడానికి వీలు కల్పించబడింది. 1959-60 లో అదనపు భవనాలను, పరికరాలను సమకూర్చటంద్వారా ఇంకా 100 మందిని చేర్చుకొనేటందుకు వీలు కల్పించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను రాజ్య ప్రభుత్వ వాటా క్రింద ప్రణాళికలో రు. 2.71 లక్షల మొత్తం కేటాయించబడింది. కేంద్ర ప్రభుత్వం భరించే వాటా మొత్తం రు. 4.08 లక్షలు. ఈ పథకం క్రింద చేయ

బడిన మొత్తం కేటాయింపు రు. 6.79 లక్షలు ఈ క్రింది విధంగా ఖర్చుపెట్ట టానికి ప్రతిపాదింపబడింది.

| | మొత్తం (రూపాయలు, లక్షలలో) |
|---|---|
| భవనాల నిర్మాణం | 2 25 |
| పరికరాల ఖరీదు | 3.19 |
| సిబ్బంది జీత భత్యాలక్రింద, చిల్లర ఖర్చులక్రింద | 1.35 |
| మొత్తం | 6.79 |

### "అప్రెంటిస్" శిక్షణ పథకం

ఈ సంవత్సరంలో హైదరాబాదులోని ప్రాగాటూల్స్ కార్పొరేషనులో "అప్రెంటిస్" శిక్షణ కార్యక్రమాన్ని అమలు జరపటానికి, 62 మంది అభ్యర్థులను చేర్చుకోవటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను రు. 0.55 లక్ష మొత్తం (రాజ్య ప్రభుత్వం వాటా ఇందులో రు. 0.22 లక్ష మాత్రమే) కేటాయించబడింది. సిబ్బంది జీతాలు, శిక్షణపొందే వారికి స్టయిపెండులు, పరిశ్రమకు తిరిగి చెల్లించవలసిన డబ్బుకుగాను పై మొత్తం విని యోగించబడుతుంది.

### "హాబి" శిక్షణ పథకం

తీరిక సమయాల్లో చేతిపనులు చేయటంలో ఆసక్తి కలిగించే నిమిత్తం ఈ పథకం క్రింద "హాబి" శిక్షణను ప్రారంభించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను హైదరాబాదులోని పారిశ్రామిక శిక్షణ సంస్థలో 50 మంది అభ్యర్థులు చేర్చుకోబడతారు. ఈ పథకానికి అయ్యే ఖర్చులో రాజ్యప్రభుత్వ వాటాక్రింద రు. 0.06 లక్ష మొత్తం కేటాయించబడింది.

### ప్రభుత్వ సాంకేతిక కళాశాల, హైదరాబాదు

హైదరాబాదు సాంకేతిక కళాశాల (ఇప్పుడు యిది గవర్నమెంటు పాలిటెక్నిక్, హైదరాబాదు అని పిలువబడుతున్నది) లో ఏర్పాటు చేయబడిన ఓవర్సీర్, ట్రేడ్ కోర్సు డ్రాఫ్ట్సమన్ (సివిల్), సర్వేయరు కోర్సుగా

1958–59 లో మార్చబడింది. ఈ సంవత్సరంలో రు. 48 లక్ష వ్యయంతో ఇది కొనసాగించబడుతుంది. ఇందులో రాజ్య ప్రభుత్వ వాటా క్రింద రు. 0.19 లక్ష మొత్తం ప్రణాళికలో కేటాయించబడింది.

### చేతిపనుల ఉపాధ్యాయులకు శిక్షణ

శిక్షణ పొందిన చేతిపనుల ఉపాధ్యాయుల కొరతను తీర్చేటందుకై ప్రణాళికలో చేర్చబడిన క్రొత్త పథకం యిది. పారిశ్రామిక శిక్షణ సంస్థల నుండి ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణులయిన అభ్యర్థులకు ఈ పథకం క్రింద "ఇంటెన్సివ్ ఇండస్ట్రియల్ కోర్సు"లో శిక్షణ ఇవ్వబడుతుంది. దీనితరువాత కోని–బిలాస్‌పూరులో "ఇనస్ట్రక్టర్ల" శిక్షణ ఇవ్వబడుతుంది. 1959–60 లో 14 మందికి శిక్షణ ఇవ్వటానికి ప్రతిపాదింపబడింది ఇందుకుగాను అయ్యే ఖర్చులో రాజ్య ప్రభుత్వ వాటాక్రింద రు. 0.06 లక్ష, కేంద్ర ప్రభుత్వ వాటాక్రింద రు. 0.08 లక్ష కేటాయించబడినాయి

## వెనుకబడిన తరగతుల, షెడ్యూల్డు కులాల సంక్షేమం

### షెడ్యూల్డు కులాలు

### మంచినీటి బావులు

హరిజనులు నివసించే వాడలలో మంచినీటి సదుపాయాలు చాలా అరుదుగా ఉంటాయి. ఇందువల్ల ఈ జిల్లాలో 20 క్రొత్త బావులను త్రవ్వటానికిగాను రు. 0.16 లక్ష, 25 పాతబావులను మరమ్మతు చేయటానికిగాను రు. 0.05 లక్ష కేటాయించబడినాయి.

### గృహనిర్మాణం

ఆర్థికంగాను, సాంఘికంగాను హరిజనులు వెనుకబడిఉన్న కారణంగా వారు ఇళ్ళను స్వంతంగా కట్టుకొనే స్థితిలో లేరు. వారు ఇళ్ళు కట్టుకొనేటందుకు ఇంటికి రు. 320/– లు చొప్పున సబ్సిడీ ఇవ్వటానికి ప్రతిపాదింపబడింది. సాధారణంగా నివేశన స్థలాలు కలిగి ఉండి ఇళ్ళు కట్టదలిచే హరిజనులకే సబ్సిడీలు ఇవ్వబడతాయి. తగిన సందర్భాల్లో నివేశన స్థలాలు కూడ ఉచితంగా ఇవ్వబడతాయి. ఈ జిల్లాలో నివేశన స్థలాలకోసం భూమిని

స్వాధీనం చేసికోవటానికి రు. 0.452 లక్ష, 5 ఇళ్ళను కట్టే నిమిత్తం రు. 0.163 లక్ష 1959–60 ప్రణాళికలో కేటాయించబడినాయి.

## విద్య

హరిజనులు చదువుకొనేటందుకు సహాయం చేసే నిమిత్తం సాంఘిక సేవకులు స్వచ్ఛంద సంస్థలు కొన్ని ప్రయివేటు హాస్టళ్ళు నిర్వహించు చున్నారు. ఈ సంస్థలను ప్రోత్సాహపరిచేటందుకు వాటికి సబ్సిడీలను ఇవ్వ టానికి ప్రతిపాదింపబడింది ఒక్కొక్క బోర్డరుకు విద్యా సంవత్సరానికి రు. 150/– లు చొప్పున సబ్సిడీ ఇవ్వబడుతుంది. రు. 1.64 లక్షల మొత్తం వ్యయంతో హరిజనులకు ఇంకా 1,093 బోర్డింగు గ్రాంటులను 1959-60 లో ఇవ్వటానికి ప్రతిపాదింపబడింది. ఈ జిల్లాలోని హరిజన విద్యార్థులు కూడ ఈ పథకంవల్ల లాభం పొందుతారు

దుస్తులు, పుస్తకాలు, పలకలు, విద్యావిషయిక పరికరాలు మొదలైనవి అర్హులైన బీద హరిజన విద్యార్థులకు సరఫరా చేయబడతాయి. ఇంతేకాక ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత పాఠశాలలో చదివే విద్యార్థులకు ఒక్కొక్కరికి నెలకు రు. 5/– లు లేక రు. 7/–లు చొప్పున స్కాలరు షిప్పులు కూడ ఇవ్వబడతాయి. ఈ సంవత్సరంలో ఈ జిల్లాలోని 350 మంది విద్యార్థుల ప్రయోజనం నిమిత్తం రు. 0.042 లక్ష మొత్తం కేటాయించ బడింది. హరిజనులకోసం నిర్వహించబడే గ్రంథాలయాలకు కూడ యీ పథకం క్రింద చేయబడిన కేటాయింపులోనుండి అర్థిక సహాయం చేయబడు తుంది.

## వైద్యసహాయం

క్షయ, కాన్సరు మొదలయినటువంటి ప్రమాద భరితమైన వ్యాధులతో బాధపడుతున్న హరిజనులు చికిత్సపొందే నిమిత్తం ఆర్థిక సహాయం చేయటానికి ఈ పథకం క్రిద ఉద్దేశించబడింది. ఒక్కొక్క రోగికి రు. 100/- లు మొదలు కొని రు. 200/– లు వరకు ఇట్టి సహాయం చేయబడుతుంది. 250 మంది రోగులకు ఆర్థిక సహాయం చేయటం కోసం 1959–60 సం. లో రు. 0.25 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.03 లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది. 30 మంది రోగులకు గాను ఈ డబ్బు వినియోగించ బడుతుంది.

## కుటీర పరిశ్రమలు

చేతి పనులను చేసుకొనే పనివారికి తమవ్యాపారానికి లేక చేతిపనికి సహాయం చేయటానికి ఈ పథకం ఉద్దేశించబడింది. ఈ పనివారు వ్యక్తి గతంగా గాని సహకార సంఘాల ద్వారాగాని, ఈ సహాయాన్ని పొంద వచ్చును. పరికరాల సమకూర్చుకోవడానికి, ముడి సామగ్రిని కొనుక్కోవ డానికి, నిర్వహణ మూలధనానికి ఈ సహాయం ఇవ్వబడుతుంది. 1959-60 లో 33 సంఘాలకు రు. 0.33 లక్ష మేరకు సహాయం చేయటానికి ప్రతిపా దింపబడింది. ఇందులో ఈ జిల్లాలోని 3 సంఘాలకు రు. 0.03 లక్ష మేరకు సహాయం చేయబడుతుంది.

## ప్రచారం

అస్పృశ్యతను పాటించడం వలన కలిగే హానిని గురించి వివరించే టందుకు అస్పృశ్యతను నిర్మూలించేటందుకు ప్రచారం చేసేనిమిత్తం గ్రామీణ ప్రాంతాల్లో ఫిల్ములు స్లయిడును ప్రదర్శించటానికి కరపత్రాలు జారీ చేయటానికి, అంతర్వర్ణ భోజనాలు ఏర్పాటు చేయటానికి, హరిజన దినోత్సవాలు, మేలాలు జరపటానికి గాను 1959—60 ప్రణాళికలో రు 0 17 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలో కూడ ప్రచార కార్యక్రమం నిర్వహించబడుతుంది.

## స్వచ్ఛంద సంస్థలకు ఆర్థిక సహాయం (గ్రాంటు-ఇన్-ఎయిడ్)

హరిజన సేవక సంఘము, భారతసేవక సమాజము, ఆది హిందూ లీగు మొదలయినటువంటి స్వచ్ఛంద సంస్థలు అస్పృశ్యత నివారణకోసం మంచి కృషి చేస్తున్నాయి. ఈ సంస్థల ద్వారా మంచి ప్రచారం కొనసా గించే నిమిత్తం వీటికి రు. 0.127 లక్ష దాకా 1959—60 లో ఆర్థిక సహాయం చేయటానికి ప్రతిపాదింపబడింది. ఈ జిల్లాలోని స్వచ్ఛంద సంస్థలకు కూడ ఈ పథకం క్రింద లాభం చేకూరుతుంది.

## లీగల్ ఎయిడ్, గ్రాంటు ఇన్-ఎయిడ్

న్యాయ విషయాలలో సహాయం చేసేటందుకు లేక వరదలు, అగ్ని తదితర ప్రకృతి భీభత్సాలకు గురి అయిన వ్యక్తులకు సహాయం చేసే

నిమిత్తం 1959—60 లో రు. 0.16 లక్ష మొత్తం వినియోగించబడుతుంది. ఇందులో రు. 0.02 లక్ష మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఇందువల్ల 40 మంది ప్రయోజనం పొందుతారు.

## సామాజిక మందిరాల నిర్మాణం

హరిజనుల సాంఘిక సాంస్కృతిక, జీవనాన్ని మెరుగుపరచే ఉద్దేశంతో రెండు సామాజిక మందిరాలు నిర్మించటానికి 1959—60 లో రు. 0.02 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది.

## విముక్తజాతులు

### విద్య

విముక్తజాతులకు చెంది ఉన్నత, మాధ్యమిక, ప్రాథమిక పాఠశాలలలో విద్యను అభ్యశిస్తున్న విద్యార్థులకు వరుసగా రు. 7/—, రు. 5/— లు చొప్పున స్కాలరు షిప్పులు ఇవ్వటానికి ఈ పథకం క్రింద ప్రతిపాదింపబడింది. స్కాలరు షిప్పులు యివ్వటానికి గాను రు. 0.305 లక్ష, క్రొత్త పాఠశాలలను ప్రారంభించటానికి గాను రు. 0.02 లక్ష, హాస్టళ్ళకు సహాయం చేసే నిమిత్తం రు. 0.306 లక్ష ప్రణాళికలో 1959—60కి గాను కేటాయించబడినాయి. ఈ జిల్లాకు చెందిన విముక్తజాతుల విద్యార్థులకు, ఈ పథకం క్రింద లాభం చేకూరుతుంది. విముక్తజాతుల హాస్టళ్ళకు కూడ ఈ పథకం క్రింద ప్రయోజనం చేకూరుతుంది.

### వ్యవసాయం

బంజరీలను వ్యవసాయంలో స్థిరపరచాలంటే వారికి నాగళ్లు, విత్తనాలు, పరికరాలు మొదలయినవి సరఫరా చేయటం ద్వారా సహాయం చేయటం అవసరం. 1959—60 లో జిల్లాలోని 26 కుటుంబాలకు రు. 0.07 లక్ష వ్యయంతో 19 జతల కాడి ఎద్దులను, విత్తనాలను, పరికరాలను సరఫరా చేయటానికి ప్రతిపాదింపబడింది.

### కుటీర పరిశ్రమలు

విముక్తజాతుల వారు తమ కుటీర పరిశ్రమల్ని అభివృద్ధి పరచుకొనేటందుకు రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాలలో

ఈ పథకం క్రింద 14 సహకార సంఘాలు ఏర్పాటు చేయబడినాయి. ఈ చేతిపని వారి యొక్క ప్రయోజనం నిమిత్తం వర్తమాన సంవత్సరంలో అదనంగా 13 సహకార సంఘాలను ఏర్పాటు చేయటానికి ప్రణాళికలో రు 0.13 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ మొత్తంలో రు. 0.02 లక్ష వ్యయంతో రెండు సంఘాలు ఈ జిల్లాలో ఏర్పాటుచేయబడతాయి.

## ప్రజారోగ్యం

విముక్త జాతులవారికి మంచి నీటి బావులను త్రవ్వించి, పరిశుభ్రమైన నీరు సరఫరా చేయటం ఎంతైన అవసరం. ఇందువల్ల ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.01 లక్ష ఒక క్రొత్త బావిని త్రవ్వటానికి, ఒక పాత బావిని మరమ్మత్తు చేయటానికి గాను కేటాయించబడింది.

## ఇతర వెనుకబడిన తరగతులు

## విద్యా

(ఎ) స్కాలరుషిప్పుల మంజూరు :—

హరిజనులు, విముక్త జాతుల వారే కాక ఇతర వెనుకబడిన తరగతుల వారిలో కూడ చాల వెనకబడి, సహాయం అవసరమైనట్టి వారు చాల మంది ఉన్నారు. ఈ జాతులకు చెంది ప్రాథమిక, మాధ్యమిక, హెచ్. ఎస్. సి. తరగతులలో చదువు కొంటున్న విద్యార్థులకు రు. 5/—లు లేక 7/లు చొప్పున స్కాలరుషిప్పులు ప్రతి సంవత్సరం ఇవ్వబడుతున్నాయి. 1959-60 ప్రణాళికలో రు. 0.217 లక్ష మొత్తం ఈ జిల్లాలో 362 స్కాలరుషిప్పులు ఇవ్వటానికి గాను కేటాయించబడింది.

(బి) ప్రయివేటు హాస్టళ్ళకు సహాయం

సంక్షేమ కార్యక్రమంలో ఆసక్తి ఉన్న కొన్ని స్వచ్ఛంద సంస్థలు, వ్యక్తులు వెనుకబడిన తరగతుల వారి కోసం హాస్టళ్ళ నడపటానికి ముందుకు వస్తున్నారు. క్రొత్త హాస్టళ్ళను నడిపేటందుకు గాను వారికి ఆర్థిక సహాయం చేయబడుతుంది. ఇందుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.054 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందువల్ల 703 మంది బోర్డర్లకు లాభం చేకూరుతుందని ఆశించబడుతున్నది. ఈ జిల్లాకు చెందిన స్వచ్ఛంద సంస్థలకు, వ్యక్తులకు కూడ ఈ పథకం క్రింద లాభం చేకూరుతుంది.

(సి) క్రొత్త హాస్టళ్ళను ప్రారంభించటం.

విద్యా సంస్థలకు అనుబంధించబడి ఉన్న హాస్టళ్లు వెనుకబడిన తరగతుల విద్యార్థుల అవసరాలను పూర్తిగా తీర్చలేక పోతున్నందువల్ల తెలంగాణా ప్రాంతంలో తగిన ప్రదేశాల్లో కొన్ని ప్రభుత్వ హాస్టళ్ళను ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు గాను 1959—60 ప్రణాళికలో రు. 0.82 మొత్తం కేటాయించబడింది. ఈ హాస్టళ్ళు ఎక్కడ స్థాపించాలనే విషయం ఇంకా నిర్ణయించబడలేదు.

## కుటీర పరిశ్రమలు

ఈ పథకం క్రింద పనివారల పిల్లలు వడ్రంగం, కమ్మరిపని మొదలయిన కోర్సులను పరిశ్రమల శాఖచే నడుపబడే గుర్తించబడిన సంస్థలలో చదివేటందుకు గాను ఆ పిల్లలకు స్టయిపెండులు మంజూరు చేయబడుతున్నాయి. 1959—60 లో 18 మంది పనివారల పిల్లలకు స్టయిపెండులు ఇచ్చే నిమిత్తం రు. 900/— లు కేటాయించబడినాయి.

ఈ జిల్లాలోని 2 సహకార సంఘాలకు వాటా మూలధనం క్రింద రు. 0.02 లక్ష వరకు ఆర్థిక సహాయం చేయటానికి కూడ ప్రతిపాదింపబడింది.

# స్త్రీ సంక్షేమం

## సేవాసదనాల ఏర్పాటు

హైదరాబాదులోని సేవాసదనం 1959 మే నుండి పనిచేయటం ప్రారంభించింది. ప్రస్తుతం ఇందులో 28 మంది స్త్రీలు, 9 మంది పిల్లలు ఉన్నారు. సేవాసదనాన్ని కొనసాగించే నిమిత్తం ఈ సంవత్సరంలో రు. 0.743 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ సేవాసదనంలో 1959—60 లో 100 మంది స్త్రీలు, 40 మంది పిల్లలు చేర్చుకోబడతారని ఆశించబడుతున్నది. గౌరవనీయమైన బీద కుటుంబాలకు చెందిన వితంతువులకు, నిరాశ్రయులకు, పరిత్యక్తలకు ఈ సేవాసదనంలో సహాయం చేయబడుతుంది. రక్షణ కలుగచేయబడుతుంది. సేవసదనాల్లో చేరేవారిని గురించి పూర్తిగా వాకబుచేసిన తర్వాతనే వారిని చేర్చుకోవటం జరుగుతుంది.

వారు సేవాసదనంలో మూడేళ్ళపాటు ఉంచబడతారు. వారు సేవాసదనంలో ఉండే కాలంలో వారికి వైద్యసహాయం, రక్షణ కల్పించటమేకాక, ఇ.ఎస్.ఎల్.సి. వరకు చదువు చెప్పించబడుతుంది. వీరిలో తెలివైన వారికి, వారు ఉపాధ్యాయుల శిక్షణ, నర్సింగ్ శిక్షణ, చేతిపనుల శిక్షణ మొదలయిన సాంకేతిక శిక్షణ కోర్సులను చదివేటందుకుగాను, మెట్రిక్యులేషన్ వరకు విద్య చెప్పించబడుతుంది. ఇందువల్ల మీరు స్వయంగా సంపాదించుకొని జీవించడానికి వీలుకలుగుతుంది.

## ఫీల్డు సిబ్బందికి శిక్షణ

స్త్రీ సంక్షేమశాఖకు చెందిన ఫీల్డుసిబ్బందికి సంఘసేవకు సంబంధించిన నవీన విధానాలను గురించి శిక్షణ ఇచ్చే నిమిత్తం 1958—59 లో ఒక శిక్షణ సంస్థ ఏర్పాటు చేయబడింది. ఇంతేకాక పునశ్చరణ తరగతులు కూడ ఏర్పాటు చేయటం జరిగింది. శిక్షణ నిమిత్తం 21 మంది స్త్రీ సంక్షేమ కార్యకర్తలు చేర్చుకోబడినారు. ఇంకా 30 మంది సంక్షేమ కార్యకర్తలకు శిక్షణ ఇవ్వటంకోసం 1959—60 ప్రణాళికలో రు. 0 485 లక్ష మొత్తం కేటాయించబడుతుంది.

## పునరావాస కార్యక్రమం; వృద్ధులకు, అవిటివారికి సహాయం

సేవాసదనాలలో శిక్షణ పొందిన కొంతమంది స్త్రీలకు తాము శిక్షణ పొందిన చేతిపనిని లేక ఇతర వృత్తిని స్వయంగా ప్రారంభించుకొని జీవనోపాధిని కల్పించుకోవటానికి వీలుగా నిర్వహణ మూలధనం క్రింద ఆర్థిక సహాయం చేయటానికి ఈ పథకం క్రింద ఉద్దేశించబడింది. ఏవిధమైన ఆధారం లేనట్టి వృద్ధ, అవిటి స్త్రీలకు కూడ ఈ పథకం క్రింద ఆర్థిక సహాయం చేయబడుతుంది. ఈ పథకం అమలు జరపటంకోసం 1959—60 ప్రణాళికలో ఈ జిల్లాకు రు. 0.05 లక్ష కేటాయించబడింది. ఈ పథకంవల్ల 10 మంది స్త్రీలకు లాభం చేకూరుతుందని ఆశించబడుతున్నది.

## స్త్రీ సంక్షేమశాఖ విభాగాల ఏర్పాటు

తెలంగాణా ప్రాంతంలో స్త్రీ సంక్షేమ శాఖ కార్యకలాపాలను విస్తృతంచేసే ఉద్దేశంతో స్త్రీలు, పిల్లల సంక్షేమం నిమిత్తం 1959—60 లో

10 స్త్రీ సంక్షేమ శాఖ విభాగాలను ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో రెండు విభాగాలు ఈ జిల్లాలో ఏర్పాటు చేయబడతాయి. ఇందుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.14 లక్ష కేటాయించబడింది.

## సాంఘిక సంక్షేమం

### సాంఘిక సంక్షేమ విస్తరణ కేంద్రాలు

ఈ పథకం క్రింద అయ్యే ఖర్చులో రాజ్య ప్రభుత్వ వాటా క్రింద ప్రణాళికలో ఈ సంవత్సరానికి గాను రు. 0.3828 లక్ష మొత్తం కేటాయించబడింది. ప్రస్తుతమున్న రెండు సాంఘిక సంక్షేమ విస్తరణ కేంద్రాలను నిర్వహించటానికి, ఈ జిల్లాలోని మొదటి దశ బ్లాకుప్రాంతంలో సమన్వయ పద్ధతిలో ఒక అదనపు కేంద్రాన్ని ఏర్పాటు చేయటానికిగాను పై డబ్బు వినియోగించబడుతుంది. ఈ అదనపు కేంద్రానికయ్యే ఖర్చు 5:12:6 నిష్పత్తిలో బ్లాకులు కేంద్ర సాంఘిక సంక్షేమ బోర్డు వారు, రాజ్య ప్రభుత్వం భరిస్తారు. ప్రజలనుండి వసూలుచేయబడే విరాళాలు కూడ ఇందుకుగాను వినియోగించబడతాయి.

### సాంఘిక, నైతిక పునరుద్ధరణ, సంరక్షణ కార్యక్రమాలు

"కరెక్షనల్ ఇనిస్టిట్యూషన్సు" నుండి విడుదల చేయబడే స్త్రీలకుగాను రాజ్య స్థాయిలో ఒక ఆశ్రయ కేంద్రాన్ని, 14 జిల్లా ఆశ్రయ కేంద్రాలను (పురుషులకు 3, స్త్రీలకు 11) ఏర్పాటు చేయటానికి, రాజ్యంలో ఇంతకుముందు ఏర్పాటు చేయబడిన రాజ్య ఆశ్రయ కేంద్రాలను, జిల్లా ఆశ్రయ కేంద్రాలను కొనసాగించుటకు అయ్యే ఖర్చులో రాజ్య ప్రభుత్వ వాటా క్రింద 1959—60 ప్రణాళికలో రు. 6.32 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.661 లక్ష మొత్తం ఈ జిల్లాకోసం ప్రత్యేకించబడింది. ఈ మొత్తంలో పురుషులకు గాను ఒక జిల్లా ఆశ్రయ కేంద్రం ఏర్పాటు చేయబడుతుంది హైదరాబాదులో స్త్రీలకుగాను ఏర్పాటు చేయబడిన శరణాలయం కొనసాగించబడుతుంది.

### బిక్షుక గృహాలు

హైదరాబాదు, సికిందరాబాదు నగరాలలో రెండు బిక్షుకగృహాలను ఈ సంవత్సరంలో ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. ఒక్కొక్క గృహంలో 100 మందిని చేర్చుకోవటానికి వీలుంటుంది. వీటిని ఏర్పాటు చేయటానికి అంచనా వేయబడిన ఖర్చు రు. 80,000 లు. ఈ సంస్థ నిర్వహణ కయ్యే ఖర్చులో మునిసిపలు కార్పొరేషన్లు భరించటానికి ఒప్పుకొన్న మొత్తం పైన పేర్కొన్న మొత్తంలో చేర్చబడలేదు. గ్రాంటు–ఇన్–ఎయిడ్ పథకాల క్రింద రు. 9,000 ల అంచనా వ్యయంతో ప్రస్తుతమున్న బిక్షుక గృహాలకు అభివృద్ధి పనులు చేయటానికి కూడ ప్రతిపాదింపబడింది.

## రాజధాని అభివృద్ధి

రాజధానిలో ప్రభుత్వ భవనాల నిర్మాణం మొదలు పెట్టి పూర్తి చేసేటందుకు గాను 1959–60 ప్రణాళికలో రు. 20 లక్షల మొత్తం కేటాయించబడింది. వాటి వివరాలు క్రింద ఇవ్వబడినాయి.

### ప్రస్తుతమున్న తాత్కాలిక సచివాలయ భవనాల మీద అదనపు అంతస్థును నిర్మించటం

ప్రస్తుతమున్న తాత్కాలిక సచివాలయ భవనాల మీద అదనంగా మరో అంతస్థును నిర్మించటం 1956–57 లో పూర్తి అయింది. 1957–58 "ఎలక్ట్రిక్ లిఫ్టు" కూడ ఏర్పాటు చేయబడింది. ఈ సంవత్సరంలో ఈ పథకం క్రింద ప్రణాళికలో కేటాయింపేమీ చేయబడదు. కానీ ఇందుకు కావలసిన మొత్తం యితర పథకాలకు చేయబడిన కేటాయింపు నుండి సర్దుబాటు చేయబడుతుంది.

### ప్రభుత్వానికి, ప్రయివేటు వ్యక్తులకు చెందిన భవనాలకు అభివృద్ధిపనులు

ప్రభుత్వ శాఖాధికార్ల కార్యాలయాలను నెలకొల్పటానికి, ప్రభుత్వ నివాసగృహాలు లభ్యం చేయబడనటువంటి ప్రభుత్వోద్యోగులకు వసతి కల్పించటానికిగాను కొన్ని ప్రభుత్వ భవనాలకు, ప్రయివేటు భవనాలకు మరమ్మతులను, అభివృద్ధిపనులను ప్రణాళిక యొక్క మొదటి మూడు

సంవత్సరాల కాలంలోనే జరిపించటం జరిగింది. ఈ పథకానికి గాను, 1959–60 ప్రణాళికలో కేటాయింపేమీ చేయబడలేదు. అయితే ఇందుకు సంబంధించిన లెక్కలను తుది పరిష్కారమొనర్చుటకు అవసరమైన డబ్బు ఇతర పథకాలకు చేయబడిన కేటాయింపు నుండి సర్దుబాటు చేయబడుతుంది.

## *జూనియరు ఆఫీసర్లకు 100 ఇళ్ళు నిర్మాణం;*

జూనియరు ఆఫీసర్లకు 100 ఇళ్ళను నిర్మించటం 1956–57 లో ప్రారంభించబడి 1957–58 లో పూర్తిచేయబడింది. 1959–60 ప్రణాళికలో యిందుకు సంబంధించి కేటాయింపేమీ చేయబడలేదు. కానీ అంతిమంగా చేయవలసిన చెల్లింపులకోసం డబ్బు యితర పథకాలకు చేయబడిన కేటాయింపు నుండి సమకూర్చబడుతుంది.

## *రాజభవన్‌లో సిబ్బందికి ఇళ్ళు, గారేజీలు, గెస్టు హౌసు నిర్మాణం*

ఈ పథకం క్రింద 92 భవనాల నిర్మాణం పూర్తిఅయింది. ఇందులో 80 సిబ్బందికి సంబంధించిన వసతిగృహాలు; 6 గ్యారేజిలు; 5 డ్రయివర్ల వసతిగృహాలు; ఒకటి ఆఫీసుగది. 40 'ఎ' తరగతి సిబ్బంది వసతి గృహాల స్థానే నిర్మించటానికి ప్రతిపాదింపబడిన ప్రభుత్వ గెస్టుహావుసు (క్రిందిభాగం మాత్రం) నిర్మాణం కూడ పూర్తి అయింది. ఇంతేకాక "గెస్టుహావుసు" మీద మొదటి అంతస్థు నిర్మాణంలో ఉంది. 1959–60 ప్రణాళికలో ఇందుకుగాను రు. 1.85 లక్షల మొత్తం కేటాయించబడింది.

## *సిబ్బందికిగాను 1000 ఇళ్ళ నిర్మాణం*

సిబ్బందికిగాను 1000 ఇళ్ళ నిర్మాణం 1956–57 లో ప్రారంభించబడింది. రోడ్లను వేయుటం మినహా మిగతా పని అంతా 1958–59 నాటికి పూర్తి చేయబడింది. రోడ్డు పనులను పూర్తి చేయడానికి, ఈ పథకం క్రింద చేయవలసిన అంతిమ చెల్లింపులకు గాను 1959–60 ప్రణాళికలో రు. 2.00 లక్షల మొత్తం కేటాయించబడింది.

## శాసన సభ్యులకు వసతిగృహాల నిర్మాణం

శాసనసభ్యుల ఉపయోగార్థం 50 "ఫ్యామిలీ టైపు" ఇళ్ళను, 50 "హాస్టలు టైపు" ఇళ్ళను ఇతర భవనాలను నిర్మించటానికి ప్రతిపాదించ బడింది. ఇందులో 50 "ఫ్యామిలీ టైపు" ఇళ్ళ నిర్మాణం పూర్తి అయింది. "హాస్టలు టైపు" ఇళ్ళ నిర్మాణంలో ఉన్నాయి. ఇంకా 26 "ఫ్యామిలీ టైపు" ఇళ్ళను, 14 "హాస్టలు టైపు" ఇళ్ళను, వార్డనుకు ఒక వసతి గృహాన్ని, 6 గ్యారేజీలను, 12 నాలుగవ తరగతి సిబ్బంది ఇళ్ళను నిర్మించ టానికి కూడ ప్రతిపాదించబడింది. ఇందులో 6 గ్యారేజీలు, 6 నాలుగవ తరగతి సిబ్బంది ఇళ్ళ నిర్మాణం పూర్తి చేయబడింది. ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకానికి గాను రు. 11.36 లక్షల మొత్తం కేటాయించ బడింది.

## హైకోర్టుకు అదనపు భవనాల నిర్మాణం

హైకోర్టుకు సంబంధించిన అదనపు భవనాల నిర్మాణంలో మొదటిదశ అప్పుడే పూర్తి చేయబడింది. ఈ పనికి సంబంధించిన రెండవ దశ 1958–59 లో ప్రారంభించబడి సాగుతున్నది. ఈ పథకానికి సంబంధించిన పనిని కొనసాగించటం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 4.79 లక్షల మొత్తం కేటాయించబడింది.

## ఎగువ సభగా మార్చుటం కోసం జూబిలీ హాలుకు అభివృద్ధి పనులు చేయటం "ఎయిర్ కండిషన్" చేయటం.

విధాన పరిషత్తును నెలకొల్పేటందుకు వీలుగా జూబిలీహాలుకు అభి వృద్ధి పనులు చేయడం, జూబిలీహాలును "ఎయిర్ కండిషన్" చేయటం 1958–59 లో పూర్తి చేయబడింది. "పర్మనెంటు సౌండు రీ ఇన్‌ఫోర్సు మెంటు" పరికరాలు మాత్రము ఏర్పాటు చేయబడలేదు. 1959–60 లో ఈ పథకమునకు గాను కేటాయింపేమీ చేయబడలేదు. అయితే కావలసిన డబ్బు మాత్రం యితర పథకాల నుండి మళ్ళింపు చేయటం ద్వారా సమకూర్చబడుతుంది.

## సిబ్బందికి మరో 700 ఇళ్ళ నిర్మాణం

సిబ్బందికి గాను మలకపేటలో మరో 700 ఇళ్ళను నిర్మించటానికి ప్రతిపాదింపబడింది. 1958–59 లో యిందుకు స్థలం కూడ రు. 1.597 లక్షల మొత్తం వ్యయంతో కొనబడింది. 1959–60 లో ఈ పథకానికి కేటాయింపేమీ చేయబడలేదు. అయితే 1958–59 లో పథకాన్ని ప్రారంభించడానికి మంజూరు ఇవ్వబడింది. ఇందుకు కావలసిన డబ్బు ఇతర పథకాలకు ప్రత్యేకింపబడిన మొత్తం నుండి తిరిగి కేటాయింపుచేయడం ద్వారా సమకూర్చబడుతుంది.

## రేడియో ప్రసారం

ఈ జిల్లాలో 225 కమ్యూనిటీ రేడియో సెట్లను స్థాపించడానికి ప్రతిపాదింపబడగా అందులో 50 సెట్లను మాత్రం 1956–59 లలో స్థాపించటం జరిగింది. ఈ సంవత్సరంలో 125 కమ్యూనిటీ రేడియో సెట్లను ఏర్పాటు చేసి నిర్వహించటానికి ప్రతిపాదింపబడింది. ఇంతేగాక 1–4–1959 తేదీకి పూర్వం స్థాపించబడిన సెట్లను కూడ నిర్వహించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.175 లక్ష మొత్తం కేటాయించబడింది.

## ప్రచారం

రెండవ పంచవర్ష ప్రణాళికను విజయవంతంగా అమలు పరచటంలో ప్రజలు శ్రద్ధ వహించేటట్టు చేయడానికి వారు సంపూర్ణంగా సహకరించి పాల్గొనేటట్లు చేయడానికి గాను వివిధ పద్ధతుల్లో అభివృద్ధి కార్యక్రమాలను గురించి ప్రచారం చేయటానికి ఏకీకృత కార్యక్రమం ఒకటి 1956–57 లో ప్రారంభించబడింది. ఈ కార్యక్రమాన్ని కొనసాగించటంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.80 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1,650 లు ఈ జిల్లాలో క్రింది విధంగా వినియోగించటానికి గాను ప్రత్యేకించబడింది.

| | | రూపాయలు |
|---|---|---|
| 1. | జిల్లా స్థాయిలో ఏర్పాటు చేయబడే ప్రదర్శనలో పాల్గొనటానికి | 250 |
| 2. | సంగీత, నాటకోత్సవాలు ఏర్పాటు చేయటానికి | 500 |
| 3. | జిల్లా, తాలుకా కేంద్రాలలో ప్రణాళిక వారోత్సవం ఏర్పాటు చేయటానికి. | 900 |
| | మొత్తం | 1,650 |

ఇంతేకాక రాజధానిలో ఈ క్రింది కార్యక్రమాల నిమిత్తం రు. 1.14 లక్షల మొత్తం కేటాయించబడింది.

| | | రూపాయలు, లక్షలలో |
|---|---|---|
| 1. | పత్రికా ప్రకటనలు | 0.10 |
| 2. | ఫిల్ములు | 0.14 |
| 3. | చార్టులు తయారు చేయటం | 0.06 |
| 4. | హైదరాబాదులోని అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శనములో పాల్గొనటం | 0.04 |
| 5. | ప్రచారసాహిత్యాన్ని తయారు చేయటం. | 0.39 |
| 6. | హైదరాబాదులో సాంస్కృతిక ప్రదర్శనం ఏర్పాటు చేయటం. | 0.05 |
| 7. | వ్యానుకు | 0.33 |
| 8. | పెట్రోలు, నిర్వహణ ఖర్చులు | 0.01 |
| 9. | డ్రయివరు, క్లీనరు మొదలయిన వారి క్రింద ఖర్చు | 0.02 |
| | మొత్తం | 1.14 |

## అర్థ, గణాంక శాఖ

రాజ్య స్థాయిలో జరిగే గణాంక వివరాల సంకలన కార్యక్రమాన్ని జిల్లా స్థాయిలో సమన్వయ పరచటానికి, సేకరించబడి సంకలనం చేయబడే

గణాంక వివరాలను ఇంకా ఉత్తమంగా తయారు చేయటానికి ఉపయోగ పడే "లయజన్ ఏజెన్సీ"గా పని చేయటానికి గాను ఈ జిల్లాలో ఒక జిల్లా గణాంక విభాగం 1958–59 లో ఏర్పాటు చేయబడింది. ఒక జిల్లా గణాంకాధికారి (గెజిటెడ్); ఒక ఎకనామిక్ ఇన్వెస్టిగేటరు, ఒక అప్పరు డివిజను గుమాస్తా, ఇద్దరు జవానులు ఈ శాఖలో నియమించబడినారు. ఈ సంవత్సరంలో కూడ ఈ సిబ్బంది కొనసాగించబడుతుంది. ఇందుకుగాను 1959-60 ప్రణాళికలో రు. 0.10 లక్ష కేటాయించబడింది.

## తంతి, తపాలా సౌకర్యాలు

1959–60 లో షాబాదు, పర్గిలలో రెండు టెలిగ్రాఫ్ ఆఫీసులు, వికారాబాదు, షాబాదులలో రెండు టెలిఫోను ఎక్స్ఛేంజీలను, పర్గిలో ఒక పబ్లిక్ కాల్ ఆఫీసును ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది.

## రైలు మార్గాలు

1959–60 లో హైదరాబాదు జిల్లాలో రైలుమార్గాలకు సంబంధించి ఈ క్రింది కార్యక్రమాలు అమలుజరపబడతాయి.

| వరుస సంఖ్య | పని వివరం | అంచనా వేయబడిన ఖర్చు–వేల రూపాయలలో |
|---|---|---|
| 1. | లాలాగూడాలో 16 యూనిట్ల మొదటిరకం ఇళ్ళను నిర్మించటం. | 89 |
| 2. | లాలగూడాలోని ప్రసూతి, సంక్షేమ కేంద్రంలో అదనపు వసతిని కల్పించటం | 87 |
| 3. | సనత్నగర్ వద్ద హైదరాబాదు–షోలాపూరు రోడ్డు మీద ఉన్న లెవల్ క్రాసింగు స్థానంలో ఓవరు బ్రిడ్జి నిర్మించటం | 115 |
| 4. | సికిందరాబాదులో 24 యూనిట్ల రెండవ తరగతి ఇళ్ళను నిర్మించటం | 249 |

# హైదరాబాదు జిల్లా ప్రణాళిక, అభివృద్ధి సంఘం యొక్క అధికార, అనధికార సభ్యుల జాబితా

| | | |
|---|---|---|
| జిల్లా కలెక్టరు | — | అధ్యక్షుడు |
| జిల్లా ప్లానింగు అధికారి | — | కార్యదర్శి |

## అధికార సభ్యులు

1. పోలీసు సూపరింటెండెంటు, హైదరాబాదు
2. డిప్యూటి కలెక్టరు, హైదరాబాదు తూర్పు, హైదరాబాదు
3. డివిజనల్ ఇంజనీరు, ఐ. బి., మెదక్
4. అడ్మినిస్ట్రేటివ్ డిస్ట్రిక్టు మెడికల్ ఆఫీసరు, హైదరాబాదు జిల్లా, గోల్కొండ
5. ఎక్జిక్యూటివ్ ఇంజనీరు, రోడ్లు—హైదరాబాదు జిల్లా
6. డివిజనల్ ఫారెస్టు ఆఫీసరు, అటవీ పెంపక విభాగం, హైదరాబాదు
7. డివిజనలు ఫారెస్టు ఆఫీసరు, తాండూరు (సి. ఆర్.) హైదరాబాదు
8. జిల్లా ఎక్సైజు సూపరింటెండెంటు, హైదరాబాదు నార్త్, సికిందరాబాదు
9. జిల్లా ఎక్సైజు సూపరింటెండెంటు, హైదరాబాదు సౌతు, హైదరాబాదు
10. డిప్యూటి కలెక్టరు, వికారాబాదు (సి. ఆర్.) హైదరాబాదు
11. డిప్యూటి కలెక్టరు, హైదరాబాను వెస్టు, హైదరాబాదు
12. జిల్లా వ్యవసాయ శాఖాధికారి, హైదరాబాదు జిల్లా
13. సహకార సంఘాల డిప్యూటి రిజిష్ట్రారు, హైదరాబాదు
14. జిల్లా పశువైద్య శాఖాధికారి, హైదరాబాదు జిల్లా
15. జిల్లా ఆరోగ్య శాఖాధికారి, హైదరాబాదు
16. జిల్లా విద్యా శాఖాధికారి, హైదరాబాదు
17. సబ్ డివిజనల్ ఆఫీసరు, పి. డబ్ల్యు. డి., నీటి పారుదల శాఖ, ఇరం మంజిల్, హైదరాబాదు

18 తహసీల్దారు, హైదరాబాదు వెస్టు, హైదరాబాదు

19 జిల్లా ట్రెజరీ ఆఫీసరు, హైదరాబాదు

20 తహసీల్దారు, హైదరాబాదు ఈస్టు, హైదరాబాదు

21 తహసీల్దారు, మేడ్‌చల్, హైదరాబాదు

22 తహసీల్దారు, ఇబ్రహింపట్టణం, హైదరాబాదు

23 తహసీల్దారు, చేవెల్ల, హైదరాబాదు

24 తహసీల్దారు, తాండూరు, హైదరాబాదు

25 తహసీల్దారు, వికారాబాదు, హైదరాబాదు జిల్లా

26 తహసీల్దారు, పర్గి, హైదరాబాదు జిల్లా

27 అసిస్టెంటు ఇంజనీరు (ప్లానింగు), హైదరాబాదు

28 స్పెషల్ సోషల్ సర్వీసు ఆఫీసరు, హైదరాబాదు

29 పరిశ్రమలశాఖ అసిస్టెంటు డైరెక్టరు, హైదరాబాదు

30 ఎక్జిక్యూటివ్ ఆఫీసరు, జిల్లాబోర్డు, హైదరాబాదు

31 లోకల్ ఇంజనీరు, హైదరాబాదు

32 భూమి రికార్డుల ఆఫీసరు, హైదరాబాదు

33 ఫిషరీస్ అసిస్టెంటు డైరెక్టరు, హైదరాబాదు

34 బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు, వికారాబాదు

35 బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు, రాజేంద్రనగరు, హిమాయత్‌నగరు పోస్టు, హైదరాబాదు జిల్లా

36 బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, మేడ్‌చల్, హైదరాబాదు జిల్లా

37 బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, చేవెల్ల (వయా) జి. పి. డి. హైదరాబాదు, హైదరాబాదు జిల్లా

38 బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, హాయాత్‌నగరు, హైదరాబాదు ఈస్టు, హైదరాబాదు జిల్లా

39 బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, ఇబ్రహీంపట్టణం, హైదరాబాదు జిల్లా

40 బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, తాండూరు, హైదరాబాదు జిల్లా

41 బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, మోమింపేట

42 ఎక్జిక్యూటివ్ ఇంజనీరు, బావుల త్రవ్వకం మరియు జిల్లా నీటి సరఫరా పనులు

43 అసిస్టెంటు రేడియో ఇంజనీరు

44 జిల్లా గణాంకాధికారి

45 అసిస్టెంటు ఉమన్ వెల్ ఫేర్ ఆఫీసరు, హైదరాబాదు జిల్లా.

46 ఛైర్ మెన్, డిస్ట్రిక్టు ప్రాజెక్టు ఇంప్లిమెంటేషన్ కమిటీ, హైదరాబాదు జిల్లా ఎ. సి. గార్డ్సు, హైదరాబాదు

47 డివిజనల్ ఇంజనీరు, ఎలక్ట్రిసిటీ, కన్‌స్ట్రక్షన్ అండ్ ఆపరేషన్, హైదరాబాదు.

## అనధికార సభ్యులు

1 శ్రీ ఎస్. చెన్నారెడ్డి, ఎం.పి., 3–4–872/1 బర్కత్‌పుర, హైదరాబాదు

2 డా. కిషన్‌చంద్, ఎం.పి., ఎ–10-161 హైదరాబాదు

3 శ్రీ మాకినేని బసవపున్నయ్య, ఎం.పి., 3–3–2191, లింగంపల్లి, హైదరాబాదు

4 శ్రీ అక్బర్ అలీఖాన్, ఎం.పి., స్టోన్‌హౌసు, సైఫాబాద్, హైదరాబాదు

6 శ్రీ నరోత్తంరెడ్డి, ఎం.పి., 3-5-824, హైదరుగూడ, హైదరాబాదు

6 డా. రాజ్‌బహాదూర్ గౌడ్, ఎం.పి., 1–81/60, సూర్యనగర్, చిక్కడపల్లి, హైదరాబాదు.

7 శ్రీ వినాయక్‌రావు, ఎం.పి., 10–7–0, తులగిగూడ, మోజంజాహి మార్కెటు ఎదుట, హైదరాబాదు

8 శ్రీ అహ్మద్ మొహిద్దీన్, ఎం.పి., ఉపమంత్రి, భారత ప్రభుత్వపు పౌరవిమాన యానశాఖ, క్రొత్త డిల్లీ

9 శ్రీ వందేమాతరం రామచంద్రరావు, ఎం.ఎల్.ఎ., హైదరాబాదు

10 డా. ఎం. చెన్నారెడ్డి, ఎం.ఎల్.ఎ., లాలగూడ

11 శ్రీ గోపాలరావు ఎక్బోటె, ఎం.ఎల్.ఎ., కాచిగూడ స్టేషన్‌రోడ్డు, హైదరాబాదు

12 శ్రీ బి.వి. గురుమూర్తి, ఎం.ఎల్.ఎ., పార్కులేన్, సికిందరాబాదు

13 శ్రీ జగన్మోహనరెడ్డి, ఎం.ఎల్.ఎ., మొహమ్మదాబాద్, వయా మహబూబ్‌నగరు, పర్గి తాలుకా

14 . డా. ఎం. ఎన్. లక్ష్మీనరసయ్య, ఎం.ఎల్.ఎ., పాత అల్వాల్, హైదరాబాదు—10

15 శ్రీమతి మసూమబేగం, ఎం.ఎల్.ఎ., 660—ఎఫ్—4, సోమాజిగూడ, హైదరాబాదు

16 శ్రీ మీర్ అహ్మద్ అలీఖాన్, ఎం.ఎల్.ఎ., 8-2-269, హుసేన్ మసీదు వెనక, జూబిలీహిల్స్, హైదరాబాదు

17 శ్రీ జె.వి. నరసింగరావు, ఎం.ఎల్.ఎ. నీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖ మంత్రి, ఆంధ్ర ప్రదేశ్, హైదరాబాదు

18 శ్రీ నవాబ్ మేదినవాజ్ జంగ్ ఎం.ఎల్.ఎ., సహకార శాఖ మంత్రి

19 శ్రీ వి. రామరావు, ఎం.ఎల్.ఏ., లక్ష్మీనగర్, సికందరాబాదు కంటోన్మెంటు

20 శ్రీ రామస్వామి అరిగె, ఎం.ఎల్.ఎ., 6881, మొదటి వార్డు, కుమ్మరగూడ, సికిందరాబాదు

21 శ్రీ కె. సత్యనారాయణ, ఎం.ఎల్.ఎ., 2—8—157, రామగోపాల్ పేట, సికిందరాబాదు

22 శ్రీ శీతయ్య గుప్త, కొత్తూరు, ఎం.ఎల్.ఎ., ఉస్మాన్‌గంజ్, హైదరాబాదు

23 శ్రీ షహాబుద్దీన్ అహ్మద్ ఖాన్, ఎం.ఎల్.ఎ., 556, జేబామాస్కిన్, సయ్యద్ జంగ్సలేన్, ట్రూప్ బజార్, హైదరాబాదు

24 శ్రీమతి సుమిత్రాదేవి, ఎం.ఎల్.ఎ., 644/3 బ్లాక్ 5 సి.ఐ.బి. నారాయణగూడ, హైదరాబాదు

25 శ్రీ వాసుదేవ కృష్ణాజినాయక్, ఎం.ఎల్.ఎ., గౌలిగూడ, హైదరాబాదు

26 శ్రీ కె. వి. రంగారెడ్డి, రెవెన్యూ మంత్రి, (ఎం.ఎల్.ఎ.,) ఆంధ్ర ప్రదేశ్, హైదరాబాద్

27 శ్రీ ఎం. భోజరెడ్డి, ఎం.ఎల్.సి., 3—2—792, రహమత్ బాగ్, కాచిగూడ, హైదరాబాదు

28 శ్రీ కె. గోపాలరెడ్డి, మంగళారం, చిల్కూరు పోస్టు, వయా జి.పి.ఒ. హైదరాబాదు

29 శ్రీ కె. గోవిందరెడ్డి, అధ్యక్షుడు, సహకార మార్కెటింగు సంఘాలు, వికారాబాదు, హైదరాబాదు

30 శ్రీ కె.జి. కృష్ణమూర్తి, తాండూరు (సి.ఆర్) హైదరాబాదు

31 శ్రీ వీరభద్రప్ప, ధారూరు, సి.ఆర్. హైదరాబాదు జిల్లా

32 శ్రీ వి. రామచంద్రయ్య, తాండూరు, సి.ఆర్. హైదరాబాదు

33 శ్రీ కిషన్‌రావు, యాంజాల్, మెడ్‌చల్ తాలూక, హైదరాబాదు

34 శ్రీ బి. రాజ్‌రెడ్డి, ఇబ్రాహీంపట్టణం, హైదరాబాదు జిల్లా

35 శ్రీ జె. సీతారామరెడ్డి, నూతంకల్, మెడ్‌చల్, హైదరాబాదు జిల్లా

36 శ్రీ ఎస్. నరసింహారెడ్డి, ఏదులాబాదు, హైదరాబాదు ఈస్టు, హైదరాబాదు జిల్లా

37 శ్రీ టి ఆంజనేయులు, ఘట్‌కేసర్, హైదరాబాదు జిల్లా

38 శ్రీ లక్ష్మీకాంతరావు, పర్గి, హైదరాబాదు జిల్లా

39 శ్రీ ఎన్. అనంతరెడ్డి, [illegible]పల్లి గ్రామం పోస్టు, నందివనపర్తి, హైదరాబాదు జిల్లా [illegible]

40 శ్రీ ఎం.బి. గౌతం, ఆదిహిందూ సాంఘిక సేవా సంస్థ, విక్టరీ ప్లే గ్రౌండు, హైదరాబాదు

41 శ్రీ వి. గోపాల్‌రెడ్డి, కాచిగూడ, హైదరాబాదు

42 శ్రీమతి రాణి రామదేవ్‌రావ్, 77, బేగంపేట, హైదరాబాదు

43 శ్రీ జి. నరసింగరావు, జాంబాగ్, మోదిన్‌పాషా మసీదు ఎదుట, హైదరాబాదు

44 శ్రీ కె. పుల్లారెడ్డి, వకీలు, కాచిగూడ, హైదరాబాదు

45 శ్రీ భగత్‌రామ్‌రావు, టౌను మునిసిపలు కమిటీ అధ్యక్షుడు, ఇబ్రాహీంపట్టణం, హైదరాబాదు జిల్లా

46 శ్రీ బొంగు చంద్రయ్య, అల్వాల్, హైదరాబాదు—10.

47 శ్రీ వెంకటరావు, సాహెబ్‌నగర్ పోస్టు సరూర్‌నగరు, హైదరాబాదు

48 శ్రీమతి సంగం లక్ష్మీబాయి, ఇందిరసేవా సదన్, సైదాబాద్, హైదరాబాదు

49 శ్రీ ఎం. నారాయణరావు, సిటీ మునిసిపలు కమిటీ అధ్యక్షుడు, మెడ్‌చల్, హైదరాబాదు జిల్లా

50 • శ్రీ డి. శ్రీనివాస్, టౌను మునిసిపలు కమిటీ అధ్యక్షుడు, మెడ్ చెల్, హైదరాబాదు జిల్లా

51 శ్రీ కె. సిద్ధప్ప, టౌను మునిసిపలు కమిటీ అధ్యక్షుడు, షాబాదు, వయా షాదునగర్, హైదరాబాదు జిల్లా

52 శ్రీ ఎం. వీరమల్లప్ప, టౌను మునిసిపలు కమిటీ అధ్యక్షుడు, వికారాబాదు, హైదరాబాదు జిల్లా

53 శ్రీ సి. మోహన్ రెడ్డి, బ్లాకు పరిశ్రామిక, అభివృద్ధి సంఘం అధ్యక్షుడు, వికారాబాదు. బ్లాక్ పోస్టు నగరం, వయా ధారూరు, హైదరాబాదు జిల్లా

54 శ్రీ వెంకటరామా రెడ్డి, గౌడవల్లి గ్రామం తాత్కాలిక పంచాయితీ సమితి అధ్యక్షుడు, మెడ్ చెల్, హైదరాబాదు జిల్లా

55 శ్రీ ఎర్రం సత్యనారాయణ, ఎం.ఎల్.సి 4—4—58, తిలక్ రోడ్డు, సుల్తాన్ బజారు

56 శ్రీ అతావుర్ రహ్మాన్, ఎం.ఎల్ సి., 8-2—420 బంజారాహిల్స్, హైదరాబాదు

57 శ్రీ అబూయూసఫ్, ఎం.ఎల్.సి.. బజార్, నూర్ ఉలేఉమ్రా, సి.ఐ బి. క్వార్టర్సు, ఎ. క్లాస్—నెం. 9, హైదరాబాదు సిటీ, 22—2—483

58 శ్రీ జగన్నాథం, ఎన్.వి., ఎం.ఎల్ సి., హెచ్ నెం. 732, రాయిలు పటేల్ హావుస్, సుల్తాన్ షాహి, హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్.

59 శ్రీ జైన్ యార్ జంగ్ బహదూర్, ఎం.ఎల్.సి., హిమాయత్ నగర్, హైదరాబాదు

60 శ్రీ ఎర్న్ స్టెగిడియన్, బి.ఎ. (ఆనర్సు) ఆక్స్ఫర్డు ఎం. ఎల్. సి. ప్రిన్సిపాల్, వెస్లి హైస్కూల్, ఫ్రెండర్ ఘాస్టు రోడ్డు, సికిందరాబాదు

61 శ్రీ హారూన్ ఖాన్ షేర్వాని, ఎం.ఎల్.సి., ముస్తాఫా మంజిల్, హిమాయత్ నగర్, హైదరాబాదు

62 శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి, ఎం. ఎల్. సి., వారకోటిగార్డెన్సు, టోలిచౌకు, గోల్కొండ దగ్గర, హైదరాబాదు

63 రాజారామేశ్వరరావు, ఎం.పి , నిజాం కాలేజి ఎదుట, హైదరాబాదు

64 శ్రీ బొజ్జం నరసింహులు, రామ్‌కోటి హైదరాబాదు

65 శ్రీమతి ఫైజున్నిసా, ఎం. ఎల్. సి. కటల్‌మండి. రెవెన్యూ బోర్డు ఎదుట, హైదరాబాదు

66 శ్రీ మఖ్దూం మొహియుద్దీన్, ఎం. ఎల్. సి., ఉర్దూగల్లి, ఆబిద్‌రోడ్డు, హైదరాబాదు

67 శ్రీమతి శ్యామలదేవి, C/O ఆంధ్ర యువతిమండలి, బర్కత్‌పుర, హైదరాబాదు

68 శ్రీ హరికృష్ణసింగ్, జిల్లా కన్వీనరు, భారత సేవక్ సమాజ్, హైదరాబాదు జిల్లా, ప్రభాత్ టాకీస్ ఎదుట, కాచిగూడ, హైదరాబాదు.

---

